# మను స్మృతి

## (మను ధర్మ శాస్త్రం)




పరిచయం: పోనుగోటి కృష్ణారెడ్డి

## తొలి ముద్రణకు

## ముందుమాట

రఘు వంశం రెండో సర్గం మొదట (శ్లో 2) దిలీప మహారాజు ధర్మపత్ని అయిన సుదక్షిణాదేవి వేదార్థాన్ని స్మృతి మాదిరిగా నందినీధేనువు వెళ్ళే దారిని అనుసరించిందని కాళిదాసు వర్ణించాడు. (....మనుష్యేశ్వర ధర్మపత్నీ శ్రుతేరివార్థం స్మృతి రన్వగచ్ఛత్) శ్రుతి అంటే వేదం. స్మృతి అంటే ధర్మశాస్త్రం. "వేదో ధర్మమూలమ్" అని గౌతముడు, సమస్త ధర్మాలకూ వేదమే మూలం. ఆ వేద ధర్మాన్ని ప్రతిపాదిస్తూ శాసించేది ధర్మశాస్త్రం. ఇదీ వేదంతో సమానమై పధ్నాలుగు విద్యల్లో ఒకటయింది.

ధర్మశాస్త్రం ధర్మాన్ని తెలుపుతుంది. జైమిని "చోదనా లక్షణోఽర్థో ధర్మః" అని చెప్పాడు. చోదన అంటే పురికొల్పటం అని అర్థం. వ్యక్తి చేయదగిన విధుల్ని బోధించేది ధర్మం. ధర్మాలు సామాన్యమనీ, విశేషమనీ రెండు రకాలు. సత్యం, అహింస, దయ, శౌచం మొదలయినవన్నీ సామాన్య ధర్మాలు. వర్ణాశ్రమ ధర్మాలు విశేష ధర్మాలు.

భారతదేశంలో ధర్మశాస్త్రాలు చాలా ప్రాచీనమయినట్టివి. మానవసమాజంతోనే సామాన్య విశేష ధర్మాలు రూపొందాయి. వేదాల్లోనే ధర్మాల్లోకి కొన్ని కనబడుతున్నాయి. సమాజం స్థాణువు కాదు కాబట్టి, పరిణామం చెందే తత్త్వం కలిగింది కావున ధర్మాలను కూడా కాలానుగుణంగా మార్పుల చేర్పులతో తిరిగి నిర్ణయించుకోవటం తప్పనిసరయింది. అప్పుడు శిష్ట పరిషత్తులు వేదవిరుద్ధంగాని విధంగా దేశకాల కులాచారాలను సమీక్షించి ధర్మాలను ప్రతిష్ఠించాయి. జార్జిబుహ్లార్ పరిశోధననుబట్టి మొదట ఈ విధంగానే ధర్మసూత్రాలు అవతరించాయి. వచన రూపం ధరించిన ఈ ధర్మ సూత్రాలు కాలక్రమాన ఛందో రూపాన్ని సంతరించుకొన్నాయి.

భారతదేశంలో దాదాపు ముప్పై అయిదు స్మృతులున్నాయి. వీటిల్లో మనుస్మృతి అగ్రగణ్యం. దీని తర్వాతనే యాజ్ఞవల్క్యస్మృతి, పరాశరస్మృతి మొదలయినవి లెక్కకు వస్తాయి. మనుస్మృతి అనగానే మనువు రచించిన స్మృతి అని

సాహిత్యపరున కెవనికయినా అర్థమవుతుంది. అయితే ఈ మనువెవ్వరో నిర్ణయించటం దుస్సాధ్యము. ఋగ్వేదములో పితృ మనువు ప్రస్తావన ఉన్నది. శతపథ బ్రాహ్మణంలోని జలప్రళయ కథలో మనువు కనబడతాడు. పురాణాల ప్రకారం పధ్నాలుగురు మనువులు గోచరిస్తారు. వీరిలో మొదటివాడు బ్రహ్మ పుత్రుడైన స్వాయంభువ మనువు. ఇతని సంతతివారే మానవులు. అమరకోశం కూడా మనువు వలన పుట్టినవారు మానవులనీ (మనోర్జాతా మనుజాః) మనువు సంబంధమయినవారు మానవులనీ (మనోరిమే మానవాః) పేర్కొంటున్నది. అయితే రామాయణం మాత్రం కశ్యపప్రజాపతికి ఎనిమిది మంది భార్యలున్నారనీ, వారివల్ల మానవునితోపాటు సమస్త ప్రాణులూ జన్మించాయనీ (అరణ్య కాండం. 14 సర్గం) చెప్తున్నది. కశ్యప ప్రజాపతి భార్యల్లో మనువు ఒకటి. ఆమె బ్రాహ్మణాది వర్ణములతో కూడిన మనుష్యులను కన్నది. (శ్లో 29)

మనువుల్లో రెండవవాడు స్వారోచిషుడు. ఇతడు స్వరోచికీ, వనదేవతకూ పుట్టినవాడు. అల్లసాని పెద్దన్న మనుచరిత్రంలో ఇతని వృత్తాంత మున్నది. మనువుల్లో ఏడవవాడు వైవస్వత మనువు. ఇతడు సూర్య పుత్రుడు. సూర్యవంశ రాజుల మూలపురుషుడు. కాళిదాసు వేదాలకు ఓంకారం మాదిరిగా రాజులకు మొట్టమొదటి వాడయిన వైవస్వతుడని ప్రసిద్ధి కెక్కిన మనువున్నాడని రఘువంశంలో [సర్గం 1. శ్లోకం 11) వర్ణిస్తాడు.

ఒక్కొక్క మనువు జీవిత కాలానికి మన్వంతరం అని పేరు. ఒక్కొక్క బ్రహ్మకల్పంలో పధ్నాలుగు మంది మనువులు మారతారు. ఒక మనువు పరిపాలనా కాలం నాలుగు లక్షల ముప్పైరెండువేల మనుష్య సంవత్సరాలని భాగవతం మూడో స్కంధంలో ఉన్నది. మనువు విశ్వపరిపాలనం చేసే ధర్మ నిర్ణేత అని భారతీయుల విశ్వాసం.

ఇది మనువృత్తాంతం. ఇప్పుడు మనకు లభించిన మనుస్మృతిని రచించిందెవరు? పౌరాణిక విశ్వాసం వేఱు. చారిత్రక పరిశోధనం వేఱు. మనుస్మృతి క్రీ.పూ. 500లో అవతరించిందని కొందఱు పరిశోధకులు పేర్కొన్నారు. మఱి కొందఱు క్రీ. పూ. 2వ శతాబ్ది క్రీ. శ. 2వ శతాబ్ది మధ్య కాలంలో ఇప్పటి మనుస్మృతి రూపొందిందన్నారు. ఏది ఏమయినా భృగు వంశీయులు మనుస్మృతిని రచించి ప్రజలకు దానియందు భయభక్తి గౌరవాలు కలగటానికి మనువు దాని సృష్టికర్త

అని చాటారనే మాట మాత్రం సత్యం. మనుస్మృతి మొదటి అధ్యాయమే దీనికి సాక్ష్యం. దీనితో మనువు తన దగ్గఱకు వచ్చిన ఋషులకు సృష్టి క్రమాన్ని వివరించి తర్వాత సకల మానవుల కుపయోగకరంగా తాను సృజించిన స్మృతిని వారి కుపదేశింపుమని భృగువునాజ్ఞాపించాడు. మనుస్మృతి భృగుసంహితగా పేరు పొందిందని మనం మరచిపోరాదు. భృగుపంశీయులు భారతం మహాభారతం గావటానికి కారకులయ్యారు. ఈ విధంగా దివ్యులను శాస్త్రకర్తలుగా పేర్కొనటం భారతీయుల పరిపాటి. తార్కాణంగా వ్యాకరణ శాస్త్రాన్నీ, నాట్యశాస్త్రాన్నీ చూపవచ్చు.

ఇంతేగాకుండా మనుస్మృతిలో ప్రక్షిప్తాలున్నాయి. అందువల్ల దానిలో స్వవచన వ్యాఘాతాలూ, పునరుక్తులూ చోటు చేసికొన్నాయి. మహాభారత మనుస్మృతుల్లోని సమానమయిన శ్లోకాలనూ అర్థ భావాలను మనం గుర్తింప వచ్చు.

పతంజలి మహాభాష్యంలో మనుప్రస్తావన ఉన్నది. శబరస్వామీ, శంకరాచార్యులు రచించిన భాష్యాల్లో మనుస్మృతి శ్లోకాలున్నాయి. క్షీరస్వామి అమరకోశ వ్యాఖ్యాత కొన్ని శ్లోకా లుదహరించాడు. భారవి, యశస్తిలక చంపూ రచయిత సోమదేవసూరి మనుధర్మాన్ని ప్రస్తావించారు. వలభిరాజుల శాసనాల్లో కూడా దానిని మనం చూస్తాము.

మనుస్మృతి వర్ణ ధర్మాలూ, ఆశ్రమ ధర్మాలూ, ధర్మ నిర్ణయాలూ, అభియోగ విచారణమూ వివిధ దండన విధానాలూ, రాజ్య సంబంధి విషయాలూ మొదలయిన వాటిని విపులంగా ప్రతిపాదిస్తుంది. నామకరణం, భిక్షాటనం మొదలయిన విషయాల్లో మనుస్మృతి తీరు విచిత్రంగా నిరంకుశంగా గోచరిస్తుంది. ఇది శూద్రుల పట్ల కఠినాతికఠినంగా, క్రూరంగా వ్యవహరిస్తుంది. స్త్రీల పట్ల ఔదార్యం చూపదు. మనుస్మృతి శిక్షాపద్ధతులు నిర్దేశిస్తూ చెప్పిన మాటలు కొన్ని వర్తమాన కాలంలో కూడా చెల్లుతాయి.

ఈ మనుస్మృతిని చిరంజీవి పి.వి. కృష్ణారెడ్డి నేటి పాఠకులకు తగినట్టు సరళమయిన తెలుగులో రుచి చూపించారు. శ్రీ కృష్ణారెడ్డి జీవితంలోనూ, సాహిత్యంలోనూ విలువలు నెలకొనాలని ఆరాటపడే రచయిత. ఆయన మాదిరిగా సంస్కృతిని గూర్చి ఆలోచించేవారు ఆయన తరంలో ఎక్కువమంది కనబడరు. భారతీయ సాంస్కృతంలో అతి ప్రధానమయిన మనుస్మృతి విశేషాలను తెలియజేసి ఈనాటి వారిని

ఆలోచింపజేసే రచనం ఇది. ఇటువంటి రచన లింకా చేయాలని శ్రీ కృష్ణారెడ్డిని కోరుతూ అభినందిస్తున్నాను.

ఈనాడు ఈ అనువాదం ఎంతయినా ఉపయోగకారి అవుతుంది. భారతదేశం విభిన్న జాతులకూ పలు తెగలకూ నిలయం. భారతీయ సంస్కృతి విభిన్న జాతుల సంస్కృతి. (ఈ సత్యాన్ని కప్పి పుచ్చి సిగ్గూ ఎగ్గూ లేకుండా ఈనాడు భారత దేశాన్ని మతరాజ్యాంగా మార్చాలని ప్రతీపశక్తులు ప్రయత్నిస్తున్నాయి.) ప్రజాస్వామ్యం ప్రసాదించే స్వత్వాలను కాలరాచివేయడానికి కంకణం కట్టుకొన్నాయి. భారతీయ సంస్కృతి మంచి సెబ్బలను తెలిసికొని దేశంలో విచ్చలవిడిగా పెచ్చు పెరిగి తిరుగుతున్న దుష్ట శక్తుల త్రుళ్ళు అణచివేయటానికీ, అసమానత్వాలను నామరూపాలు లేకుండా నశింపజేయటానికి ఈ తొంబైయారు పేజీల గ్రంథం తప్పకుండా తోడ్పడుతుంది- దీన్ని చదివే వారికి.

— నాగళ్ల గురు ప్రసాదరావు

# మనుస్మృతి

స్మృతి అంటే మానవుడు సంఘంలో ఎలా మెలగాలి ? పెద్దలపట్ల ఏ విధంగా వుండాలి ? గృహస్తుడిగా తన బాధ్యతల్ని ఎలా నిర్వర్తించాలి ? వ్యక్తిగా తన జీవన విధానం ఏ విధంగా వుండాలి ? జీవితంలో వివిధ దశల్లో ఎలా వ్యవహరించాలి? ఆయా వర్ణాల ప్రజలు, స్త్రీ పురుషులు ఆయా సందర్భాలలో ఎవరితో ఎలా వ్యవహరించాలి. ఇత్యాది ప్రవర్తనా నియమాలను తెలిపేది.

మనకు లభించిన స్మృతులలో తలమానికమైనది మనుస్మృతి. ఇది కాక ప్రధానమైన స్మృతులు దాదాపు ఇరవై రెండు వున్నాయి. వీటిలో పరాశర స్మృతి, గౌతమ స్మృతి, యాజ్ఞవల్క్య స్మృతి, విష్ణుస్మృతి, వాసిష్ఠ స్మృతి, పౌలస్త్యస్మృతి యమస్మృతి ముఖ్యమైనవి.

మనుస్మృతిని మనువు రూపొందించాడు. అయితే ఇప్పుడు మనకు లభ్యమవుతున్న మనుస్మృతిలో పక్షిప్తాంశాల పాలు ఎక్కువ. నిజానికి మనుస్మృతిలో నిజంగా మనువు చెప్పిన అంశాలు ఎన్నో, కాలానుగుణంగా ఇతరులు చొప్పించిన అంశాలు ఎన్నో ఇప్పుడు విడదీసి చెప్పడం కష్టం.

ప్రాచీన సంప్రదాయం ప్రకారం బ్రహ్మ తొలుత రచించిన స్మృతిని మనువుకు ఉపదేశించాడని, ఆ మనువు భృగుమహర్షికి బోధించాడని, ఆ భృగు మహర్షి సమస్త మునులకు వెల్లడించాడనేది మనుస్మృతి పుట్టుక గురించిన కథ.

ప్రతి బ్రాహ్మణుడు ఈ మనుధర్మ శాస్త్రాన్ని అధ్యయనం చేయాలని, శిష్యులకు చెప్పాలని, ఇతర వర్ణస్తులకు చెప్పరాదని, మనుస్మృతి చదివే అధికారం ఇతర వర్ణాల వారికి లేదని మనువు భావన.

వేదాలలోని, స్మృతులలోని విషయాలను గురించి తర్కించకూడదని, మరో ఆలోచన లేకుండా వీటిని అనుసరించాలే తప్ప, ఇవి సహేతుకమైనవా? కాదా? అని శాస్త్రీయ దృష్టితో తర్కించడం తప్పు అని, అలా తర్కించే వారిని సంఘం నుంచి బహిష్కరించాలని మనువు బోధించాడు.

మనుధర్మ శాస్త్రం ప్రకారం :

సకల సృష్టికర్త అయిన బ్రహ్మ ముఖం నుంచి బ్రాహ్మణులు, బాహువుల నుంచి క్షత్రియులు, తొడలనుంచి వైశ్యులు, పాదాల నుంచి శూద్రులు జన్మించారట.

వేదాలను, శాస్త్రాలను చదవడం, బోధించడం, యజ్ఞాలు చేయించడం చేయడం మొదలైనవి బ్రాహ్మణులు చేయాలి.

ప్రజా సంరక్షణ, దానాలు చేయడం, యాగాలు చేయడం మొదలైనవి క్షత్రియ ధర్మాలు.

గోసంరక్షణ, వ్యాపారం చేయడం, వ్యవసాయం చేయడం మొదలైనవి వైశ్య ధర్మాలు.

శూద్రులకు ఒకటే ధర్మం-అది మిగిలిన వర్ణాల వారికి సేవలు చేయడం.

శిరస్సు నుంచి పుట్టడంవల్ల, వేదాలు పఠించడం వల్ల మిగిలిన వర్ణాల వారికి బ్రాహ్మణుడు ప్రభువు. పుట్టుకతోనే బ్రాహ్మణుడు మనుషులందరిలోకీ గొప్పవాడు. ప్రపంచంలోని సకల సంపదలకు అతడే యజమాని.

లోకంలోని సర్వస్వం బ్రాహ్మణులదే కాబట్టి అనుభవించే సంపదలు అన్నీ వారివే. బ్రాహ్మణుల దయాగుణం వల్లనే వారి సంపదలను ఇతరులు అనుభవిస్తున్నారు.

ఆర్యావర్త ప్రదేశాన్ని దేవ నిర్మితమైన బ్రహ్మావర్తమంటారు. ఈ ప్రదేశంలో వివిధ వర్ణాల వారు వంశపారంపర్యంగా ఏ ఆచారాలను ఆచరిస్తున్నారో ఆ ఆచారాలే సదాచారాలు.

ఆర్యావర్తమే యజ్ఞాలకు యోగ్యమైన ప్రదేశం. కాబట్టి వివిధ ప్రాంతాలకు చెందిన బ్రాహ్మణులు ఈ ప్రాంతానికి చేరాలి. శూద్రులు జీవిక నిమిత్తం ఏ ప్రాంతానికయినా వెళ్ళవచ్చును.

0 0 0 0

బ్రాహ్మణ శిశువుకు పెట్టే పేరు శుభవాచకమై వుండాలి. క్షత్రియునకు పెట్టే పేరు బలవాచకమై వుండాలి. వైశ్యునకు ధనవాచకమై వుండాలి. శూద్రులకు పెట్టే పేర్లు నింద్యార్థమైనవిగా వుండాలి. ఉదాహరణకు బ్రాహ్మణుని పేరు శుభశర్మ క్షత్రియుని పేరు బలవర్మ, వైశ్యునికి పేరు వసుభూతి, శూద్రునికి పేరు దీన దాసుడు. స్త్రీల పేర్లు పిలవడానికి సులువుగా వుండాలి. మంగళవాచకమై, అందంగా వుండి, దీర్ఘాచ్చు అంతమందుగల పదాలు మంచివి.

బ్రాహ్మణునకు ఏడవయేట, క్షత్రియునకు పదవయేట, వైశ్యునకు పదకొండవ యేట ఉపనయనము చేయాలి. బ్రహ్మవర్చస్సునుగోరు బ్రాహ్మణునకు ఐదవయేట చతురంగ బలాల్ని గోరు క్షత్రియునకు ఆరవయేట, బహు సంపదలనుగోరు వైశ్యునకు ఎనిమిదవ యేట ఉపనయనము చేయాలి.

బ్రాహ్మణునికి పదహారవ సంవత్సరం వరకు, క్షత్రియునికి ఇరవై రెండవ సంవత్సరం వరకు, వైశ్యునికి ఇరవై నాలుగవ సంవత్సరము వరకు గాయత్రి నశిం పదు. ఈ వయసులు కూడా దాటి ఉపనయనము చేయనివారు గాయత్రినుంచి భ్రష్టు లవుతారు. సజ్జనుల చేత ద్వేషింపబదరాదు. ప్రాయశ్చిత్తము చేసుకొని ఇలాంటి వారితో వివాహ సంబంధాలు కలుపుకోకూడదు. ఆపదలలోకూడా వారితో సఖ్యంగా ఉండకూడదు.

బ్రహ్మచారులలో బ్రాహ్మణులు జింకతోలును, క్షత్రియులు రురుమృగ చర్మాన్ని, వైశ్యులు గొర్రె తోలును ఉత్తరీయంగా ధరించాలి. బ్రాహ్మణుడు నార బట్టను, క్షత్రియుడు పట్టుబట్టను, వైశ్యుడు ఉన్నిబట్టను కట్టుకోవాలి.

బ్రాహ్మణులు ప్రత్తినూలుతోను, క్షత్రియులు జనపనారతోను, వైశ్యులు తెల్లమేక బొచ్చుతోను పేని కుడివైపుగా చుట్టి తొమ్మిది పోగులుగల యజ్ఞోప వీతాన్ని భుజంపై ధరించాలి. మంచం మొదలైన ఎత్తయిన వాటిమీద పడుకోకూడదు.

బ్రాహ్మణ బ్రహ్మచారి బిల్వము, మోదుగలలో ఒక దానిని దండముగా ధరించాలి. బ్రాహ్మణుని దండము కురులవరకు ఉండాలి. క్షత్రియ బ్రహ్మచారి మర్రికొమ్మనుగాని, చంద్రకొయ్యనుగాని దండంగా ధరించాలి. క్షత్రియదండము నొసటివరకు మాత్రమే వుండాలి. వైశ్యబ్రహ్మచారి జువ్వి కొయ్యనుగాని, మేడి కొయ్యనుగాని దండంగా ధరించాలి. వైశ్యుల దండము ముక్కువరకు మాత్రమే వుండాలి. ఆ దండములు వంకరలేనివి, అగ్నిలో కాలనివి, సొగసైనవిగా వుండాలి. బ్రహ్మచారులు ఆ దండములతో బ్రాహ్మణులను భయపెట్టకూడదు.

ప్రతిదినము ఆ దండము గైకొని. సూర్యోపాసనముజేసి, అగ్నికి ప్రదక్షిణ గావించి, భిక్షాటన చేయాలి. భిక్షాటన గావించేటప్పుడు ఉపవీతుడైన బ్రాహ్మణుడు 'భవతి భిక్షాం దేహి' అంటూ భిక్షాటన చేయ్యాలి. క్షత్రియుడు 'భిక్షాం భవతి దేహి' అనాలి. వైశ్య బ్రహ్మచారి 'భిక్షాం దేహి భవతి' అంటూ భిక్షాటన చేయాలి.

తల్లినిగాని, సోదరినిగాని, పినతల్లి, పెదతల్లినిగాని ఎవరు ఈతనిని అవమానించరో ఆమెను యాచించాలి. తెచ్చిన మధుకరమును కావలసినంతవరకు గురువుకు నివేదించి, అతని అనుజ్ఞ పొంది తూర్పు ముఖంగా కూర్చుని భుజించాలి.

దీర్ఘాయుస్సు గోరువారు తూర్పు ముఖముగా కూర్చుని, కీర్తికాయులు దక్షిణాభి ముఖులై, సంపద గోరువారు పడమటివైపు దిరిగి, మోక్షకాములు ఉత్తరాభిముఖులై భుజించాలి.

భోజనం చేసేటప్పుడు నిర్మల మనస్కుడై వుండాలి. చింతలను వదలాలి.

'ఇలాంటి భోజనమే మనకెప్పుడూ లభించునుగాక" అని స్తోత్రము చేయాలి.అలా స్తుతించి చేసిన భోజనము శక్తినిస్తుంది. అలా స్తుతించకుండా భోంచేస్తే శక్తి నశిస్తుంది.

ఎంగిలి అన్నం ఎవ్వరికీ పెట్టకూడదు. మధ్యాహ్నం, రాత్రి తప్ప మధ్య మధ్య భోం చేయకూడదు. ఎంగిలి చేతితో అటు, ఇటు తిరగకూడదు. మితిమీరి భోజనము చేయకూడదు. మితిమీరి భోంచేయడం అనారోగ్య హేతువు. ఆయుస్సును నశింపజేస్తుంది. స్వర్గాది పుణ్యలోకాలకు, పుణ్యకార్యాలకు విరోధి. బ్రాహ్మణాదులు బ్రహ్మతీర్థంతో, దైవ తీర్థంతో ఆచమనం చేయాలి, పితృతీర్థంతో ఎప్పుడూ ఆచమనం చేయకూడదు.

బొటనవ్రేలి యొక్క మొదటిభాగాన బ్రాహ్మతీర్థమున్నదనియు, చిటికెనవ్రేలి మొదటియందు కాయతీర్థమున్నదనియు, వ్రేళ్ళ కొనలయందు దైవతీర్థమున్నదనియు, తర్జన్యంగుష్ఠముల మధ్యమున పితృ తీర్థం వున్నదని చెబుతారు.

స్త్రీలకు వివాహమే ఉపనయన కర్మ, భర్తకు సేవలు చేయడమే గురుకుల వాసము. గృహకృత్య నిర్వహణమే అగ్నిహోత్రము.

గురువు శిష్యునికి ఉపనయనము గావించి మొదట శౌచమును, ఆచారాన్ని అగ్నిహోత్ర, సంధ్యోపాసనములను నేర్పాలి.

ప్రతి రోజూ వేదాధ్యయనం ప్రారంభించేముందు, ముగించేముందు గురువు పాదాలను చేర్చి పట్టుకోవాలి. అధ్యయనం చేసేటప్పుడు చేతులు కట్టుకోవాలి. అలా చేతులు చేర్చడాన్ని బ్రహ్మాంజలి అంటారు.

వేదాధ్యయనం ప్రారంభించేముందు ప్రతిసారీ ఓంకారము నుచ్చరించాలి. అలా చేయకపోతే చదివింది క్రమంగా మర్చిపోతారు. వేదాధ్యయనం ముగించే ప్రతిసారి ఓం కారము ఉచ్చరించకపోతే చదివినది మనసులో నిలవదు.

బ్రాహ్మణుడు సంధ్యా సమయంలో, తక్కిన వేళల్లో రోజుకు వెయ్యిసార్లు గాయత్రిని జపిస్తే ఒక్క నెల రోజులలో పాము కుబుసం విడిచినట్లు సర్వపాపాల నుంచి విముక్తుడవుతాడు.

రోజూ గాయత్రి జపించని, హోమం చేయనివారు సజ్జనులతో నిందా పాత్రులవుతారు.

ఓం అనే ఒక్క అక్షరమే బ్రహ్మము. ప్రాణాయామములే గొప్ప తపస్సు. గాయత్రిని మించిన మంత్రము లేదు. మౌనము కంటే సత్యము చెప్పుట మేలు.

చెవి, ముక్కు, నాలుక, కళ్ళు, చర్మము ఇవి అయిదు జ్ఞానేంద్రియాలు.

వాక్కు, కాళ్ళు, చేతులు, అపానము, ఉపస్థము ఇవి ఐదు కర్మేంద్రియాలు. మనసు పదకొండవ ఇంద్రియము. మనసు తన కార్యమునుబట్టి జ్ఞానేంద్రియంగాను, కర్మను బట్టి కర్మేంద్రియంగానూ అవుతుంది. మనసును జయించిన వాడు జ్ఞాన, కర్మేంద్రియాలను రెంటినీ జయించినవాడు.

మనస్సు చెప్పినట్లు ఇంద్రియాలు ప్రవర్తిస్తున్నాయి. కాబట్టి ఇంద్రియ నిగ్రహం పాటించాలి. ఇంద్రియలోలురు ఇహలోకమున కష్టమును, పరలోకమున పాపమును పొందుదురు. ఇంద్రియములను అదుపులో పెడితే మోక్షసిద్ధి కలుగుతుంది, కాబట్టి ఇంద్రియాలను జయించాలి.

ఇంద్రియ సుఖాలను అనుభవించడంలో ఎప్పటికీ తనివితీరదు. అగ్నివ్యాపించినట్టు, కోరికలు తీర్చుకునే కొద్దీ హెచ్చవుతుంటాయి. కోరికలను ఉపేక్షించడం, కోరికలను విడవడం ఉత్తమం. చెడుమనసు గలవాడు వేదాలను అధ్యయనం చేసినా దానాలు చేసినా, యజ్ఞాలు చేసినా, తపస్సులు చేసినా ప్రయోజనంలేదు. ఏ మనిషి సుఖాలకు సంతోషింపడో, కష్టాలకు దుఃఖపడడో అతడే జితేంద్రియుడు.

ఇంద్రియాలన్నింటిలో ఏ ఒక్క ఇంద్రియలోలత్వం వున్నా, అతని జ్ఞానం కుండకున్న చిన్న రంధ్రం ద్వారా నీరంతా కారిపోయినట్లు నశిస్తుంది.

కాబట్టి ఇంద్రియాలను లోబరచుకొని, మనసును గట్టిపరచుకుని, ఉపాయంతో దేహాన్ని బాధపెట్టక సకలార్థాలను సాధించాలి. అలా సాధించిన పిదప అతడు క్రమంగా ఆ దేహాన్ని వదలాలి.

ప్రతి రోజూ ఉదయాన సూర్యోదయమయ్యేవరకు గాయత్రీ మంత్రాన్ని నిలబడి జపించాలి. సాయంత్రం నక్షత్రాలు కనిపించేంతవరకు కూర్చుని గాయత్రిని జపించాలి. ఉదయం పూట గాయత్రిజపం చేసి రాత్రి చేసిన (పాపాలను పోగొట్టుకుని, సాయంత్రం గాయత్రి జపంచేసి) పగలు చేసిన పాపాలను పోగొట్టుకోవాలి.

ఎవరు ఉభయ సంధ్యలను ఉపాసింపరో అట్టి వారిని శూద్రుని బహిష్కరించినట్టు అన్ని బ్రాహ్మణ కర్మలనుంచి బహిష్కరించాలి.

గురుపుత్రుడు బంధువు, సేవ చేయువాడు, మరో విద్య నేర్పువాడు, పరిశుద్ధుడు, చెప్పింది గ్రహించి గుర్తుంచుకునే సమర్థుడు, మేలు కోరేవాడు, వీళ్ళకు దక్షిణ తీసుకోకుండా చదువు చెప్పాలి.

తనను అడగకపోతే ఎవరికీ ఏమీ చెప్పకూడదు. భక్తి శ్రద్ధలు లేకుండా అడిగిన వాడికి ఏమీ చెప్పకూడదు. బుద్ధిమంతుడయినవాడు తనకు అన్నీ తెలిసి వున్నా మూగవాడిలా మౌనంగా వుండాలి.

ఎవరు అన్యాయంగా ప్రశ్నలు అడుగుతారో, ఎవరు అన్యాయంగా బదులు చెబుతారో వాళ్ళు చనిపోతారు, లేదా విరోధము పుట్టును.

ఎవరికి ధర్మము, ధనము రెండూ లేవో, ఎవడు శుశ్రూష చేయడో అలాంటి వానికి విద్య నేర్పకూడదు. అలాంటి వారికి నేర్పిన విద్య చవిటి భూమిలో నాటిన విత్తనంలాగా వ్యర్థం అవుతుంది.

యోగ్యుడయిన శిష్యుడు దొరకనప్పుడు ఎవరికీ చదువు చెప్పకపోవడమే మంచిది. అయోగ్యుడికి ఎటువంటి పరిస్థితులలోనూ విద్యాబోధన కూడదు.

ఎవరైనా వేదాలను కంఠస్థం చేస్తున్నప్పుడుగాని, వేరెవరికైనా బోధిస్తున్నప్పుడుగాని వాళ్ళ అనుమతి లేకుండా విని వేదాలను అభ్యసిస్తే అట్టి వ్యక్తికి వేదాలను అపహరించిన పాతకము చుట్టుకుని నరకం చేరుతాడు.

శాస్త్రానికి కట్టుబడి వున్న బ్రాహ్మణునకు గాయత్రి మంత్రము ఒక్కటే వచ్చినా చాలు. శాస్త్రానికి కట్టుబడని, ఆచారాలను పాటించని బ్రాహ్మణుడు మూడు వేదాలను క్షుణ్ణంగా అధ్యయనం చేసిన వాడయినా హీనుడే.

తనకన్నా యోగ్యుడు, పెద్దవాడు వచ్చినప్పుడు తాను ఆసనం మీదనుంచి లేచి అభివాదం చేయాలి. అలా చేసేవ్యక్తి ఆయుస్సు, విద్య, యశస్సు, బలము— ఈ నాలుగు వృద్ధి చెందుతాయి.

మేనమామ, పినతండ్రి, పిల్లనిచ్చినమామ, బ్రాహ్మణుడు, గురువు వచ్చినప్పుడు, ఆ వచ్చిన వ్యక్తి తనకన్నా చిన్నవాడు అయినప్పుడు అతన్ని ఆహ్వానించి తన పేరు మాత్రం చెప్పి పిలుచుకుని రావాలి. అంతేకాని అభివాదం చేయకూడదు.

తల్లి తోబుట్టువు, మేనత్త, అత్త-వీరు గురుపత్నితో సమానులు. కావున వీరికి గురుపత్నికి చేసినట్టు అభివాదం చెయ్యాలి.

అన్న సజాతి స్త్రీని వివాహం చేసుకుంటే అన్న భార్యకు ప్రతిదినము పాదాభివందనం చేయాలి. పినతండ్రి, మేనమామలు, వారి భార్యలు దేశాంతరము నుంచి వచ్చినప్పుడు నమస్కరించాలి. కాని మాటి మాటికి అభివాదనము చేయనక్కర లేదు.

తండ్రి తోడబుట్టిన ఆమె యందును, పెద్దతల్లియందు, అక్కపై తల్లిపై వలే గౌరవం వుంచాలి. వీరందరిలో తల్లి పూజ్యురాలు.

ఒక ఊరిలో వున్నవారు తనకంటే పదేళ్ళు పెద్దవాడైన ఆ ఊరి వాడితో స్నేహం చేయాలి. సంగీతం మొదలైన కళలు నేర్చిన వాడయితే అతను ఐదేళ్ళ

పెద్దవాడయినా అతనితో స్నేహం చేయవచ్చు, అదే వేదాధ్యయనం చేసిన వాడయితే అతను మూడేళ్ళ పెద్దవాడయినా అతనితో స్నేహం చేయవచ్చు. దాయాది అయితే కొద్దిగా పెద్దవాడయినా స్నేహం చేయవచ్చు.

పదేళ్ళ బ్రాహ్మణుని, నూరేళ్ళ క్షత్రియుణ్ణి వరుసగా తండ్రీ కొడుకులుగా భావించాలి. వీళ్ళల్లో పదేళ్ళ బ్రాహ్మణుడినే తండ్రిగా భావించాలి.

ధనం, బంధువులు, వయస్సు, అనుష్ఠానం, చదువు - ఇవి పూజింపదగినవి. ఇందులోనూ ధనంకంటే బంధువులు గలవాణ్ణి, బంధుత్వం కంటే వయసు, వయసు కంటే అనుష్ఠానం, అనుష్ఠానం కన్నా చదువు గొప్పవిగా భావించాలి.

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య వర్ణాలలోని ఎవరిలో పైన చెప్పిన ఐదు గుణాలు ఎక్కువగా వుంటాయో, అతడు మిగిలిన వారికన్నా పూజనీయుడు.

దారిలో వెళ్ళేటప్పుడు బండిలో వెళ్ళేవాళ్ళకు, ముసలివాళ్ళకు, రోగికి బరువులు మోసేవాళ్ళకు, స్త్రీలకు, రాజుకి, వరునికి దారి యివ్వాలి.

శిష్యునికి ఉపనయనం చేసి, వేదాలను కల్పసూత్రాలతోను, ఉపనిషత్తులతో అధ్యయనం చేయించిన బ్రాహ్మణుని ఆచార్యుడని అనవచ్చు.

జీవన భృతికోసం వేదంలో కొంత భాగాన్నిగాని, వేదాంగాలను గాని, వ్యాకరణాన్ని గాని శిష్యులకు బోధించే బ్రాహ్మణుని ఉపాధ్యాయుడు అనాలి.

ఏ బ్రాహ్మణుడు గర్భాదానం మొదలయిన కర్మలను చేయించునో, ఏ బ్రాహ్మణుడు అన్నము పెట్టి పోషించునో వానిని గురువు అనాలి.

నూరుగురు ఉపాధ్యాయుల కంటే ఒక ఆచార్యుడు, వందమంది ఆచార్యుల కంటే ఒక తండ్రి, నూరుగురు తండ్రుల కంటే ఒక తల్లి ఎక్కువ గౌరవనీయురాలు.

ఉపనయనం చేసుకున్న వానికి వేదాధ్యయనం, వేదార్థజ్ఞానం, అనుష్ఠానం వీటినే మోక్షసిద్ధి కలుగుతుంది. కాబట్టి వీటిని బోధించే ఆచార్యుడే శ్రేష్ఠుడు.

తనకు ఎవరు వేదశాస్త్రిలను కొద్దో, గొప్పో బోధిస్తారో వారినే గురువుగా భావించాలి.

ఉపనయనం చేసిన వానిని, వేదార్థమును వివరించిన వానిని వయసులో తన కన్నా చిన్నవాడయినప్పటికీ తండ్రిగా భావించాలి.

జ్ఞాన శూన్యుడే బాలుడు. మంత్రము, వేదము చెప్పువాడు తండ్రి. వేదము తెలియనివాడు బాలుడు. బోధించేవాడు తండ్రి. తల నెరిసినందువల్ల వృద్ధుడు కాదు. చిన్నవాడయినా వేదాధ్యయనం చేసినవాడు వృద్ధుడు.

బ్రాహ్మణునికి జ్ఞానముచేత, క్షత్రియునికి సీలత్వము వల్ల, వైశ్యునికి ధన ధాన్యాల వల్ల, శూద్రునికి వయసుచేత గొప్పతనం లభిస్తుంది.

అధ్యయనం చెయ్యని బ్రాహ్మణుడు కొయ్య ఏనుగులాగా, తోలుతో చేసిన మృగంలాగా పేరుకే బ్రాహ్మణుడు. వేదాధ్యయనం చేయని బ్రాహ్మణుడు వ్యర్థుడు.

నీతి ఎరిగిన ఆచార్యుడు శిష్యులను క్రూరంగా దండించక దయతో,యింపుగా మంచి విషయాలను బోధించాలి.

ఎవరి మనసు రాగ ద్వేషాలతో చెడక నిర్మలమై వుంటుందో, ఎవరి వాక్కు అసత్యాలతో మలినం కాకుండా వుంటుందో అతడు వేదాలలో చెప్పినట్లు సర్వజ్ఞత, సర్వేశ్వరత్వ రూపమైన ఫలాన్ని పొందుతాడు.

తాను నొచ్చుకున్నా యితరులు నొచ్చుకునేట్లు మాట్లాడకూడదు. ఇతరులకు ద్రోహం కలిగించే కార్యాలను మనసులోకి కూడా రానివ్వకూడదు. ప్రజలకు భయము, ఆందోళన కలిగించే మాటలు మాట్లాడకూడదు.

అవమానాలను ఓర్పుతో సహించాలి. ఇతరులు అవమానించారని విచార పడకూడదు. అలా అవమానాన్ని దిగ్రమింగుకుని విచారపడనివాడు సుఖంగా నిద్ర పోతాడు. సమాజంలో సుఖంగా తిరుగుతాడు. అవమాన పరచినవాడు ఆ పాప ముతో నశిస్తాడు.

బ్రాహ్మణుడెప్పుడూ వేదాలను, ఉపనిషత్తులను అధ్యయనం చేయాలి. ఎవడు వేదాధ్యయనం చేయక యితర శాస్త్రాలను అభ్యసించునో అతడు అతని వంశస్థులు శూద్రత్వం పొందుతారు.

బ్రాహ్మణునకు తల్లి గర్భమునుంచి మొదటి జన్మము, ఉపనయనం రెండవ జన్మము, యజ్ఞము తృతీయ జన్మము.

ఉపనయన మయ్యేదాకా శ్రాద్ధకాలమున చెప్పవలసిన మంత్రాలు తప్ప మరే యితర వేదమంత్రాలు చెప్పకూడదు. వేదం వలన మరోజన్మ కలిగేవరకూ (ఉపనయనం అయ్యేవరకు) బ్రాహ్మణుడూ, శూద్రునితో సమానుడే.

బ్రహ్మచారి తేనెను, మాంసమును తినరాదు. కర్పూర చందన కస్తూరాది సువాసన ద్రవ్యాలను వాడరాదు. వీటిని కలిపిన పదార్థాలను తినకూడదు. పువ్వులు ధరించరాదు. స్త్రీలతో సంభోగించరాదు. ప్రాణి హింస చేయకూడదు. పాదరక్షలు ధరించకూడదు. క్రోధాన్ని, లోభాన్ని విడిచిపెట్టాలి. పాటలు పాడ కూడదు. నాట్యం చేయకూడదు. సంగీత వాయిద్యాలు వాయించరాదు. జూదం

ఆడకూడదు. ఇతరులతో వృధాగా తగాదా పడకూడదు. ఇతరులను నిందించ కూడదు. అబద్ధాలు చెప్పకూడదు. స్త్రీలవైపు కోర్కెతో చూడకూడదు.

బ్రహ్మచారి ఒంటరిగా పడుకోవాలి. కోరికతో రేతస్సును విడవకూడదు. కామంతో రేతస్సును విడిచేవాడు బ్రహ్మచర్యవ్రతాన్ని పోగొట్టుకున్నట్లే. అలా బ్రహ్మచర్య వ్రతాన్ని కోల్పోయినవాడు ప్రాయశ్చిత్తం చేసుకోవాలి. స్వప్నంలో రేతస్ఖలనం చేసినవాడు మరునాడు ఉదయాన స్నానంచేసి సూర్యభగవానుణ్ణి ఉపాసించి "ఇంద్రియాన్ని మళ్ళీ పొందుదునుగాక" అనే ఋక్కును మూడుసార్లు జపించాలి.

బ్రహ్మచారి ప్రతిరోజూ భిక్షాటనం చేయాలి. గురుకులంలో, బంధువుల ఇళ్ళల్లో భిక్షాటనం చేయకూడదు. ఇతరుల ఇళ్ళు దొరకనప్పుడు బంధువుల ఇళ్ళు, అవి లేనప్పుడు గురుకులంలో భిక్షాటనం చేయాలి.

బ్రహ్మచారి ప్రతిరోజూ చాలామంది ఇళ్ళనుంచి తెచ్చిన అన్నాన్ని తినాలి. ఒక్కరి ఇంటి నుంచి తెచ్చిన అన్నాన్ని తినకూడదు. అలా భిక్షాన్నంతో బ్రహ్మచారి జీవించడం ఉపవాసంతో సమానమని మునులు అంటారు. అయితే బ్రాహ్మణబ్రహ్మచారి మాత్రమే ఒక్క ఇంటి భోజనాన్ని తినకూడదు. క్షత్రియ, వైశ్య బ్రహ్మచారులు తినవచ్చు.

గురువు సన్నిధానంలో గురువు కంటే మంచి ఆహారం తినకూడదు. గురువు కంటే మంచి బట్టలు కట్టకూడదు గురువు పడుకున్నాక పడుకోవాలి. గురువు నిద్ర లేవకముందే నిద్ర లేవాలి.

గురువును పేరుపెట్టి మాట్లాడకూడదు. గురువులా మాట్లాడి, నడిచి, నటించి అతన్ని వెక్కిరించకూడదు. గురువును ఎవరైనా నిందిస్తుంటే చెవులు మూసుకోవాలి. లేదా వేరొక చోటికి పోవాలి.

శిష్యుడు గురువుపై అపవాదు మోపితే గాడిదగా,నిందిస్తే కుక్కగా, గురువు సంపదను అనుభవిస్తే పురుగుగా, గురువును ద్వేషిస్తే కీటకంగా జన్మిస్తారు.

నావ, ఎడ్లబండి, మేడ, చాప,రాయి మొదలైన వాటి మీద మాత్రం గురువుతో సమానంగా కూర్చోవచ్చు.

గురువునకు గురువు వచ్చినప్పుడు, గురువునకు నమస్కరించినట్లే ఆయనకూ నమస్కరించాలి. గురువు ఇంట్లో ఉండేటప్పుడు తల్లిదండ్రులు వచ్చినా గురువు అనతి లేకుండా వారికి నమస్కారం చేయకూడదు.

సజాయితీయులైన గురుపత్నులు గురువువలె పూజింపదగినవారు. గురుపత్ని జవరాలైతే యవ్వనంలో వున్న శిష్యుడు ఆమెకు పాదాభివందనం చేయకూడదు. పురుషులను మోహానికి లోనుచేసి వాళ్ళను పతనం చేయడం స్త్రీల స్వభావం కాబట్టి విద్వాంసులు స్త్రీల విషయంలో ఏమరపాటుగా నుండకూడదు.

పురుషుడు విద్వాంసుడైనా, అవిద్వాంసుడైనా స్త్రీల వలలో పడటం సహజం. స్త్రీలు కామక్రోధ వశుడైన విద్వాంసుడినైనా, మూఢుడినైనా లొంగదీసి చెడు దారికి ఈడ్వ గలిగినవారు.

ఇంద్రియాలు బలం గలవి కాబట్టి వివేకం గలవారినైనా చెడుదారి కీడు కాబట్టి తల్లితోగాని, సోదరితోగాని కూతురుతోనయినా ఒంటరిగా కూర్చోకూడదు.

బ్రహ్మచారి బోడిగుండుతోగాని, జడలతోగాని ఉండాలి. సూర్యుడస్తమించక ముందు, సూర్యుడు ఉదయించిన తరువాత బ్రహ్మచారి నిద్రింపకూడదు. అలా పొరపాటున నిద్రిస్తే మరునాడు పగలంతా గాయత్రీ జపం చేస్తూ, ఉపవాసం వుండి, రాత్రి భోజనం చేయవచ్చు. ఇలా ప్రాయశ్చిత్తము చేసుకోని వాడిని మహాపాపం చుట్టుకుంటుంది.

ధర్మార్థాలు కామ హేతువులవడంవల్ల శ్రేష్ఠమయినవని కొందిరుఅంటారు. అర్థకామములు సుఖాన్ని కలిగిస్తాయి. కాబట్టి అవి శ్రేష్ఠమయినవని కొందరు అంటారు. ధర్మం, అర్థకామాలకు కారణం కాబట్టి ధర్మం శ్రేష్ఠమని కొందరు అంటారు. అర్థమే ధర్మ కామాలకు హేతువు కాబట్టి అర్థమే శ్రేష్ఠమని కొందరు చెబుతారు. కానిధర్మార్థ కామములు మూడూ పురుషార్థములు కాబట్టి అవి శ్రేష్ఠములని. మనువు అభిప్రాయం.

ఆచార్యుడు పరమాత్మ స్వరూపుడు. తండ్రి హిరణ్యగర్భ స్వరూపుడు, తల్లి భూదేవి స్వరూపురాలు అన్న ఆత్మ స్వరూపుడు- వీరు దేవతా స్వరూపులు కాబట్టి వీళ్ళను తిరస్కరింపకూడదు.

గురువు తల్లిదండ్రులు, అన్న వీరివల్ల తానెంత బాధపడ్డా వారిని తిరస్కరింపకూడదు. ముఖ్యంగా బ్రాహ్మణులు ఈ విషయాన్ని తప్పక పాటించాలి. వీరు ముగ్గురికీ శుశ్రూష చేయడమే ఉత్తమ తపస్సు. వాళ్ళ అనుమతి లేకుండా మరియే ఇతర పుణ్యకార్యం చేయకూడదు. వారే ముజ్జగములు, వారే వేదములు, వారే యజ్ఞాదిఫల దాతలు కనుక త్రేతాగ్నులు. ఎవడు తల్లిదండ్రులు, గురువులను ఆదరించునో వాడు అందరిని ఆదరించువాడు ఎవడీ ముగ్గురినీ తిరస్కరించునో అతని అన్ని క్రియలు నిష్ఫలము.

| శ్రద్ధగలవాడు తనకన్న తక్కువవాని నుంచైనా విద్యను గ్రహించాలి. తక్కువ కులం వారినుంచైనా స్త్రీని గ్రహించాలి. |

స్త్రీలు, రత్నాలు, విద్య, ధర్మము, ఆమోదము, సుభాషితము, నానా విధ వృత్తులు శిల్పాలను ఎక్కడనుంచి అయినా గ్రహించవచ్చు.

మోక్షాన్ని పొందగోరు బ్రహ్మచారి శిష్యుడు బ్రాహ్మణేతరుడయిన గురువుకు, వేదాధ్యయనం చేయని బ్రాహ్మణుడికి యావజ్జీవం శుశ్రూష చేయకూడదు.

శరీరం నశించేదాకా ఎవడు గురు శుశ్రూష చేయునో అతడు తప్పక శాశ్వత బ్రహ్మలోకమును పొందుచున్నాడు.

వేదాధ్యయనం చేయడానికి ముందు శిష్యుడు గురువుకు ఏ విధమైన దక్షిణ ఇవ్వకూడదు. వేదాధ్యయనం ముగిసిన పిదప, వివాహం చేసుకోడానికి గురువు అనుమతి పొంది ఆ తరువాత గురువు కోరిన దానిని దక్షిణగా సమర్పించాలి.

భూమి, బంగారము, ఆవులు, గుర్రాలు, గొడుగు, పాదరక్షలు, ఆసనము, ధాన్యము, కూరగాయలు, బట్టలు వీటిని దక్షిణగా ఇస్తే గురువుకు సంతోషం కలుగుతుంది.

మూడు వేదాలను అధ్యయనం చేయడానికి గురుకులంలో ముప్పది ఆరు సంవత్సరాలు వుండాలి. లేదా పదునెనిమిది సంవత్సరాలు లేదా తొమ్మిది సంవత్సరాలు లేదా కనీసం నేర్చుకునేంతవరకైనా బ్రహ్మచర్యాన్ని అవలంబిస్తూ గురుకులంలో వుండాలి.

మూడు వేదాలను గాని, రెండు వేదాలనుగాని, కనీసం తన శాఖా వేదాన్ని గాని గురువువద్ద బ్రహ్మచారిగా వుంటూ అభ్యసించి ఆ తరువాత గృహస్థాశ్రమంలో ప్రవేశించాలి.

దీర్ఘ వ్యాధిగల స్త్రీని, రోమములు అసలులేని, లేక ఎక్కువ రోమములు గల స్త్రీని, కపిలవర్ణపు కేశములు గల స్త్రీని, కఠినంగా మాట్లాడే స్త్రీని, దేహం పెద్దది గల స్త్రీని, పసుపు పచ్చని కన్నులుగల కన్యను వివాహం చేసుకోకూడదు.

పర్వతాలు, నక్షత్రాలు, వృక్షాలు, నదులు వీటి పేర్లుగల, పక్షి, పాము, దాసులు, హీనజాతి పేర్లుగల, భీకరనామంగల స్త్రీని వివాహం చేసుకోకూడదు.

చక్కని అవయవాలు గల హంసలా, ఏనుగులా తిన్నగా నడిచే, పలుచని రోమాలు, మంచి కురులు, దంతాలు గల, మృదు శరీరంగల కన్యను వివాహం చేసుకోవాలి.

ఏ కన్యకు సోదరుడు లేడో, ఏ కన్యకు తండ్రి ఎవడో తెలియదో ఆమెను ప్రాజ్ఞుడు వివాహం చేసుకోకూడదు.

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులకు మొదటి వివాహం చేసుకునేందుకు స్వజాతి

కన్యయే శ్రేష్ఠురాలు. కామికి ఈ కింది అనులోమ వివాహాలు శ్రేష్ఠము. శూద్రునికి శూద్రకన్యయే శ్రేష్ఠురాలు. వైశ్యునికి వైశ్య కన్య, శూద్రకన్య శ్రేష్ఠం. క్షత్రియునికి క్షత్రియ, వైశ్య, శూద్ర కన్యలు శ్రేష్ఠం. బ్రాహ్మణునికి బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య శూద్ర కన్యలు శ్రేష్ఠం.

మోహంచే హీనజాతి స్త్రీని వివాహం చేసుకునే బ్రాహ్మణులు తమ కులాన్ని సంతతిని శూద్రత్వం నొందిస్తున్నారు.

బ్రాహ్మణుడు శూద్రస్త్రీని వివాహం చేసుకుంటే భ్రష్టుడవుతాడని అత్రి మహర్షి, గౌతమ మహర్షి చెప్పారు. బ్రాహ్మణుడు శూద్రస్త్రీతో పుత్రుణ్ణి కంటే ఆ పిల్లవాడి తండ్రి పతితుడవుతాడని శౌనక మహాముని చెప్పాడు. బ్రాహ్మణునికి, శూద్రకన్యకు పుట్టినవాడు పతితుడవుతాడని భృగుమహర్షి చెప్పారు.

శూద్రస్త్రీని శయ్యపైకి ఎక్కించుకున్న బ్రాహ్మణుడు అధోగతి పొందుతాడు. ఆ శూద్రస్త్రీతో పిల్లల్నికంటే బ్రాహ్మణత్వాన్నే కోల్పోతాడు.

ఏ బ్రాహ్మణుడు తన భార్య అయిన శూద్ర స్త్రీచేత హోమములు, శ్రాద్ధ కర్మలు, అతిథి పూజలు జరిపిస్తాడో వాటిని దేవతలు, పితృదేవతలు గైకొనరు. అట్టి బ్రాహ్మణునికి స్వర్గలోక ప్రాప్తి లేదు.

శూద్రస్త్రీ అధరపానం చేసినవానికి, శూద్రస్త్రీ నిట్టూర్పు సోకిన వానికి శూద్ర స్త్రీకి సంతతి పుట్టించిన వానికి ప్రాయశ్చిత్తము లేదు.

**వివాహం ఎనిమిది రకాలు**, అవి-బ్రాహ్మము, దైవము, ఆర్షము, ప్రాజాపత్యము, ఆసురము, గాంధర్వము, రాక్షసము, పైశాచము. ఈ ఎనిమిదింటిలో పైశాచం అధమము, బ్రాహ్మ, దైవ, ఆర్ష, ప్రాజాపత్యములు-ఈ నాలుగు వివాహాలు బ్రాహ్మణునికి మేలయినవి, ఆసుర, పైశాచ వివాహములు తప్ప మిగిలినవి క్షత్రియులకు సమ్మతములు. రాక్షసము తప్ప మిగిలిన వివాహాలు వైశ్య, శూద్రులకు ధర్మశాస్త్ర విహితమే అని తెలుసుకోవాలి.

వేదాధ్యయనం చేసి, సదాచార వంతుడయిన ఒక బ్రహ్మచారిని తానుగా రప్పించి, మర్యాదలు చేసి, అలంకరించిన కన్యను అతనికి ఒసగడాన్ని బ్రాహ్మ వివాహం అంటారు.

జ్యోతిష్టోమము మొదలయిన యజ్ఞాలలో అధ్వర్యం చేసే ఋత్విజునికి కన్యను ఇవ్వడం దైవ వివాహ మంటారు.

యాగాది సిద్ధికోసంగాని, కన్యకు ఇవ్వడానికిగాని రెండు ఆవులనో, రెండు

ఎద్దులనో వరుని నుంచి తీసుకుని శాస్త్రప్రకారం వరునికి కన్యను ఇవ్వడం ఆర్ష వివాహమంటారు.

"మీ ఇద్దరూ కలిసి ధర్మమాచరించండని చెప్పి కన్య తల్లిదండ్రులు వరుని పూజించి పిల్లనివ్వడం ప్రాజాపత్య వివాహం అంటారు.

జ్ఞాతులకు, పిల్లకు కావలసిన ధనం ఇచ్చి తమ ఇష్టంతో పెళ్ళిచేసుకోవడాన్ని అసుర వివాహమంటారు. స్త్రీ పురుష లొకరికొకరు ఇష్టంతో అంగీకరించి కలవడాన్ని గాంధర్వమంటారు. ఈ వివాహం కామసంబంధమైనది. మైధున కర్మ కోసం ఏర్పడింది.

కన్యక బంధువులు సమ్మతింపనప్పుడు వారిని చంపిగాని లేదా నాశనం చేసి వాళ్ళకోసం విలపిస్తున్న కన్యను బలవంతంగా తెచ్చుకోవడం రాక్షస వివాహం అంటారు.

నిద్రించే ఆమెనుగాని, మత్తులోవున్న ఆమెనుగాని, ఏమరుపాటుతోనున్న ఆమెనుగాని బలాత్కారముగా, ఏకాంతముగా క్రీడించడాన్ని పైశాచికం అంటారు. ఈ వివాహం మిక్కిలి నీచమైంది.

జలధారాపూర్వకంగా కన్యాదానం చేయడం బ్రాహ్మణులకు ఉత్తమం. ఉదక ధారా పూర్వకంగా కన్యాదానం చేయాలన్న నియమం క్షత్రియాది తక్కిన వర్ణాల వారికి లేదు. తల్లిదండ్రులు మాట ఇవ్వడం, వధూవరులకు ఇష్టం వుంటే చాలు.

బ్రాహ్మ వివాహముచే పుట్టిన కుమారుడు పుణ్యం చేసినవాడు. అతడు తన ముందటి పది తరాల వారిని, తన తరువాత పది తరాల వారిని పాపాల నుంచి విముక్తం చేస్తాడు.

దైవ వివాహం చేసుకున్న దంపతులకు పుట్టినవాడు ముందు ఏడు తరాల వారిని, తరువాత ఏడు తరాలవారిని పాపవిముక్తులను చేస్తాడు. ఆర్ష వివాహజాతుడు ముందు వెనుకల మూడుతరాల వారిని, ప్రాజాపత్య వివాహజాతుడు "ముందు వెనుకల ఆరు తరాల వారిని ఋణ విముక్తుడిని చేస్తాడు.

బ్రాహ్మము, దైవము, ఆర్షము, ప్రాజాపత్యము మొదలైన నాలుగు వివాహాల్లో జన్మించిన పుత్రులు వేదాధ్యయన సంపత్తి వలన వచ్చిన తేజస్సు కలిగిన వారై, పెద్దలకు ఇష్టమైన వారుగా జన్మిస్తారు. వీరు మంచి రూపము, గుణము, బలము గలవారై, ధనవంతులై కీర్తి ప్రతిష్ఠలు పొందుతారు. నూరేళ్ళు జీవిస్తారు.

రాక్షస వివాహం వలన జన్మించిన పుత్రులు క్రూరులు, అసత్యవాదులు, వేదవిరోధులు, యాగాదికర్మ ద్వేషులై వుంటారు.

భార్యను సంతోషపెట్టడమే వ్రతంగా భావించి, ఇతర స్త్రీలను కోరక భార్యను ప్రేమించాలి.

స్త్రీలకు సహజంగా పదహారు దినాలు ఋతుకాలం.అందులో మొదటి నాలుగు రోజులు సజ్జన నిందితాలు. ఈ ఋతుకాలం దినాలలో మొదటి నాలుగు, పదకొండవ పదమూడవ దినాలు దాంపత్య జీవితానికి పనికిరావు. తక్కిన పది రాత్రులు ప్రశస్తమైనవి. ఈ పది రాత్రులలో ఆరు,ఎనిమిది మొదలగు సరి రాత్రులలో స్త్రీతో కలిస్తే పుత్రులు పుడతారు. బేసి రాత్రులలో సంగమంవల్ల స్త్రీలు పుడతారు. కాబట్టి పుత్రుణ్ణి కోరుకునే వ్యక్తి సరిరాత్రులలో, పుత్రికను కోరుకునే వ్యక్తిబేసి రాత్రులలో భార్యతో కలవాలి.

వివేకి అయిన కన్యతండ్రి, వరుని నుంచి కొద్దిగా అయినా ఓలి తీసుకోరాదు. అలా ఓలి తీసుకోవడమంటే బిడ్డను అమ్ముకున్నట్లే.

కన్యకు వివాహకాలంలో ఇచ్చిన ధనాన్ని, వాహనాలను, వస్త్రాలను ఆ కన్య తండ్రిగాని, బంధువులుగాని వాడుకుంటే వాళ్ళు పాపం చేసిన వాళ్ళై అధోగతి పాలవుతారు. కన్యలకు ప్రీతితో ఒసగిన ధనాన్ని వారి నిమిత్తమే ఉపయోగించాలి.

ఏ కులంలో స్త్రీలు గౌరవింపబడుదురో ఆ కులం వారిపై దేవతలు దయ గలిగివుంటారు. ఏ కులం స్త్రీలను గౌరవించరో ఆ కులం వారు చేసే దైవక్రియ లన్నీ వృథా.

కాబట్టి ఐశ్వర్యం కోరే మానవులు ఉత్సవాలప్పుడు, వివాహాలప్పుడు తోబుట్టువులు మొదలైన స్త్రీలను వస్త్ర భూషణాదులతో సత్కరించాలి.

ఏ వంశంలో భర్తవల్ల భార్య, భార్యవల్ల భర్త సంతోషంగా వుంటారో ఆ వంశంలో సంపద తాండవమాడుతుంది.

గృహస్థుడు చేట, రోలు, రోకలి, ఇంటిపాత్రలు శుద్ధిచేసే అలుకుచుట్ట. నీళ్ళకడవ- వీటిని ఉపయోగించడం వల్ల ఐదు హత్యాపాపములను పొందుతున్నాడు. ఈ ఐదు పాపాలను పోగొట్టుకోవడానికి ఐదు మహాయజ్ఞాలు చేయమని పండితులు గృహస్థులకు బోధించారు.

వేదాలు చెప్పడం, తాను చదవడం-బ్రహ్మయజ్ఞం,పితరులను తర్పణములతో తృప్తినొందించడం పితృయజ్ఞము. అగ్నియందు వేల్చు హోమం దైవయజ్ఞము. వైశ్యదేవము, భూత బలి-ఇవి భూత యజ్ఞము, అతిథిపూజ మనుష్య యజ్ఞము.

ఎవరు ఈ ఐదు యజ్ఞాలను వదలక యథాశక్తి ఆచరిస్తారో వారిని పై ఐదు హత్యాపాపాలు అంటవు.

దేవతలకు, భూతములకు, అతిథులకు, పితరులకు ఏ గృహస్థుడు అన్నము నొసగడో అతను జీవించివున్నా మరణించినవాడి క్రిందే లెక్క.

అహుతము, హుతము, ప్రహుతము, బ్రాహ్మ్యహుతము, ప్రాశితము అనునవి పంచ యజ్ఞములు. అహుతమనగా జపము. హుతమనగా అగ్నిహోత్రమునందు చేసే హోమము. ప్రహుత మనగా భూతముల కొసగే బలి. బ్రాహ్మ్యహుత మనగా బ్రాహ్మణోత్తముని పూజ, ప్రాశిత మనగా పితృతర్పణము.

దారిద్ర్యంతో నిత్యం అతిథిపూజ చేయలేని బ్రాహ్మణుడు ఎల్లప్పుడు వేదాధ్యయనంపై శ్రద్ధ కలిగి వుండాలి. అగ్నిహోత్రమునందు, దైవకర్మలపై శ్రద్ధ గలవాడు చరాచర రూపమగు ప్రపంచాన్ని పోషింపగలుగుతాడు. ప్రాణవాయువు నాశ్రయించి జీవులు జీవించినట్లు గృహస్థుని ఆశ్రయించి తక్కిన యాశ్రమస్థులు జీవిస్తారు.

గృహస్తుడు మిగిలిన ఆశ్రమముల వారిని వేదాధ్యయనం చేయించి, అన్న పానముల నొసగి ప్రతిరోజూ వారిని పోషిస్తున్నాడు. కాబట్టి మిగిలిన ఆశ్రమముల వారికన్నా గృహస్థుడు శ్రేష్ఠుడు.

ఋషులు, పితృదేవతలు, వేల్పులు, భూతములు, అతిథులు- వీరంతా గృహస్థుల నుంచి తమకు కావలసినవి కోరుకుంటారు. కాబట్టి బుద్ధిమంతుడగు గృహస్థుడు వారికి కావలసినవి తెలుసుకుని సమర్పించుకోవాలి.

వేదాధ్యయనంతో ఋషులను, హోమములతో దేవతలను, శ్రాద్ధముంచేత పితృదేవతలను, అన్నముతో అతిథులను పూజించాలి.

గృహస్థుడైన బ్రాహ్మణుడు శాస్త్ర ప్రకారం గోదానం చేసి ఎంత పుణ్యం పొందుతాడో అంత పుణ్యాన్ని భిక్ష మొసగి పొందవచ్చును.

అతిథికి భోజనం పెట్టలేనప్పుడు పడుకోవడానికి వసతి కల్పించాలి. త్రాగడానికి నీళ్ళివ్వాలి, మంచిగా మాట్లాడాలి.

ఏ గృహస్థులు ఎల్లప్పుడూ ఇతరుల ఇళ్ళల్లో భోజనాలు కోరుతుంటారోవారు మరు జన్మలలో ఆ దాతల గృహాల్లో పశువులుగా జన్మిస్తారు.

సూర్యుడస్తమించాక వచ్చిన అతిథిని గృహస్థుడు తిరస్కరింపకూడదు. అతిథికి భోజనం పెట్టాలి. అతిథికి పెట్టని పదార్థాలను తాను కూడా తినకూడదు. వచ్చిన అతిథుల్లో గొప్పవారికి గొప్పగాను, తక్కువవారికి తక్కువగాను, సములకు

సమముగాను అతిథి సత్కారములు చేయాలి.

అతిథి ఐన బ్రాహ్మణుడు భోజనం కోసం తన కులగోత్రాలను చెప్పకూడదు. అలా భోజనం కోసం కులగోత్రాలు చెప్పేవాడు వాంతి చేసుకున్న అన్నాన్ని తినే వాడని పండితులు అంటారు.

బ్రాహ్మణ గృహంలో బ్రాహ్మణులు తప్ప మిగిలినవారు అతిథులుగారు. క్షత్రియ గృహంలో బ్రాహ్మణులు, క్షత్రియులు అతిథులు. వైశ్యునికి బ్రాహ్మణ క్షత్రియ, వైశ్యులు, అతిథులు. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులకు శూద్రుడు అతిథి కాడు.

క్షత్రియుడు బ్రాహ్మణుని ఇంటికి వస్తే బ్రాహ్మణులు భుజించిన పిదప అతనికి భోజనం పెట్టాలి.

వైశ్యశూద్రులు బ్రాహ్మణుని ఇంటికి భోజనానికి వస్తే వారికి తమ ఇంటి సేవకులతో భోజనం పెట్టాలి.

కొత్త పెళ్ళికూతురికి, రోగులకు, గర్భిణులకు-వీళ్ళకు అతిథుల కంటే ముందే భోజనం పెట్టాలి.

బ్రాహ్మణులు, అతిథులు, సేవకులు భుజించిన పిదప దంపతు లిరువురూ భోజనం చేయాలి.

బ్రాహ్మణుడు అమావాస్యనాడు పితృ యజ్ఞమును చేసి, ఆ తరువాత నెలనెలా పిండాన్వాహార్యకమనే శ్రాద్ధమును పెట్టాలి.

పితృదేవతలను గురించి నెలనెలా చేసే మాసిక శ్రాద్ధమును సన్వాహార్య మంటారు. ఈ మాసిక శ్రాద్ధములో ప్రశస్త మాంసాన్ని ఉపయోగించాలి.

ఈ శ్రాద్ధములో దేవతా స్థానంలో ఇద్దరు బ్రాహ్మణులను, పితృ దేవతా స్థానమున ముగ్గురు బ్రాహ్మణులను, లేదా దేవస్థానమునకు, పితృస్థానానికి ఒక్కొక్క బ్రాహ్మణుని భోజనానికై నియమించాలి. ఎంత ధనికుడైనా ఇంతకంటే ఎక్కువ మందిని శ్రాద్ధానికి నియమింపకూడదు.

వేదాధ్యయన మొనర్చిన బ్రాహ్మణులకే దాతలు హవ్యమును (దేవతలకు సమర్పించే భోజనం) కవ్యమును (పితృదేవతలకు సమర్పించే భోజనం) సమర్పించాలి. అట్టి ఉత్తములకు సమర్పించే హవ్య, కవ్యముల వల్ల దాతలకు ఎక్కువ ఫలితం కలుగుతుంది.

దేవతా కార్యాలతో, శ్రాద్ధాదులైన పితృకార్యాలతో ఒక్కొక్క విద్వాంసు డైన బ్రాహ్మణునికైనా భోజనం పెట్టాలి. ఇలాంటి విద్వాంసులకు భోజనం పెడితేనే

ప్రయోజనం వుంటుంది. వేద మంత్రాలు తెలియని ఎంతమంది బ్రాహ్మణులకు భోజనం పెట్టినా ఫలితం వుండదు.

శ్రాద్ధాది కర్మలలో వేదవేత్త అయిన ఒక బ్రాహ్మణుడికి భోజనం పెడితే, వేదమంత్రాలు తెలియని పదిలక్షలమంది బ్రాహ్మణులకు భోజనం పెట్టినంత ఫలం కలుగుతుంది.

వేదాలు తెలియని బ్రాహ్మణునికి శ్రాద్ధాది కర్మలలో భోజనం పెడితే ఆ దాత నరకంలో శిక్షను అనుభవిస్తాడు.

స్నేహితులకు సంతోషపరచేందుకు ఎవడు మిత్రులను శ్రాద్ధ కర్మలకు పిలిచి, దక్షిణ లిస్తాడో అతనిచ్చిన దక్షిణ, పైశాచ దక్షిణ అవుతుంది. కర్త స్వర్గ లోకం నుంచి భ్రష్టుడైపోతాడు.

యోగ్యులను పిలిచి గౌరవించి దక్షిణ ఇవ్వటం వల్ల దాతకు పుణ్యం కలుగు తుంది. జ్ఞానవంతులు దొరకనప్పుడు గుణవంతుడైన స్నేహితుని ఆహ్వానించ వచ్చును.

శ్రాద్ధమునందు ఋగ్వేదమును అధ్యయనం చేసిన వానిని. గాని, యజుర్వేదమును పూర్తిగా అధ్యయము చేసిన వానిని గాని, పరిపూర్ణంగా సామ వేదమును అధ్యయనము చేసిన వానిని గాని పిలిచి అతనికి భోజనం పెట్టవలయును. వీరిలో ఏ ఒక్కరినైనా ఏ శ్రాద్ధకర్మలోనైనా ఆహ్వానించి పూజిస్తే ఆ శ్రాద్ధకర్మ యొక్క పెద్దలకు ఏడు తరాలకు శాశ్వత ముక్తి కలుగుతుంది.

హవ్యకవ్యములకు జ్ఞానులు దొరకనప్పుడు తల్లి తండ్రిని మేనమామను, మేనల్లుని, పిల్లనిచ్చిన మామను, గురువును, కూతురి కొడుకును, అల్లుని, పినతల్లి కొడుకులను, యజ్ఞాలు చేయించిన ఋత్విజుని, శిష్యుని ఆహ్వానించవచ్చు.

దైవ కార్యాలకు బ్రాహ్మణుని కులగోత్రాలను, యోగ్యతలను పరిశీలిం చాల్సిన అవసరం లేదు. శ్రాద్ధానికి మాత్రం బ్రాహ్మణుని యోగ్యతలను పరిశీలించాలి.

దొంగ, పతితుడు, నాస్తికుడు మొదలైన వారు హవ్యకవ్యములకు అనర్హులు.

వైద్యులను, కూలికోసం గుడిపూజ చేసే వారిని, మాంసం అమ్మే వాళ్ళను, వ్యాపారం చేసే వాళ్ళను హవ్యకవ్యాలకు పిలవకూడదు.

క్షయరోగం గలవాడిని బ్రతుకునకు గొర్రెలను, మేకలను పెంచేవాడిని, అన్న కన్నా ముందు పెళ్ళిచేసుకున్నవాడిని, పంచమహాయజ్ఞములు చేయని వాడిని, బ్రాహ్మ ణులను ద్వేషించే వాణ్ని, తమ్ముడు వివాహం చేసుకున్నా పెళ్ళి చేసుకోని అన్నను,

నాట్యం వల్ల జీవించేవాడిని, పెళ్ళికాకముందే స్త్రీలతో సంబంధం వుండేవాడిని, సవర్ణ స్త్రీని విడిచి శూద్ర స్త్రీని పెళ్ళి చేసుకున్నవాడిని, రెండవ పెళ్ళిచేసుకున్న ఆమె కొడుకును, ఇంటిలోనే యుపపతి గలవాడిని, జీతం తీసుకుని వేదం చెప్పేవాడిని, జీతం ఇచ్చి చదువుకున్న వాడిని, శూద్ర గురువుని, శూద్రుని శిష్యుని, తల్లిదండ్రులకు, గురువుకు సేవలు చేయని వాడిని, ఇల్లు తగల బెట్టిన వాడిని, విషము పెట్టిన వాడిని, సముద్రయానం చేసిన వాడిని, తప్పుడు సాక్ష్యం చెప్పేవాడిని, తండ్రితో వాదం చేసేవాడిని, డబ్బు ఇచ్చి జూదం ఆడించేవాడిని, పాపరోగాలు గలవాడిని, నేరం మోపబడిన వారిని, విల్లు, బాణాలు చేసేవాడిని, పెద్దది వుండగా ముందుగా పెళ్ళి చేసుకున్న ఆమె భర్తను, మిత్ర ద్రోహిని, జూదమాడి జీవించేవాడు, కొడుకు దగ్గర వేదాధ్యయనం చేసిన వాడిని, బొల్లిగలవాడిని, అపస్మారరోగిని, తగాదాలమారిని, పిచ్చివాడిని, గ్రుడ్డివాడిని, వేదాలను నిందించే వాడిని, ఒంటెలు, గుర్రాలు, ఏనుగుల్ని మచ్చిక చేసే వాడిని, జ్యోతిశ్శాస్త్రముచే జీవించేవాడిని, పక్షులను పెంచేవాడిని, విలువిద్య నేర్పేవాడిని, చెరువు కట్టలు తెంచేవాడిని, సేవకవృత్తి చేసేవాడిని, కూలికి చెట్లు పెంచేవాడిని, కుక్కలను పెంచేవాడిని, శూద్ర వృత్తిలో ఆసక్తి గలవాడిని, మేకలను, గేదెలను పెంచేవాడిని, విధవను వివాహం చేసుకున్నవాడిని, డబ్బుతీసుకుని శవాలు మోసేవాడిని, సజ్జనులతోడ సహపంక్తి భోజనానికి అనర్హుడైన బ్రాహ్మణాధముణ్ని హవ్యకవ్యములకు పిలవకూడదు.

అన్న కన్నా ముందు పెళ్ళి చేసుకున్న తమ్ముడు ఆ అన్న, తమ్ముణ్ణో వివాహం చేసుకున్న కన్య, కన్యాదాత, ఆ వివాహము చేయించువాడు వీరు ఐదుగురు నరకం పొందుతారు.

పంక్తికి అర్హుడు కానివాడు చూస్తుండగా ఆ సహపంక్తిలో ఎందరు సజ్జనులకు భోజనం పెట్టినా దాతకు భోజనం పెట్టినందువల్ల లభించిన ఫలం అనర్హుడు చూడటంవల్ల పోతుంది. కాబట్టి అనర్హుణ్ని సజ్జనుల మధ్య భోజనానికి కూర్చోపెట్టకూడదు.

పంక్తిలో గ్రుడ్డివాడికి భోజనం పెట్టడంవల్ల తొమ్మిదిమంది భోజనం పెట్టిన ఫలాన్ని దాత కోల్పోతాడు. కంటిమీద కాయగాచిన వాడికి భోజనం పెట్టడంవల్ల అరవై మందికి భోజనం పెట్టిన ఫలాన్ని, తెల్లకుష్టు గలవాడికి భోజనం పెడితే వందమందికి పెట్టిన ఫలమును, రాజయక్ష్మ రోగపీడితుడికి భోజనం పెడితే వేయిమ్మందికి భోజనం పెట్టినప్పుడు పొందిన ఫలాన్ని దాత కోల్పోతాడు.

శూద్రులకు పురోహితుడైన వాడికి పంక్తిలో భోజనంపెడితే ఆ పురోహితుడు పంక్తిలో ఎంతమంది బ్రాహ్మణులను తాకుతాడో అంత మందికి భోజనం పెట్టిన ఫలాన్ని ఆ దాత కోల్పోతాడు.

వేదవేత్త అయిన బ్రాహ్మణుడు శూద్ర యజమాని నుంచి ఆశతో దానాన్ని తీసుకుంటే మట్టినీటిలో కరిగినట్లు నశిస్తాడు.

వైద్యునికి దానం చేస్తే ఆ దాత మరు జన్మలో చీము, రక్తం తినే పురుగుగా పుడతాడు. పూజారికి దానం చేస్తే దానివల్ల ఫలితం ఏమీ వుండదు. వడ్డీలకు అప్పు లిచ్చేవాడికి దానం చేస్తే దాతకు కీర్తి నశిస్తుంది. కావున శ్రాద్ధ కర్మలలో వీరిని పిలవకూడదు.

వేదాలను చక్కగా అధ్యయనం చేసిన వానిని, షడంగములను ఎరిగిన వానిని, శ్రోత్రియ వంశములలో పుట్టిన వానిని పంక్తి పావనులంటారు.

ఐదు అగ్నిహోత్రములు చేసే వానిని, బ్రాహ్మ వివాహం చేసుకున్న వారికి పుట్టిన కుమారుని, వేదార్థవేత్తను, వేదార్థ ప్రవచనం చేసే వానిని, బ్రహ్మ చర్య వ్రతము అనుష్ఠించు వానిని, ఎక్కువగా గోదానములు చేసిన వానిని, శ్రోత్రియుడైన బ్రాహ్మణుని పంక్తిపావనులుగా భావిస్తారు.

అనర్హుల వలన అపరిశుద్ధమయిన బ్రాహ్మణుల పంక్తిని ఈ పంక్తిపావను లను ఆహ్వానించడం ద్వారా పరిశుద్ధ పరచవచ్చును.

బ్రాహ్మణులకు దేవతల కార్యముకంటే పితృకార్యము ముఖ్యమైనది.

శ్రాద్ధకర్మ చేసే ప్రదేశాన్ని గోమయంతో అలికించాలి. ఆ ప్రదేశం దక్షిణం వైపుకు వాలుగా వుండేలా చూడాలి. స్వభావ సిద్ధంగా పరిశుభ్రంగా వుండే అర ణ్యాలు, ఏకాంత స్థలాలు, పుణ్య నదుల తీరాల్లో చేసే శ్రాద్ధంవల్ల పితరులు సంతోష పడతారు.

తండ్రి ఉన్నప్పుడు తల్లికి శ్రాద్ధము పెట్టవలసి వస్తే అప్పుడు తండ్రిని విడిచి పితామహాదులు ముగ్గురికే పిండదానం చేయాలి.

శ్రాద్ధ కర్మ అన్నం వుంచిన పాత్రను ఒక చేతపట్టుకుని మరో చేత్తో దాన్ని మూసి తీసుకురాక, ఒక్క చేత్తోనే మూయకుండా పట్టుకు వస్తే ఆ అన్నాన్ని రక్క సులు అపహరిస్తారు.

కూరలను, పప్పు, కూరగాయలను, పెరుగు, పాలు, తేనె మొదలైన వాటిని అన్నం కన్నా ముందే తెచ్చి అక్కడ వుంచాలి.

వడలు మొదలైన పిండి వంటలను, పాయసాలను, ఫలాలను, హృద్యము

లైన సువాసన గల మాంసములను, పాసీయాలను తెచ్చి చుట్టూ వుంచాలి.

పరిశుభ్రంగా వుండి, పదార్థగుణాలను తెలుపుతూ జాగ్రత్తగా వడ్డించాలి. అలా వడ్డించేటప్పుడు చనిపోయిన వ్యక్తిని తలుచుకొని కన్నీరు కార్చకూడదు. కోపపడకూడదు. అబద్ధాలు చెప్పకూడదు. చెదిరిన అన్నమును కాలితో తొక్క కూడదు. విస్తరిలో అన్నం చెదిరిపడేటట్లు వడ్డించకూడదు.

కన్నీరు పెడితే శ్రాద్ధాన్నాన్ని ప్రేతాలు భుజిస్తాయి. కోపపడితే శత్రువులు పొందుతారు. కల్లలాడితే కుక్కలు తింటాయి. కాలితో తాకిన అన్నము రాక్షసులను చేరుతుంది. వడ్డించేటప్పుడు చెదిరిన అన్నాన్ని పాపాత్ములు తింటారు. కాబట్టి జాగ్రత్తగా వడ్డించాలి.

బ్రాహ్మణులకు ఏది ఇష్టమో దానిని మత్సరము మాని వారికి వడ్డించాలి. బ్రహ్మతత్వ ప్రతిపాదకములైన కథలను చెప్పాలి. పితరులకు ఈ కథలు బాగా ఇష్టం.

భోజన కాలంలో వేదాలను, ధర్మశాస్త్రాలను వినిపించాలి. ఇతిహాసాలను, పురాణాలను, పురుషసూక్తం, శ్రీ సూక్తం మొదలైన సూక్తాలను వినిపించాలి.

పరిశుభ్రత, కోపం లేకపోవడం, సావకాశంగా వుండటం మొదలైనవి పితరులకు ప్రీతి కలిగిస్తాయి.

అన్నాది పదార్థాలు ఎప్పటి వరకు వేడిగా వుంటాయో, భోక్తలు ఎంత వరకు మౌనంగా భుజిస్తారో, ఎంతవరకు భోక్తలు భోజన అగుణాలను చెప్పరో, అంత వరకు పితరులు భోజనం చేస్తారు.

భోక్తలు తలకు పాగా చుట్టుకుని భుజిస్తే, దక్షిణం వైపు కూర్చుని భుజిస్తే, చెప్పులు వేసుకుని కూర్చుని భుజిస్తే దానిని రాక్షసులు భుజిస్తారే గాని పితృదేవతలు భుజించరు. కాబట్టి భోక్తలు అలా భుజించకూడదు. హోమము, దానము, బ్రాహ్మణ భోజనము మొదలైన సమయాలలోను, అమావాస్య, పౌర్ణమి మొదలైన దైవకార్యాల లోనూ, శ్రాద్ధము మొదలైన పితృకార్యాలలోనూ చండాలురు మొదలైనవారు కంట బడితే ఆ కార్యము ఏ ఉద్దేశంతో చేస్తారో ఆ ఫలం దక్కదు.

పంది వాసన చూడటం వల్ల, కోడి రెక్కల గాలి సోకడం చేత, కుక్క చూపు పడడం వల్ల, శూద్రుడు తాకడం వల్ల పదార్థాలు అపరిశుద్ధమవుతాయి. కాబట్టి అలాంటి అపరిశుభ్ర పదార్థాలతో చేసిన శ్రాద్ధాది క్రియలు నిష్ఫల మవుతాయి.

కుంటివాడు, కాయగాచిన కంటివాడు, అంగవైకల్యము గల వాడు శ్రాద్ధకర్త ఇంటి పనివాళ్ళుగా వుంటే శ్రాద్ధకర్మ రోజున వాళ్ళందరినీ యింటినుంచి తరిమి వేయాలి.

శ్రాద్ధకర్మ చేసినవాడు భోక్తలకు పెట్టగా మిగిలిన అన్నాన్ని శూద్రుడికి ఇస్తే, ఆ అన్నదాత మూఢుడై, నరకాన్ని చేరతాడు. శ్రాద్ధ భోక్త (తాను కోరక) తనను కోరివచ్చు భార్యతోనైనా ఆ దినము సంగమించిన యెడల అతని పితృ దేవతలు ఒక్క నెలవరకు ఆ స్త్రీ యొక్క పురీషములో పడివుంటారు.

భోక్తలు భుజించిన తరువాత కొందరు పిండప్రదానము చేస్తారు. అగ్ని యందు, నీటియందు వేస్తారు. మరికొందరు కాకులు, పక్షులకు పెడతారు.

ధర్మార్థ కామములలో మనోవాక్కాయ కర్మలచే భర్తకే సేవచేసేది, సజాతి యందు పుట్టినది, మొదటి భార్య అయి, శ్రాద్ధ క్రియలందు శ్రద్ధగల పుత్రులను కోరే యువతి ఆ పిండాలలో నడుమనున్న పితామహ పిండాన్ని భుజించాలి.

అలాంటి పిండాన్ని భుజించడం వల్ల ఆ యువతి దీర్ఘాయుష్మంతుడు, కీర్తి బుద్ధి, ధనసంపద గలవాడు, సంతతి గలవాడు, బలవంతుడు, ధర్మపురుషుడు అయిన పుత్రుని కంటుంది.

తిలలు, ధాన్యములు, యవలు, దుంపలు, నీళ్ళు, పండ్లు మొదలైన వాటిని పితృప్రీతికై శాస్త్రప్రకారం బ్రాహ్మణునికి దానమొసగితే దాతల పితృదేవతలు ఒక్క నెల తృప్తిపొందుతారు. మత్స్య మాంసాలు దానము చేస్తే రెండు నెలలు, జింక మాంసం దానం చేస్తే మూడునెలలు, గొర్రె మాంసం దానం చేస్తే నాలుగు నెలలు, బ్రాహ్మణులు తినదగిన పక్షుల మాంసం దానం చేస్తే ఐదు నెలలు, మేక మాంసం దానం చేస్తే ఆరు నెలలు, చారల జింక మాంసము దానం చేస్తే ఏడు మాసాలు, కృష్ణ మృగ మాంసం దానం చేస్తే ఎనిమిది నెలలు, దుప్పిమాంసం దానం చేస్తే తొమ్మిది నెలలు, ముండ్లపంది, అడవిదున్న మాంసం దానం చేస్తే పది నెలలు, కుందేలు, తాబేలు మాంసం దానం చేస్తే పదకొండు నెలలు, గోవు సంబంధమైన పాలు, పెరుగు, నెయ్యి వీటితో శ్రాద్ధ మొనర్చి, దాన మొసగితే ఒక సంవత్సర కాలము, వార్ధ్రీణ మను ముసలి మేకపోతు మాంసముచే శ్రాద్ధ మొనర్చి, దానం చేస్తే పన్నెండు సంవత్సరాల కాలం పితరులు తృప్తి పొందుతారు.

కాల శాకమను శాకమును, ముళ్ళుగల చేపలు, ఖడ్గమృగము, ఎర్రని పొట్టేలు-వీటి మాంసమును ధాన్యము, తేనె మొదలైన వాటితో శ్రాద్ధ మొనర్చితే పితరులు అంతులేని కాలం పాటు తృప్తి పొందుతారు.

సరి తిథుల యందు, సరి నక్షత్రములయిన భరణీ రోహిణ్యాదుల యందును శ్రాద్ధ మొనర్చినవాడు సకల మనోరథములను పొందును. బేసి తిథులగు పాడ్యమి మొదలైన తిథులలో, అశ్వినీ, కృత్తిక మొదలైన బేసి నక్షత్రాలలో శ్రాద్ధ మొనర్చే

వాడు పూర్ణ ధనమును, విద్యావంతులైన సంతతిని పొందుతారు.

పితృక్రియలను శుక్ల పక్షము కంటే కృష్ణ పక్షము ఎలా ఉత్తమమో అలాగే పూర్వాహ్ణము కంటే అపరాహ్ణము ఉత్తమము.

రాత్రులందు శ్రాద్ధము చేయరాదు. ఉదయ సాయంత్ర సంధ్యాకాలములలో శ్రాద్ధము చేయకూడదు. సూర్యోదయం అయిన వెంటనే కూడా చేయకూడదు.

* * *

బ్రాహ్మణులు తమ జీవిత కాలంలో నాలుగవ భాగం పాటు గురుకుల వాసంలో గడిపి తరువాత గృహస్థాశ్రమ మవలంబించి గృహంలో వుండాలి. బ్రాహ్మణుడు ఆపద లేనప్పుడు ఇతర జీవులకు ద్రోహం చేయకూడదు.

సుఖాపేక్ష లేక జీవించడానికి అవసరమైన డబ్బును స్వకర్మల నవలంబిస్తూ, బాధలు పడక సంపాదించాలి.

వర్తకాన్ని సత్యానృత మంటారు. స్వయంగా ఏ పనీ చేయలేకపోయినా ఎలాగైనా జీవితాన్ని గడపవచ్చు గానీ సేవక వృత్తి ఎట్టి పరిస్థితులలోనూ చేయకూడదు. సేవక వృత్తిలో యజమానితో తిట్లుతినాలి. నీచపు పనులు చేయాలి. కాబట్టి బ్రాహ్మణునికి సేవక వృత్తి సర్వదా నిషిద్ధము.

బ్రాహ్మణుడు పాటపాడి, నాట్యమాడి డబ్బు సంపాదించకూడదు. యాగము చేయించగూడని వానితో యాగం చేయించి డబ్బు సంపాదించకూడదు. ధనం వున్నా లేకున్నా పతితులనుంచి డబ్బు తీసుకోకూడదు.

* * *

సూర్యుడు ఉదయించేటప్పుడు, అస్తమించేటప్పుడు గ్రహణ సమయంలో, నీటిలో ప్రతిబింబం కనిపించేటప్పుడు, సూర్యుడు మధ్యాహ్న సమయంలో నడినెత్తి మీదికి వచ్చినప్పుడు సూర్యుణ్ని చూడకూడదు. దూడకట్టు తాడును దాటకూడదు. మేఘం వర్షించేటప్పుడు పరుగెత్తకూడదు. నీటిలో కనిపించే తన ప్రతిబింబాన్ని చూడకూడదు.

కామార్తుడైనా బహిష్టు దినాలలో మూడు రోజులు స్త్రీతో కలవకూడదు. ఒకే ప్రక్కమీద పడుకోకూడదు.

ఎప్పుడూ భార్యతోకూడా ఒకే పాత్రలో భోజనం చేయకూడదు. భార్య భోజనం చేస్తున్నా, తుమ్ముతున్నా, ఆవులిస్తున్నా, హాయిగా కాళ్ళు చాపుకుని కూర్చొనివున్నా ఆమెను భర్త చూడకూడదు.

బ్రాహ్మణుడు తన భార్య కళ్ళకు కాటుక పెట్టుకుంటున్నా, తలంటుపోసు కుంటున్నా, పైట లేకుండా వున్నా, ప్రసవిస్తున్నప్పుడు ఆమెను చూడకూడదు.

దెసమొలతో నున్న స్త్రీని ఏ పురుషుడూ చూడకూడదు.

గృహస్థుడు ఒంటి బట్ట కట్టుకుని భోజనం చేయకూడదు. దెసమొలతో స్నానం చేయకూడదు. దారిలోను, బూడిద మీద, ఆవుల మందలతో మలమూత్ర విసర్జన చేయకూడదు.

నాగేటితో దున్నిన నేల, నీరు, పర్వతము, అగ్నిహోత్రానికై ఇటుకలు పరిచిన ప్రదేశము, పాడుబడిన గుడి, పుట్ట వీటిలో ఎప్పుడూ మలమూత్ర విసర్జన చేయకూడదు.

గాలిని, అగ్నిని, బ్రాహ్మణుని, సూర్యుని, నీటిని, గోవుని చూస్తూ వాటి కెదురుగా కూర్చుని ఎప్పుడూ మలమూత్ర విసర్జన చేయకూడదు.

నేలను కొయ్యలు, మట్టిపెళ్ళలు, గడ్డి, ఆకులు మొదలైన వాటితో మూసి, తల వంచుకుని, మౌనంలో, శరీరాన్ని కప్పుకుని, తలకు ముసుగువేసుకుని మల మూత్రాలను విసర్జించాలి.

అశుద్ధాలను, కళ్ళె, అవి అంటుకున్న బట్టలను నీళ్ళల్లో వేయకూడదు.

అగ్నిని దాటిపోకూడదు.

సంధ్యాకాలంలో భోజనం చెయ్యకూడదు. తాను ధరించిన పూపులదండను స్వయంగా తీయకూడదు. పాడుబడిన ఇంటిలో ఒంటరిగా వుండకూడదు.

ధనంలోనూ, విద్యలోనూ, తనకన్నా మించినవాడు నిద్రపోతుంటే లేప కూడదు. బహిష్టు అయిన ఆమెతో మాట్లాడకూడదు.

నీళ్ళు తాగుతున్న ఆవును గాని, పాలు తాగుతున్న దూడను గాని లాగ కూడదు. పాలుతీసేటప్పుడు మాత్రం లాగవచ్చు. ఇతరుల దూడలు పాలు తాగు తుంటే వాళ్ళకు చెప్పకూడదు.

చెడ్డవాళ్ళు ఎక్కువగా గల గ్రామములో, వ్యాధులు ఎక్కువగా వుండే దేశంలో వుండకూడదు. ఒంటరిగా ప్రయాణం చేయకూడదు. కొండమీద చాలా కాలం నివసించకూడదు. శూద్రుడు పరిపాలన చేసే రాజ్యంలో వుండకూడదు.

కుతికల బంటిగీ భోంచేయకూడదు. కడుపును సగం ఘన ఆహారపదార్థా లతో, పావు వంతు ద్రవ పదార్థాలతో పూరించి, పావు వంతు ఖాళీగా వదలాలి. పగలు బాగా భోంచేసినవాడు, రాత్రిపూట భోంచేయకూడదు.

ఐహిక ప్రయోజనమో, ఆముష్మిక ప్రయోజనమో లేని పనిని చేయకూడదు.

దోసిలితో నీళ్ళను తాగకూడదు. తొడపై పెట్టుకుని దోసెలు మొదలైన వంటకాలను తినకూడదు. ప్రయోజనం లేని విషయాన్ని తెలుసుకోవడానికి ఉత్సాహ పడకూడదు.

శాస్త్ర విరుద్ధంగా నాట్యం చేయకూడదు. పాటలు పాడకూడదు. సంగీత వాద్యాలను ప్రయోగించకూడదు. స్నేహంతో భుజం మీద తట్టకూడదు, కావాలని అరుపులు, కేకలు వేయకూడదు.

ఎప్పుడు కూడా కంచుపాత్రలలో పాద ప్రక్షాళన చేయకూడదు. పగిలిన కుండలలో, పగిలిన పాత్రలలో, మనసుకు ఇంపుగా లేని పాత్రలలో భోజనం చేయకూడదు.

ఒకరు వేసుకున్న బట్టలను, చెప్పులను వేరొకళ్లు వేసుకోకూడదు. అలాగే యజ్ఞోపవీతము, ఆభరణాలు, పూలదండలు మొదలైనవి ఇతరులు ఉపయోగించినవి మనం ధరించకూడదు.

తుంటరివి, కొమ్ములు తిరిగినవి, గ్రుడ్డివి, గిట్టలు లేనివి, తోకలేనివి మొదలయిన ఎద్దులు కట్టిన బళ్ళల్లో ప్రయాణం చేయకూడదు.

మచ్చిక పడిన, త్వరగా నడిచే, మంచి లక్షణాలు గలిగిన, మంచి రూపు, వన్నె కలిగిన ఎద్దులు కట్టిన బండిలో ప్రయాణం చేయాలి. మునికోలతో ఎక్కువగా పొడవకుండా పోవాలి.

లే ఎండతో వుండకూడదు. పగిలిన పీటకొయ్యను వాడకూడదు, గోళ్ళను, వెంట్రుకలను తెంపకూడదు. గోళ్ళను పళ్ళతో కొరికి తీయకూడదు.

ప్రయోజనం లేకుండా, గోళ్ళతో గడ్డిని త్రుంచకూడదు. ఫలితం లేని పని చేయకూడదు. భవిష్యత్తులో కష్టాలు వచ్చే పనులు చేయకూడదు.

మనసులోనూ, ప్రవర్తనలోనూ ఆచారము లేనివాడు, ఉన్నవీ, లేనివీ చాడీలు చెప్పేవాడు, గడ్డిని త్రుంచువాడు త్వరగా నశిస్తారు.

లౌకిక విషయాల్లోగాని, శాస్త్ర సంబంధమైన విషయాలలో గాని, మొండిగా మాట్లాడకూడదు. ఆవుల మీద కూర్చుని స్వారీ చేయకూడదు. కాని వాటిని బండికి కట్టవచ్చును.

చుట్టూ ప్రాకారంగల గ్రామంలోకిగాని, చుట్టూ గోడలు గల ఇంట్లోకి గాని తలుపులు మూసివున్నప్పుడు గోడలు దూకి లోపలికి ప్రవేశించకూడదు. రాత్రి వేళల్లో చెట్టు మొదట్లో పడుకోకూడదు. చెట్టుకు దూరంగా పడుకోవాలి.

సరదాకైనా పాచికలు మొదలైన వాటితో ఆడకూడదు. చెప్పులను చేతితో పట్టుకుని ఒకచోట నుంచి ఇంకోచోటికి పోకూడదు. మంచం మీద కూర్చుని భోజనం చేయకూడదు. ఆసనం మీద కంచం పెట్టుకుని భోం చేయకూడదు.

సూర్యుడు అస్తమించిన తరువాత నువ్వులతో చేసిన పదార్థాలను తినకూడదు. దిసమొలతో నిద్రపోకూడదు. ఎంగిలి చేతులు కడగకుండా వేరే ప్రదేశానికి పోకూడదు.

కాళ్ళు కడుక్కుని భోజనం చెయ్యాలి. తడికాళ్ళతో పడుకోకూడదు. తడి పాదాలతో భోజనం చేసేవాడు దీర్ఘాయుస్సు పొందుతాడు.

చెట్లుచేమలతో నిండి పగలే చీకటిగా అనిపించే అడవులలోకి పోకూడదు. తన మూత్ర, పురీషములను చూడకూడదు. ఈదుకుంటూ నదిని దాటకూడదు.

ఎక్కువకాలం బ్రతక దలచుకున్నవాడు వెంట్రుకలు, బూడిద, ఎముకలు, చిల్లపెంకులు, దూది, పుర్రెలు వీటిని తొక్కకూడదు. భ్రష్టులతోను, చండాలురతో, జానిసలతో, మూర్ఖులతో, ధనగర్వంతో విర్రవీగేవారితో,చాకలి మొదలైన వాళ్ళతో, నీచ జాతుల వాళ్ళతో ఒకచోట కలిసి వుండకూడదు.

లోక వ్యవహారాల్లో పనికివచ్చే అర్థశాస్త్రాన్ని శూద్రులకు బోధింపకూడదు, ఎవడు శూద్రుడికి ధర్మోపదేశం చేస్తాడో, ఎవడు వ్రతాలను ఉపదేశిస్తాడో అతడు భయంకర నరకాన్ని అనుభవిస్తాడు.

రెండు చేతులతో తలగోకు కొనరాదు. భోజనము చేసిన పిదప తప్పక కాళ్ళు చేతులు కడుక్కోవాలి.

కోపంతోనైనా జుట్టుపట్టుకుని, తలను వంచి తలపై కొట్టకూడదు. ఆరోగ్యం బావుండి, స్నానం చేసేటప్పుడు తప్పకుండా తలస్నానం చెయ్యాలి.

జంతు హింసతో జీవించే వాడి దగ్గరనుంచి, నువ్వులు మొదలైనవాటి నుంచి నూనె తీసేవాడి నుంచి, మద్యము విక్రయించే వాడి దగ్గర నుంచి, వ్యభిచారమే జీవనాధారం గల వాళ్ళనుంచి దానం తీసుకోకూడదు.

0 0 0 0

పది వధ్యస్థానముల వంటిది గానుగాడేచోటు. పది గానుగాడే స్థానాలతో సమానం మధ్యస్థానము. పది కల్లంగళ్ళతో సాటి బోగం పాళెం. పది బోగము పల్లెల వంటివాడు క్షత్రియుడు.

పదివేల జంతువుల హింసించు కటికవాడితో సమానం రాజు. కాబట్టిఅలాంటి రాజు వద్ద నుంచి ఏమీ తీసుకోకూడదు.

లోభియు శాస్త్రమర్యాద తప్పిన రాజువద్ద నుంచి ఎవడు ప్రతిగ్రహము తీసుకుంటాడో వాడు ఇరవై ఒక్క రకాల నరకాలను వరసగా పొందుతాడు.

తెల్లవారు జాము బ్రాహ్మముహూర్తము. అట్టి ముహూర్తంలో లేని ధర్మము, ధనం వీటిని గురించి ఆలోచించాలి. ఆ ధర్మార్థ చింతలవల్ల కలిగే దేహబాధలను గూర్చి వేద తత్త్వ అర్థాలను గురించి ఆలోచించాలి.

ప్రభాత కాలాన మంచంమీద నుంచి లేచి, కాలకృత్యాలు తీర్చుకుని ప్రాతః సంధ్యావందనం ఆచరించి, జపంచేస్తూ నిలుచోవాలి. అలాగే సాయంకాలం సంధ్యావందనం ఆచరించి, గాయత్రి జపం చెయ్యాలి.

ఋషులు చాలాకాలం సంధ్యావందనాద్యనుష్ఠానము చేయడంతో దీర్ఘాయుస్సు పొంది, చిరకాలం జీవించి, బుద్ధిని, బ్రతికివున్నప్పుడు యశస్సును, చనిపోయి కీర్తిని పొందారు. కాబట్టి ఆయుస్సు మొదలైనవి కోరేవారు చిరకాలం సంధ్యోపాసనం చేయాలి.

స్వర వర్ణభేదాలు తెలియకుండా వేదమును అధ్యయనం చేయడం తగదు. శూద్రుల సమక్షంలో వేదమును అధ్యయనం చేయకూడదు.వేకువజామున లేచి వేదాధ్యయనం చేసి అలసటతో మళ్ళీ పడుకుని నిద్రపోకూడదు.

అమావాస్యరోజున వేదం పఠిస్తే గురువు చనిపోతాడు. చతుర్దశి యందు వేదము పఠిస్తే శిష్యుడు చనిపోతాడు. అష్టమి, పూర్ణిమ రోజుల్లో వేదము పఠించిన వ్యక్తి నశిస్తాడు. కాబట్టి ఈ రోజుల్లో వేదాధ్యయనం చేయకూడదు.

మంచంమీద పడుకుని, ఎత్తుపీఠంమీద కాళ్ళు చాచుకుని, మాంసం భుజించి వేదపఠనం చేయకూడదు.సూర్యచంద్ర గ్రహణ సమయంలో మూడురోజులు వేదాల అధ్యయనం చేయకూడదు.

నీటి మధ్యలో వున్నప్పుడు, అర్థరాత్రి సమయంలో, కాలకృత్యాలు తీర్చుకునే సమయంలో, ఎంగిలితో ఉన్నప్పుడు. రాత్రియందు నాలుగు ముహూర్తముల కాలం వేదాధ్యయనం పనికిరాదు.

రాజుకు పుత్రుడు జన్మించినప్పుడు మూడు రోజులు వేదాధ్యయనం చేయకూడదు.

శవం గ్రామంలో వున్నప్పుడు, జనం గుంపులుగా చేరి రోదిస్తున్నప్పుడు వేదాధ్యయనం పనికిరాదు.

దుమ్ము రేగుతున్నప్పుడు, దిక్కులు మండుతున్నప్పుడు, నక్కలు కూస్తు

నప్పుడు, కుక్కలు, గాడిదలు, ఒంటెలు రోదనం చేసేటప్పుడు, జనాల మధ్యలో ఉన్నప్పుడు వేదాలను పఠించకూడదు.

శ్మశాన సమీపంలో, గ్రామ సమీపంలో, పశువుల కొట్టంలో, స్త్రీతో సంభోగించినప్పుడు, ధరించిన వస్త్రాన్ని అలాగే ధరించి వేదాధ్యయనం చేయకూడదు.

గుర్రంమీద ఎక్కి కూర్చుని, చెట్టు ఎక్కి, ఏనుగుమీద కూర్చుని, నావ ఎక్కి, గాడిదమీద కూర్చుని, ఒంటెను ఎక్కి, చవిటి నేలపై కూర్చుని, బండి మొదలైన వాటిమీద పోతూ వేదాధ్యయనం చేయకూడదు. సూతకము కలిగినప్పుడు వేదముల అధ్యయనం నిషిద్ధం. ఋగ్వేదము దేవతలు, యజుర్వేదము మానవులు, సామవేదము పితరులు దేవతలుగా గలది. కాబట్టి సామవేద ధ్వని యశుచి - అయినది.

పశువులు, కప్పలు, పిల్లి, కుక్క, పాము. ముంగిస, ఎలుక గురుశిష్యులకు నడుమవస్తే ఆ రోజంతా అధ్యయనం చేయకూడదు.

అమావాస్య, అష్టమి, పౌర్ణమి, చతుర్దశి ఈ రోజుల్లోనూ, భార్య బహిష్టు అయినప్పుడు మూడు రోజులు బ్రాహ్మణుడు భార్యతో కలవకూడదు.

భోజనం చేసిన తరువాత స్నానం చేయకూడదు. ఎక్కువ బట్టలు ధరించి స్నానం చేయకూడదు. మొసళ్ళు మొదలైనవి ఉన్నదీ,లేనిదీ తెలుసుకోకుండా జలాశయాల్లో స్నానం చేయకూడదు.

శిలారూపంలో ఉన్న దేవతలయొక్క, తండ్రి, గురువు, రాజు, ఆచార్యుడి నీడలను, చండాలుడి నీడను బుద్ధి పూర్వకంగా తొక్కకూడదు, దాటకూడదు.

స్నానం చేసిన నీళ్ళను, మలమూత్రాలను, రక్తం, కఫం, వాంతి చేసుకున్న వస్తువు, నమిలి ఉమ్మివేసిన తమలము మొదలైన వానిని బుద్ధి పూర్వకంగా తొక్క కూడదు.

శత్రువుని, శత్రువుకి సాయం చేసేవాడిని, అధర్మశీలుణ్ణి, దొంగని, పర భార్యని కొలవకూడదు.

ఇతరుల భార్యని కాంక్షించడం పురుషునికి ఆయుక్షీణం కలిగిస్తుంది. అలా ఆయుక్షీణలను కలిగించేది ప్రపంచంలో మరొకటిలేదు.

ధన, ధాన్య, పశు, క్షేత్రాదులు ఎక్కువగా కావాలని కోరేవాడు క్షత్రియుణ్ణి పామునీ, బ్రాహ్మణ్ణి ఎప్పుడూ అవమానింపకూడదు.

వ్యాపారాదులలో నష్టపోయి సంపద అంతా పోయినా తనను తాను నిందించు కోరాదు. బ్రతికి వున్నంతవరకు డబ్బు సంపాదించాలను కోవాలి. డబ్బుసంపాదించడం కష్టమని భావించకూడదు.

విన్నది విన్నట్టు, చూసింది చూసినట్టు చెప్పడం సత్యం. అలాంటి సత్యాన్ని చెప్పాలి. ఎదుటివాని మనసుకు తగినట్టుగా చెప్పడం ప్రియం. అలాంటి ప్రియమైన మాటలను చెప్పాలి. సత్యమయినా అప్రియమైన మాటలను చెప్పకూడదు. ప్రియమయినా అసత్యాలను చెప్పకూడదు. ఇది అనాది ధర్మము.

ఒకళ్ళతో అనవసరంగా వాదులాటను, పగను పెట్టుకోకూడదు.

మరీ వేకువ జామున, పగలు రెండు జాములప్పుడు, కుల శీలాలు తెలియని కొత్తవాళ్ళతోను, పాపులతోను కలిసి ప్రమాణము చేయకూడదు.

అవిటి వారిని, వయస్సు మళ్ళినవారిని, అందహీనులను, పేదవారిని,జాతి హీనులను ఆక్షేపించకూడదు.

మంగళ ఆచారాలు పాటించేవారికి, ఎల్లప్పుడూ పరిశుభ్రంగా ఉండేవారికి జపం, హోమం మొదలైన వాటిలో శ్రద్ధగలవారికి, ఎప్పుడూ మనుషుల వల్లగాని, దైవం వల్లగాని ప్రమాదం లేదు.

కాలకృత్యాలు తీర్చుకోవడం, దేహాలంకారము, స్నానము, దంతధావనము, కాటుక పెట్టుకోవడం, దేవతార్చనము మొదలైన ఈ క్రియలన్నీ పూర్వాహ్ణ కాలంలోనే చేయాలి.

ఇంటికి వచ్చిన పెద్దలకు నమస్కరించాలి. తన ఆసనాన్ని వారికివ్వాలి. వాళ్ళు ముందు నడుస్తుంటే వాళ్ళ వెనక వెళ్ళాలి.

ఆచారాలు పాటించడంవల్ల దీర్ఘాయుస్సు లభిస్తుంది, కోరిన కొడుకులు, మనుమలు, మునిమనుమలు పుడతారు. తరగని సంపద లభిస్తుంది. శుభప్రదాలైన ఆచారాలు అవలక్షణాలన్నింటినీ, రూపుమాపుతాయి.

దురాచారుడైన పురుషుడు లోకుల నిందకు పాత్రుడు. ఎల్లప్పుడూ దుఃఖము పొందుతాడు. రోగాలు విడువవు. అల్పాయుష్కుడు అవుతాడు. కాబట్టి దురాచారాలను మాని సదాచారాలను పాటించాలి.

సర్వ శుభలక్షణాలు లేనివాడైనా ఎవడు సదాచార సంపన్నుడో, శ్రద్ధ గలవాడో, అసూయ లేనివాడో అతడు వందేళ్ళు జీవిస్తాడు.

ఏ పనిని ఇతరుల దయపై ఆధారపడి చేయగలమో, దానిని వదిలివేయాలి. ఏ పనిని మనం స్వయంశక్తితో సాధించగలమో ఆ పనిని చేయాలి. పరవశమైనది దుఃఖకరము. స్వవశమైనది సుఖకరము. ఇదియే సుఖ దుఃఖములకు లక్షణము.

ఏ పని చేసేటప్పుడు మన మనసుకు ఆహ్లాదం కలుగుతుందో ఆ పని చెడు పని కాకపోతే సంతోషంగా, ప్రయత్న పూర్వకంగా చేయాలి.

ఆచార్యునికి, తండ్రికి, తల్లికి, గురువుకి, బ్రాహ్మణులకు, ఆవులకు తపస్సు

చేసేవారికి వ్యతిరేకమయిన పనులు చేసి బాధ పెట్టకూడదు.

దేవుడు లేడనే ఆలోచనను, వేదాలపై, దేవతలపై నిందలను, ద్వేషాన్ని, డంబమును, కోపాన్ని కాఠిన్యవైఖరిని విసర్జించాలి.

పరుని అనవసరంగా కొట్టడానికి కర్రను ఉపయోగించరాదు. నేరము చేసినట్లు సాక్ష్యముంటే తాడు, బెత్తము, వెదురుబద్దతో కొట్టవచ్చును.

బ్రాహ్మణుని క్రోధంతో, బుద్ధి పూర్వకంగా గడ్డిపరకతో కొట్టినా ఇరవైఒక్క జన్మలు కుక్క మొదలైన నీచ జన్మలెత్తుతారు.

బ్రాహ్మణుని రక్తం కారేలా హింసించిన వాడు మరణించాక గొప్పదుఃఖాన్ని పొందుతాడు. గాయాలయిన బ్రాహ్మణుని దేహం నుంచి కారిన రక్తం నేలమీది ఎన్ని రేణువులను తడుపుతుందో అన్ని సంవత్సరాల కాలం గాయాలు చేసిన వాడి రక్తాన్ని నక్కలు మొదలైనవి పీల్చుకుంటాయి.

కాబట్టి బ్రాహ్మణుని నిందించడం వల్ల కలిగే దోషాలను తెలిసిన వాడు బ్రాహ్మణుని నిందింపకూడదు, బాధించకూడదు. గాయపరచకూడదు. ఆపదలో వున్నప్పుడు కూడా ఈ పనులు చేయకూడదు.

ఎవడు శాస్త్ర నిషిద్ధములైన పనులను చేస్తుంటాడో, ఎవడు తప్పుడు సాక్ష్యాలు చెబుతూ జీవిస్తుంటాడో, ఎవడు పరహింస చేస్తుంటాడో, అతడు ఈ లోకంలో క్షేమంగా జీవించడు. కాబట్టి ఈ పనులను విసర్జించాలి.

ధర్మంగా జీవించటంవల్ల తాను పేదరికంతో బాధపడుతున్నా, పాపాత్ములకి సంపద కలిగినా, పాపాత్ములు పొందబోయే అధోగతిని దృష్టిలో వుంచుకొని అధర్మ కార్యాల వైపు మనసును మళ్ళించకూడదు.

మనం చేసే మంచి, చెడ్డ పనులు వెంటనే ఫలితాన్ని చూపించవు. అధర్మాలు చేసినవాడు కొంత కాలానికి నాశనం అవుతాడు. మనం చేసిన మంచి చెడ్డ పనుల ప్రభావం మన జీవితం మీద వుండకపోయినా మన సంతానం మీద వుండవచ్చు. మన సంతానం యొక్క సుఖ దుఃఖాల ప్రభావం మనమీద వుంటుంది కదా!

పాపం పండినప్పుడు నాశనం అవుతారు.

సత్యము, స్వధర్మము, సదాచారము, శౌచము వీటి యందు ఎప్పుడూ శ్రద్ధ కలిగి వుండాలి. శిష్యులు, భార్య, పుత్రులు, దాసులు వీళ్ళను తగినట్లు దండించాలి.

ఏ అర్థ, కామములు ధర్మ విరుద్ధాలో అలాంటి అర్థ, కామములను సేవింపకూడదు. లోకం దృష్టిలో చెడ్డదైన ధర్మ కార్యమును చేయకూడదు, కపటం గల వాడుగా తయారు కాకూడదు. ఇతరులకు ద్రోహం చేసే పనులను మనసులోకి రానివ్వకూడదు.

ఏ ధరాన్ని ఇతరులు అనుసరించారో, ఏ ధర్మాన్ని తాతలు అనుసరించారో అట్టి ధర్మాన్ని ఆచరించాలి. దానివల్ల ఏ లోపం కలగదు.

తల్లిదండ్రులు, తోబుట్టువులు, కోడళ్ళు మొదలైన స్త్రీలు, అన్నదమ్ములు, కొడుకులు, భార్య, కూతురు, సేవకులు వీళ్ళతో వివాదం పెట్టుకోకూడదు. గృహస్థుడికి వీళ్ళందరితో వివాదం లేకపోతే పాపాలు నుంచి విముక్తి పొందుతాడు.

ఆచార్యుడితో వివాదం లేకపోతే గృహస్థుడికి బ్రహ్మలోకం ప్రాప్తిస్తుంది, తండ్రితో వివాదం లేకపోతే ప్రాజాపత్య లోకమును, అతిథితో వివాదం లేకపోతే ఇంద్రలోకమును, ఋత్విజులతో వివాదం లేకపోతే దేవలోకం ప్రాప్తిస్తాయి.

తోబుట్టువులు, కోడళ్ళు మొదలైన వాళ్ళతో వివాదం లేకపోతే అప్సరసల లోకం, తల్లివైపు బంధువులతో వివాదం లేకపోతే విశ్వ దేవతల లోకం, బావ మరుదులు మొదలైన వియ్యపు చుట్టాలతో వివాదం లేకపోతే వరుణలోకం, తల్లి, మేనమామతో వివాదం లేకపోతే మళ్ళీ భూలోకం ప్రాప్తిస్తాయి. అన్నతో వివాదం లేకపోతే ప్రజాపతి లోకం ప్రాప్తిస్తుంది.

సేవక వర్గం తన నీడవంటివారు. కూతురును కనికరంతో చూడాలి. వీళ్ళు ఒకవేళ తనను దూషించినా గృహస్థుడు ఓర్చుకుని వారితో వివాదం పడకూడదు.

ఇతరులు ఇచ్చినా ఏది తీసుకోవాలో, ఏది తీసుకోకూడదో ధర్మశాస్త్ర ప్రకారము ప్రవర్తించాలి. ఆకలితో నకనకలాడుతున్నా తీసుకోకూడని వస్తువులను తీసుకోకూడదు.

బంగారం, భూమి, గుర్రం, ఆవు, అన్నం, వస్త్రం, నువ్వులు, నెయ్యి వీటిని విద్యావిహీనుడు తీసుకుంటే ఎండు కట్టెలా భస్మమైపోతాడు.

ఇతరులు తవ్వించిన కొలనులో ఎప్పుడూ స్నానం చేయకూడదు అలాచేస్తే తన స్నానఫలం కొలను తవ్వించిన వాడికి పోతుంది. అతని పాపం తనకు చేరుతుంది.ఒకవేళ అలా ఇతరులు తవ్వించిన కొలనులో స్నానం చేయాల్సి వస్తే కొంత మట్టి ఎత్తి బయటపోసి, అప్పుడు స్నానం చేయవచ్చు.

ఇతరులు ఇచ్చిన వాహనము, పాన్పు, పీఠము, ఉద్యానము, గృహమును ఉపయోగించినవాడు, ఇచ్చిన వాడి పాపంలో నాలుగవ భాగాన్ని పొందుతాడు.

నదులలో, దేవతలు తవ్విన కొలనులలో, సెలయేళ్ళలో, సరస్సులలో స్నానం చేయాలి.

బుద్ధిమంతుడు బ్రహ్మచర్యము, దయ, ఓర్పు, సత్యం పాపం చేయకపోవడము, అహింస మొదలైన నియమములను పాటించకుండా స్నానము, మౌనము,

ఉపవాసము, యాగము, వేదాధ్యయనం, ఇంద్రియ నిగ్రహం గురు, శుశ్రూష మొదలైన నియమాలను పాటించకూడదు.

అమర్యాదతో వడ్డించే అన్నము, గొడ్రాలు వండిన అన్నము, శత్రువులు పెట్టే అన్నము, భ్రష్టుని అన్నము, మరుగున ఇతరులను దూషించే వాడి అన్నము, తప్పుడు సాక్ష్యాలు చెప్పేవాడి అన్నము, యజ్ఞఫలము ఇతరులకు అమ్మే వాని అన్నము, కుట్రలు చేసేవాడి అన్నము, చేనసేలు మరిచేవాడి అన్నము, వేశ్యలు పెట్టే అన్నము, దొంగ, సంగీత పాఠకుడు పెట్టే అన్నము, వడ్డీతో జీవించేవాడు పెట్టే అన్నము, మహా పాతకుడు పెట్టే అన్నము, అంటులాడి పెట్టే అన్నము, శూద్రుడు పెటే అన్నము, గురువు తప్ప ఇతరులు భుజింపగా మిగిలిన అన్నము, వైద్యుడు, వేటగాడు, క్రూరుడు వీరు పెట్టే అన్నము, ఉగ్రవాది పెట్టే అన్నము, లోహపు పని చేసేవాడు పెట్టే అన్నము, బోయవాడు, రంగులు అద్దకం చేసేవాడు, బంగారు పని చేసే కంసాలివాడు, ఆయుధాలు అమ్మే వాడు పెట్టే అన్నము, దయలేనివాడు పెట్టే అన్నము తినకూడదు.

రాజాన్నము తేజస్సును, శూద్రాన్నము బ్రహ్మవర్చస్సును, బంగారు పని వాని అన్నము దీర్ఘాయువును, చెప్పులు కుట్టువాడి అన్నము కీర్తిని నశింపజేస్తుంది.

శిల్పుల అన్నము సంతతిని, చాకలివాని అన్నము బలమును, వేశ్యాన్నము స్వర్గలోకమును పోగొడుతుంది.

వైద్యుని అన్నము చీము తినడంతో సమానము. రంకులాడి అన్నము శుక్ర భక్షణంతో సమానం. వడ్డీ వ్యాపారి అన్నము మలంతో సమానం.

కాబట్టి తెలియక ఈ అన్నాలలో ఏదైనా ఒకదానిని మూడురోజులు వరుసగా భుజిస్తే మూడురోజులు ఉపవాసం చెయ్యాలి.

పంచ యజ్ఞములులేని శూద్రుని యన్నము పక్వమైన దానిని భుజింపకూడదు. గతిలేనప్పుడు అతని వద్ద నుంచి ఒకపూట కన్నా ఎక్కువకాని బియ్యము, పచ్చి కూరగాయలు మొదలైన వాటిని తీసుకోవచ్చును.

ఒకదేదైనా యాచిస్తే కోప్పడక వాడికి దానిని దానమియ్యాలి. దానశీలుడి దగ్గరకు పాత్రులైన వారు వచ్చి దాతను నరకం నుంచి ఉద్ధరిస్తారు. కాబట్టి తప్పక దానం చేస్తుండాలి.

నీటినిచ్చువాడు తృప్తిని పొందుతాడు. అన్నము పెట్టేవాడు నశింపని సుఖాన్ని పొందుతాడు. నువ్వులను ఇచ్చేవాడు కోరిన సంతతిని, దీపదానం చేసే వాడు మేలయిన దృష్టిని పొందుతాడు.

భూదానం చేసేవాడు భూమిని పొందుతాడు. బంగారం దానం చేసేవాడు దీర్ఘాయుస్సును, గృహదాత నుంచి గృహాలను పొందుతాడు. వెండిని దానం చేసేవాడు ప్రజలందరినీ మోహింపజేసే రూపాన్ని పొందుతాడు.

గోదాన మిచ్చేవాడు సూర్యలోకమును, ఎద్దుల నిచ్చేవాడు నిండు సంపదను గుర్రాల నిచ్చేవాడు అశ్వనీ దేవతలుండే లోకాన్ని పొందుతాడు.

పల్లకిని, పాన్పును దానం చేసేవాడు చక్కటి భార్యను, అభయం ఇచ్చేవాడు ప్రభుత్వమును, వడ్లు, యవలు, మినుములు మొదలైన ధాన్యముల నిచ్చేవాడు దీర్ఘకాల సుఖమును పొందుతాడు. వేదము చెప్పేవాడు బ్రహ్మతో సమాన లోకం పొందుతాడు.

ఉదకము, అన్నము, గోవులు, భూమి, వస్త్రము, తిలలు, బంగారము, నేయి వీటి దానం కంటే వేదాలు బోధించడం మిక్కిలి శ్రేష్ఠమయినది.

మానవుడు ఏ తలంపుతో అంటే స్వర్గం కావాలని గాని, మోక్షం కావాలని గాని, బ్రహ్మార్పణమని గాని ఏ ఏ దానాలు ఇస్తాడో మరణానంతరం ఆయాఫలాన్ని పొందుతున్నాడు.

ఎవడు పూజా పూర్వకంగా దాన మిస్తున్నాడో, ఎవడు పూజా పూర్వకంగా దానం తీసుకుంటున్నాడో వారిరువురూ స్వర్గం పొందుతున్నారు. అలా దాత పూజా పూర్వకంగా దానం ఇవ్వకపోయినా, గ్రహీత స్వీకరించకపోయినా ఇద్దరూ నరకం పొందుతారు.

తాను చేసిన తపస్సు గురించి తలుచుకొని వింతపడకూడదు. యాగ మొనరి అబద్ధాలు చెప్పకూడదు. బాధపడ్డా బ్రాహ్మణులను నిందింపకూడదు. ఎంత దానము చేసినా చెప్పుకోకూడదు.

అబద్ధాలాడితే యజ్ఞఫలం నశిస్తుంది. గర్వపడితే తపః ఫలం క్షీణిస్తుంది. బ్రాహ్మణులను దూషిస్తే ఆయువు క్షీణిస్తుంది. ఇతరులతో చెప్పుకుంటే దానం నిష్ఫల మవుతుంది.

పరలోకంలో నీకు తోడ్పడడానికి తల్లిదండ్రులు రారు. కొడుకులు రారు. దాయాదులు రారు. నువ్వు ఆచరించిన ధర్మమొక్కటే నీకు తోడుగా వస్తుంది. కాబట్టి పుత్రాదుల కంటే ధర్మం ముఖ్యమని గమనించాలి.

ప్రాణి ఒంటరిగానే పుట్టును. ఒంటరిగానే పెరుగును. ఒంటరిగానే సుకృతము అనుభవించును. ఒంటరిగానే దుష్కృతము అనుభవించును. కాబట్టి తల్లి, తండ్రి

మొదలైన వారికంటే ధర్మం ముఖ్యమని భావించాలి.

ప్రాణి మరణించగానే వాని బంధువులు కట్టెతోను, మట్టితోను, సమమయిన మృతదేహాన్ని పారేస్తున్నారు. చేసిన ధర్మమొక్కటే చివరకు మిగులుతుంది.

చేసిన ధర్మాలతోనే పాపాలను అధిగమించ వచ్చును. కాబట్టి తన సహాయం కోసం జీవితకాలమంతా ధర్మాలను చేస్తూ వుండాలి.

ఉత్తమోత్తములతో అనుబంధంతో బ్రాహ్మణుడు ఉత్తమత్వం పొందుతాడు. అలాగాక అధములతో సంబంధముచే శూద్రత్వము పొందుతాడు.

మొదలుపెట్టిన పనిని మధ్యలో వదిలివేయక పూర్తిచేసేవాడు, మెత్తనివాడు, సుఖదుఃఖాలను ఓర్చుకునేవాడు, పెద్దవాళ్ళతో స్నేహాన్ని వదిలేసేవాడు, ఇతరులను హింసించే స్వభావం లేనివాడు, ఇంద్రియ నిగ్రహం గలవాడు, దానం చేసేవాడు, తపస్సు, వ్రతాలు మొదలైనవి చేయకపోయినా వీటితో స్వర్గం పొందుతున్నాడు.

కట్టెలు, ఉదకము, దుంపలు, పండ్లు, తేనె, మొదలైనవి అయాచితంగా వస్తే కులట, భ్రష్టులు మొదలైన వాళ్ళనుంచి తప్ప మిగిలిన వారి నుంచి గ్రహించవచ్చు.

గృహాన్ని, దర్భలను, శయ్యను, కర్పూరాదులను, నీటిని, పువ్వులను, మణులను, పెరుగును, బొరుగును, చేపలను, పాలను, కూరలను వీటిని ఇవ్వబోతే వద్దని చెప్పకూడదు.

తన భూమిని సాగుచేసేవాడు, కులానికి స్నేహితుడు, ఆవులను మేపేవాడు, తన నౌకరు, తనకు క్షురకర్మ చేసే మంగలి, తన సర్వస్వము అర్పించుకున్నవాడు వీరి అన్నమును భుజింపవచ్చు.

గృహస్థుడు వేదాధ్యయనం చేత ఋషుల ఋణాన్ని, పుత్ర సంతతి కలిగి పితృఋణమును, యజ్ఞముచే దేవతల ఋణమును శాస్త్ర ప్రకారం తీర్చుకుని, యోగ్యుడైన కుమారునికి కుటుంబ భారం అప్పగించి, తను మిగతా విషయాలను పట్టించుకోక ఇంటిలో వుండాలి. వేదాంత శాస్త్ర విషయాలతో కాలక్షేపం చేయాలి. అలా ఏకాంతం మంచి పరతత్త్వ చింతనవల్ల మోక్షం పొందుతాడు.

ఎర్రగడ్డలు, నీరుల్లి, తెల్లపాయలు, గోంగూర మొదలైన అమేధ్య స్థలాల్లో పుట్టిన పదార్థాలను బ్రాహ్మణులు భక్షింపకూడదు.

దేవతా నివేదనానికి కాక తన కోసం సిద్ధం చేసిన నువ్వులపొడి అన్నము, వడలు మొదలైన భక్ష్యాలు, యాగములో మంత్రంతోకాక ఊరక చంపబడిన జంతు

మాంసమును, దేవతల కోసం చేసి నివేదనను చేయని అన్నము, హోమ నిమిత్తము సిద్ధంచేసి, ఆ హోమమును చేయకముందు ఉపయోగించెడి హవిస్సును భక్షింప కూడదు.

ఈని పది రోజులు కాని ఆవుపాలను, అలాంటి ఒంటె, మేక, గొర్రె, గుర్రము పాలను, చూడితోవున్న ఆవుపాలను, దూడలేని ఆవుపాలను భక్షింప కూడదు.

పచ్చి మాంసం తినే గ్రద్దలను, గ్రామంలో వుండే పావురాలు మొదలైన పక్షులను, ఖరాది మృగాలను, టిట్టిభ పక్షులను తినకూడదు.

ఊర పిచ్చుకలను, నీటికాకులను, హంసను, చక్రవాక పక్షిని, పెంపుడు కోడిని, సారసపక్షిని, తాటితోక పక్షిని, భరతపక్షిని, చిలకను,గోరువంకను భక్షింప కూడదు. ఎండిన మాంసమును తినకూడదు.

కొంగ, బెగ్గురుపక్షి, జముడుకాకి, పంది, సకల విధ మత్స్యములను తిన కూడదు.

కొన్ని రకాల చేపలను హవ్యకవ్యములందు నిమంత్రితులైన బ్రాహ్మణులు భుజింప వచ్చునుగానీ తక్కిన వాళ్ళు భుజింపకూడదు.

గోగు, ఊరబంది, వెల్లుల్లి, పెంపుడు కోడి, నీరుల్లి, వెల్లుల్లి వీటిని బ్రాహ్మణుడు బుద్ధిపూర్వకంగా భుజిస్తే భ్రష్టుడవుతాడు.

తెలియక వీటిని తింటే చాంద్రాయణ వ్రతాన్ని చేయాలి. ఇంగువ మొదలైన వాటిని తిన్నప్పుడు రోజంతా ఉపవాసముండాలి.

ప్రతిరోజూ భక్షింపదగిన ప్రాణులను భక్షించే వాడు దోషము పొందడు. బ్రహ్మయే భక్షింపదగినవి ఇవి అని, వీటిని భక్షించువారు వీరు అని ఏర్పరచెను.

యజ్ఞము కోసం పశువును చంపి, హోమము చేసి ఆ మాంసమును భక్షించడం దైవం విధానమని చెప్పారు. అలా కాక తిండికోసం మాంసాన్ని భుజించడం రాక్షస విధి అంటారు.

మాంసము కొన్నదిగాని, తానే సమకూర్చుకున్నదిగాని, ఇతరులచే తెప్పించినదిగాని మొదట దేవ పితరుల కొసగి,మిగిలిన దానిని భక్షిస్తే మాంసభక్షణ దోషము అంటదు.

దేవతలకు, పితరులకు నివేదించక, తనకోసం మాంసము భక్షించు వానికి ఎంత పాపం కలుగుతుందో అంత పాపం జీవించడం కోసం మృగాలను చంపి అమ్మే బోయవాడికి కలగదు.

శాస్త్ర విధానం ప్రకారం శ్రాద్ధ మధుపర్కాలలో వున్న బ్రాహ్మణుడు

మాంసాన్ని భుజించకపోతే, అతడు మరణించాక ఇరవై ఒక్క జన్మలపాటు పశువుగా పుడతాడు.

వేదమంత్రాలతో ప్రోక్షణము చేయక పూరికే చంపబడిన పశువులను బ్రాహ్మణుడు ఎప్పుడూ భుజింపకూడదు. యజ్ఞ యాగాలలో వధింపబడిన పశుమాంసమును తినడం ఆచారమే అని బ్రాహ్మణులు తెలుసుకోవాలి.

పశువు మాంసం తినాలని ఆసక్తి కలిగినపుడు పశువు ఆకారంలో నేతితోగాని పిండితోగాని చేసిన దానిని తినాలిగాని, యజ్ఞ యాగాలతో కాక వ్యర్థంగా పశువులను చంపకూడదు.

యజ్ఞ యాగాదులందు కాక వ్యర్థంగా పశుహింస చేసేవాడు చనిపోయాక జన్మజన్మల్లో పశువు దేహంపై ఎన్ని రోమాలు వుంటాయో అన్నిసార్లు ఇతరులచేత మరణం పొందుతాడు.

బ్రహ్మ తానుగానే యజ్ఞము నిమిత్తము పశువులను సృష్టించాడు. ఈ ప్రపంచము మేలుకోసం యజ్ఞం నిర్మితమైంది కాబట్టి యజ్ఞంలో పశువును వధించడం వధకాదు.

వడ్లు, యవలు మొదలైన ధాన్యాలు, పశువులు, వృక్షాలు, తాబేళ్ళు మొదలైనవి, పక్షులు యజ్ఞం నిమిత్తం నశిస్తే మళ్ళీ ఉత్తమ జన్మపొందుతాయి.

దయ్యాలవలే తినక, ఎవడు మాంస భక్షణము మానుతాడో అతడు ఈ లోకాన అన్ని ప్రాణులకు చెలికాడై రోగాలకు లోను కాడు. నియమము పాటించకుండా మాంస భక్షణం చేయడంవల్ల వ్యాధులు కలుగుతాయి.

జీవహింసకు సమ్మతించేవాడు, జీవుల శరీర భాగాలను నరికేవాడు, జీవులను చంపేవాడు, జీవముల మాంసాన్ని కొనేవాడు, వాటి మాంసాన్ని విక్రయించేవాడు, మాంసం వండేవాడు, వడ్డించేవాడు, భక్షించేవాడు వీళ్ళంతా ఘాతుకులు.

ఎవడు యజ్ఞాలతో దేవతలను, శ్రాద్ధములతో పితరులను సంతోషపెట్టక ఇతర మాంసాలచే తన మాంసమును వృద్ధిచేసుకో జూచునో వాడికంటే నీచుడు వేరొకడు లేడు.

ఎవడు నూరేండ్లు ప్రతి సంవత్సరం అశ్వమేధయాగము చేయునో వానికి కలిగిన పుణ్యఫలం మాంసం తినని వానికి కలిగే పుణ్యఫలం సమానం,మాంస,మద్య మైథున సేవనల వల్ల దోషము రాదు. కాని వీనిని వర్జించడం ఎక్కువ ఫలప్రదము.

మంగలిని, రజస్వలను, భ్రష్టుని, పురిటింటిలోవున్న ఆమెను,శవాన్ని తాకిన

వానిని తాకిన వారు స్నానం చేస్తే శుద్ధికలుగుతుంది.

శూద్రశవాన్ని పట్టణపు దక్షిణ ద్వారంగుండా తీసుకుపోవాలి. బ్రాహ్మణ శవాన్ని తూర్పు ద్వారంగుండా, వైశ్య శవాన్ని పడమర ద్వారం గుండా, క్షత్రియ శవాన్ని ఉత్తర ద్వారం గుండా తీసుకుపోవాలి.

బంధువులున్నప్పుడు, బ్రాహ్మణ శవాన్ని శూద్రులతో మోయించకూడదు. శూద్ర స్పర్శచే ఆ శరీరము అపరిశుద్ధమై మృతునికి స్వర్గలోకం లభించదు.

జ్ఞానము, తపస్సు, అగ్ని, ఆచారము, మట్టి, మనస్సు, నీరు, గాలి, కర్మము, సూర్యుడు, కాలము-ఇవి ప్రాణులకు పరిశుద్ధిని కలిగించును.

విద్వాంసులు ఓర్పుచేత, ఆకార్యాలు చేసేవాళ్ళు దానంచేత, రహస్యపాపాలు చేసేవాళ్లు మంత్రజపంచేత, వేదవేత్తలలో ఉత్తములు తపస్సు చేత పరిశుద్ధులవుతారు.

తోమదగిన పాత్రలు మట్టిచేత, నీటిచేత పరిశుద్ధమవుతాయి. నది పారుదల చేత శుద్ధమవుతుంది. పరపురుష మైదునాది సంకల్పంచే చెడిన మనసుగల స్త్రీ బయట చేరడం చేత పరిశుద్ధురాలవుతుంది. బ్రాహ్మణుడు సన్యాసం చేత పరిశుద్ధుడవుతాడు.

చెమటతో మురికి పట్టివున్న అవయవాలను నీటితో కడగడంవల్ల, నిషిద్ధ చింతగల మనసు సత్యం పలకడంచేత, జీవాత్మ బ్రహ్మజ్ఞాన తపస్సులచేత, విపరీత బుద్ధి నిశ్చయజ్ఞానము వల్ల పరిశుద్ధమవుతాయి.

చండాలాది స్పర్శ దూషితాలైన తృణములు, వంట చెరకులు జలప్రోక్షణముచే పరిశుద్ధమగును. ఇళ్ళను నీళ్ళతో కడగడం, వెల్లవేయడం వల్ల పరిశుద్ధం అవుతాయి. మట్టిపాత్ర మళ్ళీ కాల్చడంవల్ల పరిశుద్ధ మవుతుంది.

మద్యము, మూత్రము, మలము, చీము కారడం, రక్తం మొదలైనవి అంటిన మట్టి పాత్రలు మళ్ళీ కాల్చినా పరిశుద్ధంకావు కాబట్టి వాటిని పారవేయాలి.

ఊడ్చి, పేడతో అలికి, గోమూత్రం చల్లితే, పైమట్టి తవ్వి ఎత్తివేస్తే, ఒక పగలు, రేయి పశువుల్ని కట్టివేస్తే ఈ ఐదు పనులవల్ల భూమి పరిశుభ్రమవుతుంది.

ఏ విధమైన దోషం వున్నట్లు తెలియని పదార్థం, నీటితో కడిగిన పదార్థం, బ్రాహ్మణుని నోటితో పరిశుద్ధమైందని చెప్పిన పదార్థం-ఇవి మూడు బ్రాహ్మణులకు పరిశుద్ధమని గ్రహించాలి.

ఎల్లప్పుడూ స్త్రీ ముఖము పరిశుద్ధము. కాకులు మొదలైనవి ముక్కుతో పొడిచి క్రింద తోసిన పండు శుచియైనది. వేటాడేటప్పుడు వేటకుక్కల నోరు పరిశుద్ధము. కాబట్టి వేటాడే కుక్కలచే చంపబడిన మృగముల మాంసము పరిశుద్ధము.

బొడ్డుకుపైన వుండే ఇంద్రియ రంధ్రాలు పరిశుద్ధాలు. కాబట్టి వాటిని తాకితే

అపరిశుభ్రతలేదు. బొడ్డుకు క్రిందవుండే ఇంద్రియాలు అపరిశుద్ధాలు. కాబట్టి వానిని తాకితే అపరిశుద్ధత కలుగుతుంది.

దేహంలోని చెడుసీరు, గోళ్ళ మురికి, రేతస్సు, అమేధ్యము, కన్నీరు, కంటి పుసి, రక్తము, కొవ్వు, మూత్రము గుబిలి, కఫము, చెమట-ఈ పన్నెండు మనిషి దేహంలోని మలములు.

మలమూత్రాలకు వెళ్ళినప్పుడు శుద్ధిచేసుకునేవాడు నీటితో లింగమునొకసారి, పాయుస్థానమును మూడుసార్లు,ఎడమచేతిని అయిదుసార్లు, తరువాత రెండుచేతులను ఏడుసార్లు కడగాలి. గృహస్థులు ఇలాచేయాలి. బ్రహ్మచారులు దీనికి రెండింతలుగా, వానప్రస్థుడు మూడింతలుగా, సన్యాసులు నాలుగింతలుగా ఈ పనులు చేయాలి.

దేహశుద్ధిని కోరు బ్రాహ్మణుడు ముందు మూడుసార్లు నీటి నాచమనము చేయాలి. తర్వాత నోటిని రెండుసార్లు నీటితో తుడవాలి. స్త్రీలు, శూద్రులు ఒకసారే ఆచమనము చేయాలి.

0 0 0

పసిది అయినా, యవ్వనంలో వున్నది అయినా, ముసలిది అయినా స్త్రీ ఇంటిలో స్వతంత్రంగా ఏ పనీ చేయకూడదు.

స్త్రీ బాల్యంలో తండ్రి ఆధీనంలో వుండాలి. యవ్వనంలో భర్త ఆధీనంలో వుండాలి. భర్త చనిపోయిన తరువాత కొడుకుల ఆధీనంలో వుండాలి తప్ప స్త్రీకి ఎప్పుడూ స్వేచ్ఛ కూడదు.

స్త్రీ తండ్రిని, భర్తను, కొడుకులను వదిలి వుండకూడదు. ఆలా వదిలివుంటే తల్లి వంశానికి, తండ్రి వంశానికి రెంటికీ చెడ్డపేరు తెస్తుంది.

భర్తకు తనమీద ఇష్టం లేకున్నా భార్య ఎప్పుడూ నగుమోముగలదై, నేర్పుతో ఇంటి పనులు చక్కబెడుతూ,ఇంట్లో వస్తువులను చక్కగా వుంచుకొంటూ. ఎక్కువ డబ్బు ఖర్చు పెట్టకుండా జాగ్రత్తగా వుండాలి.

తండ్రి కన్యను ఎవరికి ఇస్తాడో, తండ్రి అనుమతితో తోడబుట్టినవాడు కన్యను ఎవరికి ఇస్తాడో ఆమె ఆ భర్తకు జీవితాంతం శుశ్రూష చేయాలి. అతను చనిపోయిన తర్వాత వేరొకరిని వివాహం చేసుకోకూడదు. భర్త చనిపోయినప్పుడు అతనికి అంత్యక్రియలు సరిగ్గా జరపక, భర్తకు అధోగతి కలిగించకూడదు.

స్త్రీలకు వివాహ సమయంలో శాంతి కోసం చెప్పే మంత్రాన్ని పఠించడం, హోమం చేయడం మొదలైనవి మంగళార్థము చేసేవి. కాని మొదట వాగ్దత్తము జరగగానే భర్తకు భార్యపై అధికారం వస్తుంది.

వివాహం చేసుకున్న భర్త సుఖాన్ని ఇస్తాడు. తనను ఆదరించడం వల్ల పరలోకమందలి సుఖాన్ని ఒసగుతాడు.

భర్త సదాచార శూన్యుడయినా, వేరొక స్త్రీ యందు మనసు పడివున్నా, విద్యాది సుగుణాలు లేకపోయినా భర్తను పతివ్రత అయిన స్త్రీ ఎల్లప్పుడూ దేవుని వలె పూజించాలి.

పురుషుడు ఒక భార్య కాకపోయినా వేరొక భార్య ద్వారా యజ్ఞము చేయవచ్చుగానీ, స్త్రీ ఒక భర్తను విడిచి వేరొకనితో యజ్ఞము చేయకూడదు. భర్త అనుమతి లేక వ్రతము చేయకూడదు. ఉపవాసము చేయకూడదు.

భర్తకు శుశ్రూష చేయడం వల్లనే భార్య స్వర్గలోకంలో పూజ్యురాలు అవుతున్నది.

భర్తకు విరుద్ధంగా భార్య ఏ పనీ చేయకూడదు. భర్త చనిపోతే శ్రాద్ధము చేయకుండా వుండకూడదు. వేరొక పురుషునితో కలవకూడదు.

భర్త చనిపోయిన తరువాత పతివ్రత ఆయిన స్త్రీ కంద మూలాలు తింటూ శరీరాన్ని కృశింప జేసుకుంటూ వుండాలిగానీ, పరపురుషుని పేరయినా ఉచ్చరింపకూడదు. సంభోగము కోరకుండా, ఆమరణాంతం బ్రహ్మచర్యంతో వుండాలి. పుత్రసంతానం కోసం పరపురుషుని కోరకూడదు.

బాల్యములోనే బ్రహ్మచారులై వివాహం చేసుకోకుండా ఉండిపోయిన బ్రాహ్మణుల వంశాలు వేలవేలు సంతతి లేకుండానే పుణ్యలోకాలు పొందినాయి కాబట్టి తనకు సంతతి లేదని బాధపడకూడదు.

కాబట్టి భర్త చనిపోయిన స్త్రీ పతివ్రత అయితే పుత్రులు లేకపోయినా ఆ బ్రహ్మచారులవలే పుణ్యలోకాలు పొందుతుంది.

ఏ స్త్రీ తనకు పుత్రుడు కావాలని ఆశతో పరపురుషుడితో సంభోగం చేస్తుందో ఆ స్త్రీ ఇహలోకంలో నిందలపాలై, పరలోకంలో స్వర్గాది పుణ్యలోకములను పొందదు. మరణానంతరం నక్కగా పుడుతుంది. కుష్టు మొదలైన నికృష్టరోగాల పాలవుతుంది.

ఏ కాంత మనోవాక్కాయములచేత భర్తను తప్ప వేరొకని కోరదో ఆ స్త్రీ పతివ్రత కనుక మరణానంతరము భర్త వుండే లోకాలను చేరుతుంది. భర్త కన్నా ముందుగా భార్య చనిపోతే ఆమె వల్ల పుత్రులున్నా, లేకున్నా అతను వేరొక స్త్రీని వివాహం చేసుకుని స్మార్తాగ్నులనుగాని, వైదికాగ్నులనుగాని మళ్ళీ ఏర్పరచుకోవాలి.

విప్రుడు పంచయజ్ఞములు చేయడం మానకుండా, భార్యతో కూడి జీవితంలో రెండవ భాగమైన గృహస్థాశ్రమాన్ని గడపాలి.

గృహస్థుడికి ఎప్పుడు జుట్టు నెరిసి, ముఖాన ముడతలుపడి, ఎప్పుడు మన వడు కలుగుతాడో అప్పుడు గృహస్థాశ్రమము వీడి వాన ప్రస్థాశ్రమానికై అర ణ్యానికి పోవాలి.

వూళ్ళో దొరికే ధాన్యాలు, కూరలు మొదలైన ఆహారాల్ని వదిలి అడివిలో చిక్కే కందమూల ఫలాన్ని ఆహారంగా తీసుకుంటూ. పరిజనాన్ని అంతటినీ విడిచి భార్యను పుత్రుల వద్ద వదిలిగాని, ఆమెకు ఇష్టం వుంటే ఆమెతో కలిసిగాని వనానికి వెళ్ళాలి.

గృహంలో వున్న అగ్నిని, అగ్నిహోత్రానికి కావలసిన ఉపకరణాలను తీసు కుని గ్రామం నుంచి అరణ్యం చేరి జితేంద్రియుడయి వుండాలి.

జింక మొదలయిన జంతువుల చర్మాలనుగాని, నారబట్టలనుగాని ధరించాలి. తెల్లవారు సమయాన, సాయంత్రం స్నానం చేయాలి. జడలను, గడ్డమును,మీసాలను రోమాలను భరించాలి.

తానేది భుజించునో ఆ పదార్థాలతోనే శ్రాద్ధ కర్మలను చేయాలి. తన ఆశ్ర మానికి వచ్చిన వారిని జలము, పండ్లు, దుంపలు, వీటి భిక్షతోనే సత్కరించాలి.

వానప్రస్థాశ్రమం తీసుకున్న వ్యక్తి వేదాధ్యయనంలో ఎల్లప్పుడూ ఆసక్తి గలవాడై వుండాలి, ఎండ, చలి, వాన మొదలైనవి ఓర్చుకోగలగాలి. అందరికీ మేలు చేసే తత్వం వుండాలి. మనసును వశపరచుకోవాలి. ఇతరులనుంచి ఏమీ స్వీకరించ కూడదు. సకల జీవరాశియందు దయగలవాడై వుండాలి.

అగ్నిపక్వమైన ఆహారాన్ని, కాలానికి తాముగా పండిన పండ్లను తినేవాడుగా వుండాలి.

మూడు వేళల్లో స్నానంచేస్తూ, దేవర్షిపితృతర్పణమును చేస్తూ, పక్షోపవాసము మాసోపవాసము చేస్తూ కడు తీవ్రమైన తపస్సుచేసి దేహాన్ని కృశింపచేయాలి.

సుఖం అందం విషయంలో జాగ్రత్త తీసుకోకుండా, స్త్రీసంపర్కముమాని, నేలమీద పడుకుంటూ, ఎక్కడ కూర్చుంటున్నాను, ఎక్కడ పడుకుంటున్నాను అనే విషయంలో శ్రద్ధ వదిలి, చెట్ల మొదట నివసించాలి.

తాపసులకు బ్రాహ్మణుల నుంచే జీవనాధారానికి కావలసిన ఆహారాన్ని భిక్షగా తీసుకోవాలి. అట్టివారు లేనిచోట వనవాసులైన ఇతర గృహస్థుల నుంచి భిక్ష

తీసుకోవాలి. అలాంటివారు లభించనప్పుడు గ్రామం నుంచి అయినా ఎనిమిది ముద్దలను, ఆకులోనైనా, మూకుటి పెంకులోనైనా, దోసిలితోనైనా తెచ్చుకుని తాను వనవాసి అయి భుజించాలి.

వానప్రస్థుడికి చికిత్సకు అలవిగాని వ్యాధి సోకితే యోగనిష్ఠుడై జలము, గాలిని భుజిస్తూ ఈశాన్యదిక్కువైపు సాగిపోవాలి. శరీరం నేలలో కలిసేంత వరకు ఈ మహాప్రస్థానం చెయ్యాలి.

ఆశ్రమములందు జీవితకాలంలోని మూడవ భాగాన్ని గడిపి, తరువాత నాలుగవ భాగమైన సన్యాసమును స్వీకరించాలి.

లౌకికాగ్ని లేనివాడయి,ఇల్లులేక, శరీరానికి వ్యాధులు వచ్చినా వాటిని లెక్కచేయక, స్థిరచిత్తుడై, మౌనిగా బ్రహ్మమును ధ్యానిస్తూ రేయింబవళ్ళు వనంలోనే వుండి ఆహారం కోసం మాత్రమే గ్రామానికి పోవాలి.

భిక్షకై మట్టిమూకుడు, ఉనికికై చెట్టు మొదలును, గోచికై చింపిపేలికను, అన్నింటిపట్ల సమత్వబుద్ధి-పరివాజక లక్షణము.

జననముగాని, మరణముగాని తాను కోరకూడదు. కూలివాడుకూలికి ఎదురు చూసినట్లు తాను మరణ కాలానికై ఎదురు చూడాలి.

సత్యంతో పరిశుద్ధమయిన మాటనే పలకాలి. చెడ్డ సంకల్పం లేని మనసుతో పరిశుద్ధాత్ముడై వుండాలి.

ఇతరుల నిందలను ఓర్చుకోవాలి, ఇతరులను నిందింపకూడదు. ఎవరితోనూ విరోధం పెట్టుకోకూడదు. తనపై ఎవరైనా కోప్పడ్డా, వారిపై తాను కోపపడరాదు. ఇతరులు తనను నిందించినా తాను మాత్రం మంచి మాటలే పలకాలి.

ఒరుల నిందలను ఓర్వవలయును. పరులను నిందింపరాదు. శరీరమును నమ్మి ఎవరితోనూ వైరము పూనరాదు.

వెండి, బంగారు మొదలైన లోహములతో చేసినవి రంధ్రాలు లేని పాత్రలను సన్యాసులు భిక్షకు ఉపయోగించాలి.

భిక్షాదులు దొరకనప్పుడు విచారపడకూడదు. దొరికినప్పుడు పొంగిపోరాదు. ప్రాణ సంరక్షణకు కావలసినంత భిక్ష మాత్రమే తీసుకోవాలి.

ఒకరు తనను గౌరవించి ఇచ్చిన భిక్షను తీసుకొనకూడదు. అట్టి భిక్ష తీసుకుంటే భిక్ష ఇచ్చిన వారిపై వాత్సల్యమువల్ల ముక్తిమార్గం పొందదగినవాడు కూడా జన్మపాశంలో చిక్కుకుంటున్నాడు.

అల్పాహారం తీసుకుంటూ, ఏకాంతంలో వున్నా విషయాసక్తి గల ఇంద్రియాలను వాటినుంచి మరలించాలి.

ఇంద్రియాలను నిగ్రహించి, మిత్రులయందు స్నేహము, అమిత్రులయందు ద్వేషము లేకుండా, జీవులను హింసింపక వుండే సన్యాసి మోక్షము పొందుతాడు.

ఇంద్రియాలను జయించుటకు, విషయ వైరాగ్యం కలగడానికి సంసారం

యొక్క నిస్సారత్వాన్ని గురించి ఆలోచించాలి. నరకం గురించి, నీచజన్మప్రాప్తి గురించి ఆలోచిస్తూ వుండాలి.

ఇష్టమైన కుమారులతో ఎడబాటును, ఇష్టము లేనివాళ్ళతో స్నేహం, ముసలితనంవల్ల బాధ, రోగంతో బాధపడటం గురించి చింతిస్తూ వుండాలి.

మరణం గురించి, మహారోగాలతో బాధపడటం గురించి, జీవాత్మలకు అధర్మంవల్ల జనించే దుఃఖ సంబంధం గురించి, ధర్మంవల్ల కలిగే సకల సుఖాల గురించి ఆలోచించాలి.

మనసులోని రాగద్వేషాలను, ఇంద్రియాలకు లొంగడం మొదలైన దోషాలను ప్రాణాయామం చేయడం ద్వారా తొలగించుకోవచ్చును.

జ్ఞానము కలిగినవాడు పుణ్యపాపములకు లోబడడు. అట్టి జ్ఞానము లేనివాడు జనన మరణ రూపమైన సంసారాన్ని పొందుతున్నాడు. చిల్లగింజ నీటిలోని మురికిని పోగొట్టును. దాని పేరు చెప్పినంత మాత్రాన నీరు నిర్మలము కాదు. దానిని నీటిలో వాడితేగాని నీటి మురికి వదలదు. అలాగే ఆశ్రమ చిహ్నాలు ధరించుట ధర్మాచరణం అనిపించుకోదు. ప్రాణహిత కృత్యములే ధర్మాచరణము.

నిషిద్ధ హింసను వీడడంవల్ల, ఇంద్రియాలను విషయాసక్తినుంచి మరల్చుట చేత, వేదోక్తమైన నిత్యకర్మలను అనుష్ఠించుటచేత, ఘోర తపస్సు లాచరించుటచేత ఈ లోకంలో బ్రహ్మప్రాప్తి అనే పదవిని పొందుతాడు.

ఎముకలు గలది, నరములతో కూడినది, రక్తమాంసములచే పూయబడినది, చర్మముచే కుట్టబడినది, మలమూత్రాలతో నిండినది కనుకనే దుర్గంధము గలది, ముసలితనం, దుఃఖంతో నిండినది, రోగాలకు ఆయువుపట్టు, ఆకలిదప్పులు, శీతోష్ణములకు లొంగినది. దుమ్ముతో నిండినది, నశించు స్వభావం కలది అయిన దేహాన్ని వదిలి వేయాలి.

చెట్టులాగా మానవుడు ఎటు పడిపోతున్నాడో తెలియక కర్మాధీనమైన దేహం పాటును చూస్తున్నాడు. పక్షి మాత్రం తన గూటిని స్వేచ్ఛగా కావాలనుకున్నప్పుడు వదిలేస్తుంది. జ్ఞానంగల మానవులు దేహాన్ని భీష్ముని వలే స్వేచ్ఛతోవదిలి సంసారం అనే పట్టునుంచి విడుదల పొందాలి.

బ్రహ్మవేత్త అయినవాడు తన ఇష్టులకు తన పుణ్యాన్ని, తన అయిష్టులకు తన పాపాన్ని వదిలి ధ్యాననిష్ఠ గలవాడై బ్రహ్మముతో ఐక్యము పొందుతున్నాడు.

పుత్రులపై అభిమానం వదలడం, మానావమానాదుల లేమి, బ్రహ్మమునందే ఐక్యము ఇవన్నీ తనను పరమాత్మ రూపంలో ధ్యానించే వానికే కలుగుతాయి. కాని

ఎవడు ఆత్మను పరమాత్మ అని తెలుసుకోడో, ధ్యానింపడో, అట్టివాడు మానావ మానములయందు ఒకే విధంగా వుండలేడు, మోక్షమును పొందలేడు.

యజ్ఞములను గూర్చినది, దేవతలను గూర్చినది, జీవాత్మను గూర్చినది, వేదాంతములందు ప్రతిపాదింపబడినది అయిన వేదమును ఎల్లప్పుడూ జపించాలి.

బ్రహ్మచారి, గృహస్థుడు, వానప్రస్థుడు, సన్యాసి అని వేరువేరుగా ఏ ఆశ్రమములు చెప్పారో ఆ నాలుగునూ గృహస్థాశ్రమమువల్ల ఏర్పడినవి.

ఈ నాలుగు ఆశ్రమాలను శాస్త్ర ప్రకారం నడుచుకుంటే అవి ఒకటిగాని, రెండుగాని, మూడుగాని మోక్షప్రాప్తి అనే ఉత్తమగతిని కలిగిస్తాయి.

ఈ నాలుగాశ్రమాల వారిలో గృహస్థుడే ఉత్తముడంటారు. తక్కిన మూడు ఆశ్రమాల వారిని అతడే పోషిస్తున్నాడు కదా! కాబట్టి అతడే శ్రేష్ఠుడు.

ఈ నాలుగు ఆశ్రమాల వారూ పదిరకాల ధర్మాలను ఆచరించాలి.

సంతోషం, కీడు చేసిన వాడికి తిరిగి కీడు చేయకపోవడం అనే క్షమాగుణం, వికారాలకు హేతువు ఉన్నా చలించక ఉండే దమము, ఇతరుల వస్తువులను అపహరించక పోవడం, నీటితో దేహాన్ని కడగడం అనే శౌచము, విషయాల నుంచి ఇంద్రియాలను మరల్చడం, శాస్త్ర రహస్యాలను తెలుసుకోవడం, ఆత్మజ్ఞానము, ఉన్నదున్నట్లు చెప్పడం, కోపం లేకపోవడం అనేవి ధర్మానికి గుర్తులు.

ఎవరీ దశవిధ ధర్మాల లక్షణాలను తెలుసుకుంటున్నారో, తెలుసుకుని ప్రవర్తిస్తున్నారో వారు ఉత్తమగతిని పొందుతారు.

బ్రాహ్మణుడు ఈ పది లక్షణాలు గల ధర్మము తెలుసుకుని, జాగరూకుడై, వీటిని పాటిస్తూ, వేదాంతం, ఉపనిషత్తుల అర్థాన్ని గురువు వద్దనుంచి గృహస్థ దశయందే చక్కగా నేర్చుకుని మూడు రకాలయిన ఋణాలను తీర్చి, సన్యాసమును స్వీకరించాలి.

* * *

శాస్త్ర విధి ప్రకారం ఉపనయన సంస్కారం పొందిన క్షత్రియుడు తన దేశము నందున్న సకల జనులయొక్క సంరక్షణను తన బాధ్యతగా తప్పక చేపట్టాలి.

రాజులు లేని ప్రపంచం బలవంతులవల్ల భయపడుతూ ఉండగా బ్రహ్మ అట్టి ప్రపంచాన్ని కాపాడటం కోసం ఇంద్రుడు, వాయువు, యముడు, సూర్యుడు, అగ్ని, వరుణుడు, చంద్రుడు, కుబేరుడు మొదలయిన వారి అంశలను గ్రహించి రాజును సృష్టించాడు.

ఏ కారణంచేత రాజు దేవతా శ్రేష్ఠులయిన వారి అంశలచే రూపొందాడో, ఆ కారణంతో అతడు ఇతర ప్రాణులలోకె మేటిగా ఉన్నాడు.

సూర్యుడివలే ఇతనిని ఎవరూ తల ఎత్తి చూడజాలరు. అతడే అగ్ని, అతడే వాయువు, అతడే సూర్యుడు, అతడే ధర్మరాజు, అతడే చంద్రుడు,అతడే కుబేరుడు, అతడే వరుణుడు, అతడే దేవేంద్రుడు.

కాబట్టి రాజు బాలుడయినా మానవ మాత్రుడని అవమానింప కూడదు. గొప్ప దైవమే మానవ రూపమున భూమిమీద అవతరించి ఉన్నదని గ్రహించాలి.

అగ్ని అని తెలియక ఎవడు దాని దగ్గరకు పోతాడో ఆ పోయినవాడి నొక్కడినే అగ్ని దహిస్తుంది. కాని రాజు జోలికి పోయిన వాడిని పశు, ద్రవ్య, ధన, ధాన్యాలతో, పుత్ర, మిత్ర, కళత్ర బంధువులతో కలిపి రూపుమాపుతాడు. కాబట్టి రాజును తిరస్కరించకూడదు.

రాజు తన శక్తిని, దేశ కాలాలను, కార్యమును గమనించి పలు విధాలుగా ప్రవర్తిస్తాడు. శక్తి లేనప్పుడు ఇతరులను ఓర్పుకుంటాడు. శక్తి కలిగినప్పుడు నాశనము చేస్తాడు. ఒక చోటనే, ఒక కాలంలోనే కార్యము ననుసరించి, శత్రుత్వమును, మిత్రత్వమును, తటస్థతను పాటిస్తాడు. కాబట్టి నేను రాజునకు స్నేహితుడనని ఎవరూ అతన్ని లెక్కచేయకుండా ఉండకూడదు.

ఎవని అనుగ్రహం కలిగినప్పుడు గొప్ప ఐశ్వర్యము కలుగుతుందో, ఎవని చూపుతో విజయం కలుగుతుందో అట్టి రాజు సకల తేజ స్వరూపుడు.

కాబట్టి సంపద కోరువారు అతనిని కొలవాలి. శత్రు సంహారం కోరువారు అతన్ని ఆశ్రయించాలి. జీవించాలనుకున్న వాళ్ళు అతనితో విరోధం పెట్టుకోకూడదు. తప్పక హాని కలుగుతుంది. అతడు సూర్యాగ్నిసోమాదుల శక్తి గలవాడు గనుక అతన్ని ఆశ్రయించాలి.

రాజు తన విరోధిని రూపుమాపడానికే ప్రయత్నం చేస్తాడు. రాజు తనకు కావలసిన వాటిలో ఏది ఇష్టమో, ఏది శాస్త్ర సమ్మతమో, ఏది శాస్త్ర విరుద్ధమో విచారించి నిర్ణయిస్తాడు.

ఆ రాజు కార్యశుద్ధికై సకల ప్రాణి సంరక్షకుడగు ధర్మమనే పుత్రుని, బ్రహ్మ తేజ స్వరూపమయిన దండమును బ్రహ్మ సృష్టించెను.

ఆ దండము నందు రాజబలమున్నందున అదే రాజు. ఆ దండము చేతనే అన్ని కార్యములు నెరవేర్చబడతాయి కాబట్టి అదే నాయకుడు. ఆ దండమే శాసనం చేస్తున్నది కాబట్టి అదే శాసనకర్త.

దండము ప్రజలందరికీ ఆనతినిస్తున్నది. దండము రాజువలే వారిని సంరక్షి

స్తున్నది. రక్షకులు నిద్రించి ఉన్నా దండము మేల్కొని కావలి కాస్తున్నది. దండమే ధర్మ హేతువు గనుక దానిని ధర్మమని పెద్దలు చెబుతున్నారు.

శాస్త్రములను చక్కగా పరిశీలించి న్యాయా న్యాయ విచారణ చేస్తే దండము ప్రజల నందరిని రంజింప జేస్తుంది. అలా చేయకపోతే దండము అందరినీ నశింప జేస్తుంది.

ఈ లోకమంతా దండముచేత నియంత్రించబడి సన్మార్గంలో నున్నది. లోకములో దండనం లేక స్వాభావికంగా పరిశుద్ధుడయిన మానవుడు ఉండటం అరుదు. దండ భయం వల్లనే ఈ ప్రపంచం అవసరమైన కార్యక్రమాలను జరుపుకోగలిగి ఉన్నది.

దేవ దానవ గంధర్వులును, రాక్షస గరుడ పన్నగులును, జగదీశ్వరుడయిన పరమేశ్వరుని దండనకు భయపడే వాన కురిపించడం మొదలయిన స్వకార్యములను చేస్తున్నారు.

దండ భయం లేకపోతే బ్రాహ్మణాదులగు నాలుగు వర్ణాలవారు ఒకరి స్త్రీలను ఒకరు పొంది సంకర జాతి వారవుతారు. సకల శాస్త్రములలో చెప్పిన ధర్మార్థ కామ మోక్షములు నాలుగును నశిస్తాయి. అరాచకము సంభవిస్తుంది.

దండ నాయకుడగు రాజు సత్యవాదిగాను, నిత్య సత్యములను విచారించ టంలో సమర్థుడిగాను, బుద్ధిమంతుడిగాను, ధర్మార్థకామములు తెలిసిన వానిగా పెద్దలు చెబుతున్నారు.

రాజు ఆ దండమును చక్కగా ఉపయోగిస్తూ ధర్మార్థకామములను పొందును. అలా కాకుండా విషయాభిలాషతో పక్షపాతియై, నీచుడై ప్రవర్తిస్తే ఆ దండము చేత ఆ రాజు చంపబడతాడు.

గొప్ప వెలుగుకు రూపమయింది దండం. అసమర్థులయిన వారు దానిని సహింపజాలరు. రాజనీతి నుంచి తప్పిన రాజుని దండము పుత్ర, మిత్ర, బంధువులతో సహా నాశనం చేస్తుంది.

అట్టి దండమును మంత్రులు, సలహాదారులు లేనివాడు, లోభి, మూఢుడు, చదువురానివాడు, విషయాభిలాష గలవాడు అయిన రాజు నీతిశాస్త్ర ప్రకారము ఉపయోగించలేడు.

మాట తప్పనివాడు, లంచం తీసుకోనివాడు, శాస్త్ర ప్రకారం నడుచుకునే వాడు, మంత్రులు, సహాయకులు గలవాడు, జ్ఞానవంతుడు అయిన రాజు ఈ దండమును చక్కగా ఉపయోగించగలడు.

రాజు స్వరాజ్యమునందు నీతిశాస్త్రము ననుసరించి నడిచేవాడుగాను, శత్రువులను కఠినంగా దండించేవాడుగాను, మిత్రుల పట్ల కుటిలత్వం లేనివాడుగాను, దోషులయిన బ్రాహ్మణుల యందు ఓర్పు గలవాడుగాను ఉండాలి.

రాజు ఇలాంటి నడవడిక గలవాడయి ఉంటే, అతడు సంపద లేకపోయినా నీటిలో నూనె బిందువు వలే అతని కీర్తి లోకంలో ప్రఖ్యాతి గాంచుతుంది.

తమ తమ ధర్మాల పట్ల పట్టుదల గల చాతుర్వర్ణమును, బ్రహ్మ చర్యాద్యాశ్రమములను చక్కగా రక్షించడానికై బ్రహ్మ రాజును సృష్టించాడు.

ఆ రాజు ఉదయాన్నే లేచి మూడు వేదములను చదువుకున్న విద్వాంసులయిన బ్రాహ్మణులను పూజించాలి. వారి ఆనతి ప్రకారం నడుచుకోవాలి.

వయసు చేతను, తపస్సు చేత పెద్దలయిన వారు, వేదముల నెరిగినవారు శారీరకంగా, మానసికంగా పరిశుద్ధులయిన వారు అయిన బ్రాహ్మణులను రాజు సేవించవలయును. అలా సేవించనివాడు రాక్షసులకు పూజ్యుడయినవాడు.

సహజమైన తెలివితేటలవల్ల, అర్థశాస్త్రం మొదలయినవి అభ్యసించడం వల్ల జ్ఞానం కలిగినా పెద్దల నుంచి నీతిని నేర్వాలి. పెద్దల కడ శిక్షితుడైన రాజు ఎన్నటికీ నశింపడు.

చాలామంది రాజులు గుర్రాలు, ఏనుగులు, కోశాగారం, పరివారం కలిగి ఉన్నా, పెద్దల శిక్షణ లేని వారయినందున నశించారు. కొందరు రాజులు అడవుల్లో ఉన్నా పెద్దల శిక్షణ వల్ల రాజ్యాలు పొందారు.

రాజు వేదాలను, దండనీతిని, తర్కశాస్త్రమును, బ్రహ్మ విద్యను, కృషి, వర్తకము మొదలైన విషయాలను ఆయా విషయజ్ఞుల వద్ద నేర్చుకోవాలి.

రాజు రేయింబవళ్ళు ఇంద్రియాలను నిగ్రహించుకోవడానికి ప్రయత్నించాలి. జితేంద్రియుడైన రాజు ప్రజలను తన వశమున ఉంచుకోగలడు.

వ్యసనములకు వేట, వాదము, పగటి నిద్ర, పరనింద, స్త్రీలతోడి కూటమి, మద్యము వలన మదము, నృత్యగీతాదులు. వ్యర్థ సంచారము మొదలైన వాటికి లోబడ్డరాజు అర్థ కామముల నుంచి హీనుడవుతున్నాడు.

క్రోధం వల్ల పుట్టిన కొండెములు చెప్పడం, సజ్జనుల నొంచడం కపటంతో చంపడం, పరుల గుణాలను ఓర్వలేక పోవడం, ఇతరుల సంపదను దొంగిలించడం, ఇవ్వదగిన వాడికి ఇవ్వకపోవడం, నోటి దుడుకుదనం, దండన–ఈ ఎనిమిది వ్యసనాలకు లోనైనవాడు దేహానికి నాశనం తెచ్చుకుంటాడు.

ఈ వ్యసనాలలో దొంగతనం కంటే తిట్టడం, తిట్టడం కంటే కొట్టడం,

కొట్టడం కంటే వేట, వేట కన్నా స్త్రీ సంభోగము,స్త్రీ సంభోగము కంటే జూదము, జూదము కంటే మద్యపానము చెడ్డవి. కాబట్టి రాజు వీటిని వదిలేయాలి.

వ్యసన మరణాలు రెండింటిలో వ్యసనమే మిక్కిలి చెడ్డది.

వంశపారం పర్యముగా వచ్చిన వారిని, శాస్త్రజ్ఞులను, శూరులను, విలు విద్యలో నేర్పు గలవారిని, మంచి వంశములలో పుట్టిన వారిని ఏడుగురినో, ఎనిమిది మందినో పరీక్షించి మంత్రులుగా నియమించుకోవాలి.

రాజు మంత్రులతో చాచనవసరం లేని మామూలు విషయాలను, సంధి విగ్ర హాలను, దండము, ద్రవ్యము, పురము మొదలైన వాటిని గూర్చిన వ్యవహారాలను, సంరక్షణ, దొరికిన సంపద మొదలైన వాటిని గురించి మంతనాలు జరపాలి.

ఆ మంత్రులలో ఒక్కొక్కరి ఆంతర్యము వేరు వేరుగానూ, అందరి అభి ప్రాయం సమిష్టిగానూ తెలుసుకుంటూ రాజకీయ కార్యాలలో తనకు ఏది మేలో దానిని చేయాలి.

వీరందరిలోకి గొప్పవాడైన, ధార్మికత్వం మొదలైన సుగుణాలలో అందరి కంటే మిన్న అయిన విద్వాంసుడయిన బ్రాహ్మణునితో రాజు తన శత్రువులతో యుద్ధము, సంధి వంటి ముఖ్యమైన విషయాలను గురించి సమాలోచనలు చేయాలి.

అలా సమాలోచనలు చేసినప్పుడల్లా ఆ బ్రాహ్మణుని మీద మిక్కిలి విశ్వాసం ఉంచి, అతనికి అన్ని విషయాలు తెలియపరిచి అతని ఆలోచన ప్రకారం చేయ వలయును.

దాన శీలురు, ప్రజ్ఞావంతులు, ధీరులు, చక్కని సంపాదన కలిగిన వారు అయి ధర్మపరులయితే వారిని కార్య మంత్రులుగా చేయాలి.

ఆ మంత్రులలో నేర్పరులు, కుల ధర్మానికి లొంగిన వారిని, ద్రవ్యాశలేని వారిని ధనాదాయ స్థలాలలో నియమించాలి. ధాన్యం మొదలైనవి చేర్చే ప్రదేశాలలో నియమించాలి.

నగరు లోపలి కార్యాలకు ధైర్యవంతులు కాని వారిని నియమించాలి. శూరు లను నియమిస్తే వాళ్ళు పరరాజు దగ్గర లంచం తీసుకుని రాజును అపహరించేం దుకు సాయపడవచ్చు, కాబట్టి శూరులను నగరు లోపల నియమించకూడదు.

ఇహికాముష్మిక శాస్త్రాలు తెలిసినవాడు, మాటల నేర్పుతో ఇతరుల మనసు నెరిగే స్వభావం గలవాడు, చేతులు మొదలైన సంజ్ఞల అర్థాలను అర్థం చేసుకోగల వాడు, పరిశుద్ధుడు, నేర్పరి, వంశ పారంపర్యంగా వచ్చిన వానిని దూతగా నియ మించుకోవాలి.

ప్రజల యందు అనురాగం గలవాడు. స్త్రీల విషయంలో, ధన విషయంలో పరిశుద్ధుడు, నేర్పరి, మంచి జ్ఞాపకశక్తి గలవాడు, దేశ, కాల పరిస్థితుల నెరిగి మాట్లాడగలవాడు, భయం లేనివాడు. భాషలో నేర్పరి అయిన దూతను రాజు తన సమక్షంలో ఉంచుకోవడం మంచిది.

సేనాపతికి చతురంగ బలాలు లొంగి వుండాలి. రాజుకు కోశాగారం, రాజ్యం అధీనంలో ఉండాలి. రాజు తన ధనాన్ని, రాజ్యాన్ని తానే చూడాలి.సంధి, యుద్ధము ఈ రెండూ దూత ఆధీనంలో ఉంటాయి. దూతవల్ల సంధి జరగవచ్చు. యుద్ధం జరగవచ్చు. కాబట్టి దూత నేర్పరి అయి ఉండాలి.

దూత మిత్రులను శత్రువులను చేయగలడు. శత్రువులను మిత్రులను చేయ గలడు. కాబట్టి సంధి, కలహము అతని ఆధీనాలు.

దూత శత్రు రాజుల వద్దకు మారువేషంలో వెళ్ళి శత్రువుల మనసులోని విషయాలను, ప్రవర్తనలను తెలుసుకోవాలి. శత్రురాజుల మనసులో విషయాలను చక్కగా తెలుసుకుంటూ, తనకు ఏ విధమైన అపాయం సంభవించని విధంగా నడుచుకోవాలి.

రాళ్ళతోగాని, ఇటుకలతో గాని ఎక్కువ వెడల్పు, పన్నెండు బారల ఎత్తు కలిగి యుద్ధ సమయంలోపైనే తిరగ దగినంత వైశాల్యం గల ప్రాకారంతో చుట్ట బడిన భూదుర్గము, చుట్టూ లోతు నీటితో కూడిన జల దుర్గము, వెలుపల చుట్టూతా యోజన దూరంలో చెట్లతో చుట్టబడిన వృక్ష దుర్గము, చతురంగ బలాలతో కూడిన సేనలతో కాపాడబడే మనుష్య దుర్గము,నలువైపులా కొండలతో చుట్టబడి,లోపలికి పోను వీలుగాక, సన్నని ఇరుకు దారితో కూడి లోపలనే నదులు, సెలయేళ్ళు కలిగి బహు ధాన్య సమృద్ధితో కూడిన గిరి దుర్గము —వీటిలో ఏదైనా ఒక దాని మధ్య రాజు తన పురాన్ని నిర్మించాలి.

ఈ దుర్గాలన్నిటిలో అన్ని విధాలా గిరి దుర్గమే శ్రేష్ఠమైనది కాబట్టి సర్వ ప్రయత్నాలతో గిరి దుర్గాన్ని ఆశ్రయించాలి.

ఈ దుర్గాలలో మరు దుర్గమును మృగాలును, మహీ దుర్గాన్ని ఎలుకలు, జల దుర్గాన్ని మొసళ్ళ,వృక్ష దుర్గాన్ని వానరములు, నృదుర్గమును మనుషులు, గిరి దుర్గమును దేవతలు ఆశ్రయించి ఉంటారు.

గిరి దుర్గాలలో ఉన్న రాజులను శత్రువులు ఓడించలేరు. దుర్గం యొక్క ప్రాకారంపై ఉన్న ఒక్క విలుకాడు నూరుగురు శత్రువులను చంపగలడు. నూరు

గురు విలుకాండ్రు పదివేల మంది శత్రువులను చంపగలడు కాబట్టి దుర్గం రాజుకు ముఖ్యం.

ఆ దుర్గములో యుద్ధ సామగ్రి, ధనం, ధాన్యం, వాహనాలు, బ్రాహ్మణులు, శిల్పులు, యంత్రాలు ఉండి, నీటికి కొదువ లేకుండా ఉండాలి.

ఆ దుర్గం మధ్యలో వేరువేరుగా స్త్రీ గృహము, దేవతా గృహము, ఆయుధ గృహం, వంటశాల మొదలైనవి విశాలంగా కట్టాలి చక్కని సున్నపు పూతతో పరి శుభ్రమై, చుట్టూ అగడ్త, ప్రాకారాలు గలదై, వివిధ ఋతువులలో పూవులు పూచే ఫలాలనిచ్చే వృక్షాలు గలదై, చుట్టూ చెట్లు గలిగిన నీటి వసతి బాగా ఉన్న రాజ గృహాన్ని నిర్మించాలి.

రాజు అథర్వణ విధి ప్రకారం పురోహితుని సేవించాలి. యజ్ఞాది కర్మలు చేయడానికి ఋత్విజులను నియమించాలి. రాజు మంచి దక్షిణలిస్తూ, పలు విధాల యజ్ఞాలు చేయించాలి. బ్రాహ్మణులు అనుభవించడానికి గృహాలు, భూమి, శయ్య, బంగారు, వెండి ఆభరణాలు ఇవ్వాలి.

రాజు తన మంత్రులను నియమించి సంవత్సరానికి రావలసిన పన్నులను వసూలు చేయించాలి. శాస్త్ర ప్రకారం ఇతరుల నుంచి పన్నులు వసూలు చేయించాలి. రాజు దేశ ప్రజల యందు తండ్రి వలె వాత్సల్యం కలిగి ఉండాలి.

ఏనుగులు, గుర్రాలు, రథాలు, కాల్బలము మొదలయిన వాటిపై విచారణ చేసే అధికారులుగా ఆయా విషయాలు తెలిసిన వారిని పలువురిని నియమించాలి. వాళ్ళు ఆయా ప్రదేశాలలో చక్కగా పని చేస్తున్నారా లేదా అని అక్కడి జనులను అడిగి తెలుసుకుంటారు.

గురు కులంలో వేదాధ్యయనం పూర్తిచేసి తిరిగి వచ్చిన, వివాహార్థులయిన బ్రాహ్మణులకు ధనధాన్యాలిచ్చి, శాస్త్ర ప్రకారం పూజించాలి. ఇలా బ్రాహ్మణుల కిచ్చిన ధన ధాన్యాలు రాజులకు నిధి వలె తరగనివై ఎల్లప్పుడూ రాజులకు మేలు కాపిస్తాయి.

రాజు బ్రాహ్మణుని కిచ్చిన ధనాన్ని దొంగలు అపహరించరు. శత్రువులు దోచుకోలేరు. అది ఎంతకీ తరగదు. కాబట్టి రాజు ఎప్పటికీ నశించని ధన ధాన్య దాన రూపమయిన నిధిని బ్రాహ్మణుల కివ్వాలి. అందే రాజు తనకు గల ధన ధాన్యా లను బ్రాహ్మణులకు దానము చేయాలి.

బ్రాహ్మణేతరునికి ఇచ్చిన దానం కంటే బ్రాహ్మణునికి ఇచ్చిన దానం ఎక్కువ ఫలం ఇస్తుంది. బ్రాహ్మణునికి ఇచ్చిన దానం శాస్త్రంలో చెప్పిన దానికంటే

రెండింతలు ఫలం గలది. వేదాధ్యయనం చేసే బ్రాహ్మణుడికి ఇచ్చిన దానం లక్ష గుణముల ఫలం గలది. నాలుగు వేదాలను పఠించిన బ్రాహ్మణుడికి ఇచ్చిన దానం తుది లేని పుణ్య ఫలం ఇస్తుంది.

గ్రహీత అయిన బ్రాహ్మణుని విద్య, తపస్సు, జీవికను బట్టి, దాతకుగల శ్రద్ధను బట్టి దానం పరలోకంలో ఫలాన్నొసగుతుంది.

రాజును తనకు సమానుడైనవాడు గాని, అధికుడైన వాడుగాని, నీచుడయిన వాడుగాని యుద్ధానికి పిలిస్తే క్షత్రియ ధర్మాన్ని అనుసరించి భయపడక యుద్ధానికి పోవాలి. భయంతో అక్కడ నుంచి వెనక్కు మళ్ళరాదు.

ఎందుకంటే యుద్ధాల నుంచి వెనక్కు మళ్ళక పోవడం, ప్రజలను పరిపాలించడం, బ్రాహ్మణులకు శుశ్రూష చేయడం రాజులకు మంచిది.

రాజులు యుద్ధంలో ఒకరి నొకరు చంపాలనుకొని తమ శక్తి కొద్దీ యుద్ధం చేస్తూ, యుద్ధం నుంచి పారిపోక అక్కడే చనిపోతే స్వర్గం చేరతారు.

యుద్ధంలో పైకి కట్టెవలె నుండి లోపల వాడి గల ఆయుధాలతో శత్రువును చంపకూడదు. కర్ణములు గల ఆయుధాలతో, విషపు పూత పూసిన ఆయుధాలతో నిప్పులో గాల్చిన బాణాలతో శత్రువును చంపకూడదు.

తాను రథంపై ఉండగా రథం విడిచి నేలపై నిలిచిన శత్రువును చంపకూడదు. శరణు వేడుకున్నవాడిని, తల విరబోసుకున్న వాడిని, కూర్చున్నవాడిని, నేను నీ వాడినని శరణు కోరిన వాడిని చంపకూడదు.

నిద్రపోయేవాడిని, యుద్ధప్రయత్నం లేనివాడిని, దెసమొల వాడిని, ఆయుధాలు లేని వాడిని, తనతో యుద్ధము చేయని వాడిని, యుద్ధమును చూసే వాడిని, ఇతరులతో యుద్ధము చేస్తున్నవాడిని చంపకూడదు.

ఆయుధాలు విరిగి పోయినవాడిని, దెబ్బతిన్నవాడిని, భయపడిన వాడిని, వెనుకకు మళ్ళిన వాడిని క్షత్రియ ధర్మాల ప్రకారం చంపకూడదు.

ఎవడైనా యుద్ధంలో శత్రువుకు భయపడి వెనక్కు తిరిగి పరుగెడుతూ శత్రువు చేతిలో చనిపోతే, చంపినతడు తనను పోషించు రాజు యొక్క పాపమునంతటినీ పొందుతాడు.

యుద్ధంలో జయించిన వాడు ఓడిన వాడికి గల రథాలు, ఏనుగులు, గుర్రాలు, గొడుగులు, ధనము, ధాన్యం, పశువులు, స్త్రీలు, సకల ద్రవ్యములు, వెండి, బంగారం వీటినన్నింటినీ తీసుకుంటాడు.

యుద్ధములో జయించిన వస్తు సంపదలను యుద్ధంలో పాల్గొన్న వీరుల బలశక్తులకు తగినట్లుగా బహుమతులుగా పంచిపెట్టాలి.

రాజు తనకు దొరకని దానిని సంపాదించ కోరాలి. దొరికిన దానిని సంర క్షించుకోవాలి. రక్షించుకున్న దానిని వృద్ధి చేయాలి. అలా వృద్ధి అయిన దానిని కొంత యోగ్యులకు దానం చెయ్యాలి.

ఈ నాలుగు విధాలైనవి పురుషార్థానికి ఫలాలని తెలుసుకుని, ప్రతి దినం జాగ్రత్తగా ఈ నాలుగు విధాలయిన కార్యాలను చేస్తూ ఉండాలి.

రాజు ఎప్పుడూ దండధారియై చతురంగ బలాలను సిద్ధంగా ఉంచుకొని తన పరాక్రమాన్ని తెలియజేస్తూ ఉండాలి. ఎప్పుడూ తన రహస్యాలను బయటపడ నీయక, శత్రువుల రహస్యాలను తెలుసుకుంటూ ఉండాలి.

రాజు తన మంత్రుల వద్ద మోసపు ప్రవర్తనతో ఉండకూడదు. అందరికీ నమ్మదగిన వాడుగా ఉండాలి. ధర్మ సంరక్షణకు వారితో వాస్తవ మార్గంలో నడుచు కోవాలి. తన ఆలోచనలను బయటకు రానివ్వకుండా వేగుల ద్వారా ఇతరులు చేస్తున్న ప్రయత్నాలను ఎప్పటికప్పుడు తెలుసుకుంటూ ఉండాలి.

రాజు తన తప్పులను, లోపాలను ఇతరులకు తెలియనీయకూడదు. తన వివరాలను ఇతరులకు తెలియకుండా జాగ్రత్త వహించాలి.

నీటిలో ఉన్న కొంగ ఎప్పుడూ ఎలా చేపలను పట్టాలని చూస్తుందో అలాగే రాజు ఎప్పుడూ శత్రురాజుల సంపదలు తనకు వచ్చే మార్గాల గురించి ఆలోచిస్తూ ఉండాలి. పశువుల కాపరి ఆవులను కాస్తున్నప్పుడు అతన్ని ఏమార్చి తోడేలు పశు వును అపహరించే విధంగా శత్రువు బలమైన దుర్గంలో ఉన్నా, అతన్ని దెబ్బతీయ డానికి ప్రయత్నిస్తూ ఉండాలి.

సామ దాన భేద దండోపాయాలలో సామమున ప్రయాస, ధనవ్యయము, సైన్య నాశము మొదలయిన దోషాలు ఉండవు. దండమున అవి ఉంటాయి. కాని కార్యసిద్ధి ఉంటుంది. కాబట్టి విద్వాంసులు రాజ్యాభివృద్ధి కోసం సామ, దండములు ప్రశస్తమైనవని అంటారు.

రైతు పొలంలో వరి, కలుపు ఉన్నా కలుపు పీకి వరిని కాపాడే విధంగా రాజు దుష్టులను చంపి, సజ్జనులను కాపాడాలి.

రాజు రెండో, మూడో లేక అయిదో ఊళ్ళకు నడుమ ఒక గుంపు కావలి వాళ్ళను నియమించి సత్యపరులయిన కొందరిని వారికి విచారణ కర్తలుగా ఏర్పరచి అలాగే నూరేసి గ్రామాలకు ఒక విచారణాధికారిని నియమించి, ఆ విధంగా రాజ్యాన్ని వృద్ధి చేయాలి.

మొదట ఒక్కో గ్రామానికి ఒక్కో అధిపతిని నియమించాలి. అలాంటి పది గ్రామాలకు మరో అధిపతిని, ఇరవై గ్రామాలకు ఒక అధిపతిని, అలాంటి నూరు

గ్రామాలకు మరో అధిపతిని వారిపై వేయి గ్రామాలకు ఒక విచారణాధికారిని నియమించాలి.

గ్రామాధికారి తన గ్రామంలో జరిగే నేరాలను తాను నింపాదిగా విచారించి తెలుసుకుని ఆ నేరాలను దశ గ్రామాధికారికి తెలియజేయాలి. దశ గ్రామాధికారి తాను విచారించి ఇరవై గ్రామాల అధికారికి తెలియజేయాలి. అలాగే ఇరవైగ్రామాల అధికారి నూరు గ్రామాల అధికారికి, శత గ్రామాధికారి సహస్ర గ్రామాధికారికి తెలియజేస్తే అతడు ఆ నేరాన్ని విచారించి క్రింది వారు విధించిన శిక్ష సక్రమమైనదా, కాదా అని విచారిస్తాడు.

గ్రామాధికారి ప్రజలు రాజుకు ఇచ్చే భరణంలోంచి కొంత తన జీవనం నిమిత్తం తీసుకొవచ్చును. పది గ్రామాల అధిపతి కొంత పొలాన్ని తన జీవనానికి అనుభవింప వచ్చును. ఇరవై గ్రామాల అధిపతి ఇందుకు అయిదు రెట్ల పొలాన్ని అనుభవింప వచ్చును. నూరు గ్రామాల అధిపతి ఒక సామాన్య గ్రామాన్ని, వేయి గ్రామాల అధిపతి ఒక సామాన్య పట్టణాన్ని అనుభవించవచ్చు.

గ్రామాధిపతి మొదలయిన వాళ్లు చెప్పిన తీర్పులు ఒకదాని కొకటి విరుద్ధముగా ఉంటే గ్రామజనులు ఆ విషయం రాజు దృష్టికి తీసుకువస్తే అలాంటి వివాదాలను రాజునకు ఇష్టుడయిన మంత్రి ద్వారా వాటిని జాగ్రత్తగా విచారించాలి.

ఒక్కో నగరంలో ఒక్కొక్క ఉన్నత స్థానంలో ఉన్న, కులం మొదలైన విషయాలలో గొప్పవాడయి, అశ్వ గజాదులతో భయంకరుడయి, చుక్కల్లో చంద్రుడిలా వెలిగే, చక్కటి కార్యనిర్వాహకుడగు వ్యక్తిని నగరాధిపతిగా నియమించాలి.

రాజ్యంలో రాజు నియమించిన రక్షణాధికారులు సాధారణంగా ఇతరుల సొమ్మును అపహరించాలనుకునే మోసగాళ్ళుగా ఉంటారు. అట్టి వారి నుంచి ప్రజలను రక్షించి ప్రజలను తన బిడ్డలతో సమానంగా చూసుకోవాలి.

సాధారణంగా పాపబుద్ధులయిన రక్షణాధికారులు వివాదాలు తీర్చుకోవడానికి తమ వద్దకు వచ్చిన వారినుంచి లంచాలు తీసుకుని వ్యవహారాలను చెడిపేస్తారు. కాబట్టి రాజు అలాంటి వారిని కనిపెట్టి వారి సర్వసంపదలను స్వాధీనం చేసుకుని వాళ్ళను రాజ్యం నుంచి తరిమికొట్టాలి.

రాజు తనకు కావలసిన పనులు చేసిపెట్టే వారిని, పనివాళ్ళ మొదలయిన వాళ్ళను, వారి యోగ్యతలను, వారి ఉత్తమ, మధ్యమ, నీచ స్థితులను అనుసరించి ప్రతి రోజూ వాళ్ళ పనికి తగ్గట్టు కూలి ఇవ్వాలి.

0 0 0 0

వర్తకుల నుంచి రాజు పన్నులు వసూలు చేసేటప్పుడు వర్తకుడు సరుకును

ఎంత వెలకు కొన్నాడు? ఎంత వెలకు అమ్మాడు? ఎంత దూరం నుంచి ఈ సరుకును తెప్పించాడు? తెప్పించేందుకు అతనికి అయ్యే ఖర్చు ఎంత? మన వల్ల ఎంత రక్షణను ఇతడు పొందుతున్నాడు? మొదలయిన విషయాలను గమనించి వర్తకుల నుంచి సరైన పన్ను వసూలు చేయాలి.

వ్యాపారి, రైతు తమ వ్యాపారం, సేద్యాల వల్ల ఎలా లాభం పొందుతారో అది గమనించి రాజ్యంలోని జనుల వద్ద నుంచి పన్నులు వసూలు చేయాలి.

జలగలు రక్తాన్ని ఎలా నెమ్మదిగా పీలుస్తాయో, దూడలు ఎలా బాధ కలిగించకుండా పాలు తాగుతాయో, తేనెటీగలు ఎలా మకరందాన్ని పీలుస్తాయో అలా రాజు ప్రజల వద్ద నుంచి వాళ్ళ మూలధనం చెడనీకుండా పన్నులను కొంచెం కొంచెంగా వసూలు చేయాలి.

పశువులలోనూ, బంగారంలోనూ రాజు యాభయ్యావ వంతు పన్నును తీసుకోవాలి. ధాన్యంలో ఆరవ వంతుగాని, ఎనిమిదవ వంతుగాని, పన్నెండవ వంతుగాని సంవత్సరానికి కొకసారి పన్నుగా తీసుకోవాలి. ఈ భేదం భూమిని బట్టి, సేద్యంలో కష్టసుఖాలు బట్టి ఉంటుంది.

మాంసం, తేనె, నెయ్యి, గంధము, ఔషధులు, రసములు, పుష్పములు, దుంపలు, వేళ్లు, పళ్ళు, ఆకులు, కూరగాయలు, గడ్డి, తోళ్ళు, వెదుళ్ళు, మట్టి పాత్రలు వీటి లాభాలలో ఆరవ వంతును పన్నుగా తీసుకోవాలి.

వేదాధ్యయన పరుడయిన బ్రాహ్మణుని నుంచి రాజు పన్ను వసూలు చేయకూడదు. దేశంలో ఉన్న ఏ బ్రాహ్మణుడూ పస్తు పడుకోకూడదు.

ఏ రాజు రాజ్యంలోని బ్రాహ్మణుడు ఆకలితో నకనకలాడుతాడో ఆ రాజు రాజ్యంలోని ప్రజలు క్షామ పీడితులై ఆకలితో చిక్కిపోతాడు.

కాబట్టి రాజు శ్రోత్రియుని శాస్త్రజ్ఞానాన్ని, వాని నడవడికను గమనించి అతనికి న్యాయం తప్పని వృత్తిని కల్పించాలి. తండ్రి కుమారుని కాపాడుకున్నట్టు రాజు బ్రాహ్మణులను కాపాడుకోవాలి.

బ్రాహ్మణులు రాజు చేత కాపాడబడుతూ, స్వధర్మం తప్పక అనుష్ఠించాలి! దానివల్ల రాజుకు ఆయుస్సు, ధనం, రాజ్యం వృద్ధి చెందుతాయి.

రాజు తన దేశంలోని కూరగాయల వంటి స్వల్ప వస్తువులను మారు బేరానికి అమ్ముకునే వాళ్ళనుంచి సంవత్సరానికి కొకసారి తక్కువ పన్ను వసూలు చేయాలి.

లోహకారులు మొదలయిన శిల్పులచేత, పిండి వంటలు చేసేవాళ్ళచేత, దేహశ్రమతో జీవించే శూద్రుల చేత నెలకొకరోజు పని చేయించుకోవాలి.

ప్రజల మీద ప్రేమతో పన్నులు వసూలు చేయక తాను నష్టపోకూడదు. ప్రజల మీద ప్రేమతో పన్నులు కట్టించుకోకపోతే రాజుకు చేటు అవుతుంది. కాబట్టి

ఆ పని చేయకూడదు. అలా అని ఎక్కువ పన్నులు విధించి ప్రజలను బాధ పెట్ట కూడదు. తాను పన్నులు వసూలు చేయకపోతే కోశాగారం తరిగిపోయి తాను నాశనము అవుతాడు. ఎక్కువ పన్నులు వసూలు చేస్తే ప్రజలు నశిస్తారు. కాబట్టి రాజు ఈ విషయంలో జాగ్రత్తగా ఉండాలి.

రాజు కార్య వ్యవహారాన్ని బట్టి కఠినంగాను, మృదువుగాను ఉండాలి. అలా సమయానుకూలంగా మృదువుగా, కఠినంగా ఉండే రాజు జనులకు సమ్మతుడై ఉంటాడు.

ఏ రాజ్యంలో దొంగలు పెట్టే బాధలను గురించి ప్రజలు రాజుకు, మంత్రులకు, తక్కిన రాజ సేవకులకు మొర పెట్టుకున్నా ప్రయోజనం లేకుండా ఉంటుందో అలాంటి రాజు బ్రతికి ఉన్నా చనిపోయిన వాడి క్రిందే లెక్క. ప్రజా సంరక్షణమే రాజులకు ముఖ్య కార్యము.

రాజు రాత్రి చివరి జామున నిద్రలేచి, కాలకృత్యాలు తీర్చుకుని, స్నాన సంధ్యాలను పూర్తి చేసి, హోమము పేర్చి, బ్రాహ్మణులను పూజించి, అలంకరించిన సభా భవనానికి రావాలి.

రాజసభకు తన దర్శనార్థం వచ్చిన ప్రజలను కలిసి, ఆ తరువాత మంత్రులతో చర్చ జరపాలి.

ఏ రాజు రహస్యాలు సామాన్య ప్రజలకు తెలియవో అట్టి రాజు కోశాగారం సమృద్ధిగా ఉంటుంది. అతను భూమండలాన్నంతా పరిపాలిస్తాడు.

రాజు మంత్రాలోచన చేసేటప్పుడు జడులు, మూగవాళ్ళు, గుడ్డివాళ్ళు, చెవిటి వాళ్ళు, చిలుకలు, గోరువంకలు మొదలయిన వాటిని, స్త్రీలు, మ్లేచ్ఛులు రోగులు, అంగహీనులు – వీళ్ళందరినీ పారద్రోలాలి.

జడులు మొదలయిన వాళ్ళ పురాతన పాపకర్మ వల్ల హీన జన్మము ఎత్తి, అధార్మికులై, అవమానితులై మంత్రాలోచనలను వెలిబుచ్చుతారు. చిలుకలు మొదలయిన పక్షులు, ముదుసలులు, స్త్రీలు చపలచిత్తలై ఆలోచనలను వెలిబుచ్చుతారు. కాబట్టి వాళ్ళను మంత్రాలోచన చేసేచోట ఉండనివ్వకూడదు.

ఇతర రాజులతో సంధి, యుద్ధము, యుద్ధయాత్ర, ముట్టడి, వేరు పరచుట, శత్రు బాధను తట్టుకోలేక శత్రువును మించిన బలవంతుడయిన రాజుని ఆశ్రయించడము ఈ ఆరు గుణాలను పరిశీలించాలి. ఏ గుణాన్ని ఆశ్రయిస్తే తనకు మేలు, శత్రువుకు కీడు జరుగుతుందో ఆ గుణాన్ని అవలంబించాలి.

ఎప్పుడు మంత్రులు మొదలయిన సకల జనులు తన పట్ల ఆత్మీయంగా ఉన్నారని తలుస్తాడో, తన చతురంగ బలాలు, బొక్కసము నిండి ఉన్నట్లు తలుచునో అప్పుడు శత్రువుల పైకి యుద్ధానికి వెళ్ళాలి.

ఎప్పుడు తాను సంతోషంగా, బలంగా ఉంటాడో, శత్రువు ఎప్పుడు దుఃఖముతో శోషించి ఉంటాడో అప్పుడు శత్రుసేన పైకి దండెత్తాలి.

ఎప్పుడు తన సైన్యం యుద్ధానికి సిద్ధంగా లేదో అప్పుడు మంచి మాటలతో, దానములతో శత్రువులను మంచి చేసుకోవాలి.

తన శత్రువు బలవంతుడని, సానుదానములకు లొంగడని రాజు ఎప్పుడు తెలుసుకుంటాడో అప్పుడు తన సేనను రెండుగా విభజించి కొంత దుర్గ సంరక్షణకు నియమించి తాను అక్కడ ఉండి, మరికొంత సైన్యాన్ని శత్రువు మీదికి పంపాలి.

తాను దుర్గంలో ఉండి కూడా తనను తాను కాపాడుకోలేననుకుంటాడో అప్పుడు వెంటనే ధార్మికుడయిన, బలవంతుడయిన రాజును ఆశ్రయించాలి. అలా ఆశ్రయించడం వల్ల ఫలితం లేదనుకుంటే అప్పుడు సంశయం లేకుండా యుద్ధము చేయాలి. యుద్ధంలో శత్రువుని జయిస్తే రాజ్యం లభిస్తుంది. చనిపోతే స్వర్గం లభిస్తుంది.

రాజు ఎంత చిన్న పని చేసే ముందయినా ఈ పని చేయడంవల్ల భవిష్యత్తులో లాభం ఏమిటి? నష్టం ఏమిటి అనే విషయాన్ని జాగ్రత్తగా విచారించాలి.

తనకు స్నేహితుడయినవాడు శత్రువు దగ్గరకు వెళ్ళి మళ్ళీ తన దగ్గరకు వస్తే అలాంటి మిత్రుని యందు, తనపై విరోధంతో శత్రువు దగ్గరకెళ్ళి అతని కొలువులో ఉండి మళ్ళీ తన కడకు వచ్చిన సేవకుడి యందు మిక్కిలి జాగ్రత్తగా ఉండాలి. ఎందుకంటే వాళ్ళిద్దరూ శత్రువులే అవుతారు.

శత్రు పురపు మార్గాన్ని దండ వ్యూహము, శకట వ్యూహము, వరాహ వ్యూహము, మకర వ్యూహము, సూచీ వ్యూహము, గరుడ వ్యూహము ఈ వ్యూహాలలో ఏదో ఒక దానిని అమలు పరిచి శత్రు పురాన్ని ముట్టడించాలి.

పది రథాలు, పది ఏనుగులు, పది గుర్రాలు, పది మంది కాలిబంటులు— వీటికి అధికారి పత్తికుడు. పది మంది పత్తికులపై అధికారి సేనాపతి. పది మంది సేనా నాయకులకు అధ్యక్షుడు బలాధ్యక్షుడు.

అన్ని దిశల్లోనూ సేనాపతి, బలాధ్యక్షులను నిలిపి ఏ దిక్కునందు భయము కలుగునని సందేహమో ఆ దిక్కునందే ముందుగా యుద్ధం చేయాలి.

ఆరుబయలు ప్రదేశంలో రథాశ్వాలతో యుద్ధం చేయాలి. నీటి ప్రదేశంలో నౌకలతోను, ఏనుగులతోను, యుద్ధం చేయాలి. చెట్లు, పొదలు వీటితో నిండిన ప్రదేశంలో విల్లు, బాణములు, కత్తులు మొదలయిన ఆయుధాలతో యుద్ధం చేయాలి.

యుద్ధ రంగంలో సైన్యాన్ని వ్యూహములుగా నిలిపి జయమున ధర్మమును, మరణమున స్వర్గమును, పరుగెత్తిన ప్రభువు పాపము, నరకము పొందుతాడని

చెప్పి వాళ్ళను యుద్ధానికి పురికొల్పాలి. శత్రువులతో యుద్ధం చేసే యోధుల వ్యక్తిత్వాన్ని చక్కగా పరీక్షించాలి.

రాజు దుర్గంలో ఉన్నాడా, లేదా అనే విషయాన్ని గమనించి యుద్ధం చెయ్యాలి. అతని రాజ్యంలోని గడ్డి, ఆహారం, నీరు,వంటచెరకు వీటన్నింటిలో విష పదార్థాలు కలిపి వారికి ఉపయోగ పడకుండా చెడగొట్టాలి.

వారికి ఉపయోగపడే చెరువులను, గుంటలను తెగ గొట్టాలి. అగడ్తలను పూడ్చాలి. రాత్రులందు భేరి మ్రోగించి, భయపెట్టాలి.

ప్రీతి పూర్వకమైన మాటలను చెప్పడం మొదలయిన సామము, గుర్రాలు, ఏనుగులు, బంగారం మొదలయిన వాని నిచ్చి దానం, రాజ్యాపేక్షగల అతని సేవకులను వేరు పరచడం మొదలయిన భేదం వీటితో శత్రువులను జయింప జూడాలి. అంతేగాని ఎప్పుడూ యుద్ధంతోనే శత్రువుని లొంగ దీయాలని చూడకూడదు.

పోరాడేటప్పుడు జయాపజయాలు ఖచ్చితంగా నిర్ణయించలేము. కాబట్టి ఎప్పుడూ యుద్ధంలోనే శత్రువుని లోబరచు కోవాలని చూడకూడదు.

జోస్యుల వల్ల, ధన గ్రహచార స్థితి తెలుసుకుని అది మంచి స్థితిలో ఉన్నప్పుడు మాత్రమే రాజు యుద్ధరంగానికి వెళ్ళాలి.

శత్రు రాజ్యములను జయించిన రాజు దేవతలను, బ్రాహ్మణులను, పుణ్యాత్ములను పూజించి ఆ దేశ వాసులకు పరిహారాలు ఇచ్చి ఎవరెవరు తమ రాజుయందు భక్తితో మాతో యుద్ధం చేశారో వారికి అభయం ఇస్తున్నాము. నిర్భయంగా తమ తమ పనులు కొనసాగించు కోవచ్చు అని దేశంలో చాటింపు వేయించాలి.

ఆ శత్రురాజు మంత్రులు మొదలయిన వారి అభిప్రాయాలను తెలుసుకుని, ఆ రాజ్యంలో ఆ శత్రురాజు వంశంలోని ఒకతన్ని అభిషేకించి అతనికి, అతని మంత్రులకు వాళ్ళు ఏ ఏ పనులు చెయ్యాలో, ఏ ఏ పనులు చేయకూడదో చెప్పి వాళ్ళను నియమించాలి.

శాస్త్రములలో చెప్పినవి, ఆ దేశపు రాజులు పాటించే ఆచారములు ఏమైనా ఉంటే వాటిని తను కూడా ప్రమాణంగా తీసుకోవాలి.

మంచి ఆరోగ్యాన్నిచ్చేది, ఏటి నీటి పారుదలతో పండేది, ఎప్పుడూ పచ్చిక ఉన్నందున పశువుల పెంపుకు అనువైనది అయిన రాజ్యాన్ని తన ప్రాణ సంరక్షణకు వేరే గతి లేనప్పుడు ఆలోచించక విడిచి పెట్టాలి.

ధనాన్ని కాపాడాలి, ధనం పోయినా అంతఃపుర స్త్రీలను కాపాడుకోవాలి. ధనము, అంతఃపుర స్త్రీలు మొదలయిన వారు పోయినా తనను తాను కాపాడుకోవాలి.

  

రాజు ఎప్పుడు వేరే కార్యాలలో కలవరంతో ఉన్నప్పుడు గాని, తానుగా వ్యవహారం తీర్చకాలనప్పుడుగాని, వ్యవహారాలను తీర్చే నిమిత్తం విద్వాంసుడైన బ్రాహ్మణుని నియమించాలి.

ఆ బ్రాహ్మణుడు ముగ్గురు ఇతర సభ్యులతో కూడుకొని సభా భవనాన్ని ప్రవేశించి అక్కడ కూర్చుని గాని నిలబడి గాని రాజు విచారించ వలసిన కార్యాలను విచారించాలి. కాని అటూ, ఇటూ పచార్లు చేస్తూ విచారించకూడదు.

ఏ సభలో మూడు వేదాలను ఎరిగిన బ్రాహ్మణులు ముగ్గురు, రాజు చేత నిర్ణయింపబడిన విద్వాంసుడయిన బ్రాహ్మణుడు ఉంటారో--అట్టి నలుగురు గల సభ బ్రహ్మసభతో సాటి అని అంటారు.

ఏ సభలో సభ్యులు చూస్తుండగానే ధర్మం అధర్మం చేత, సత్యం అసత్యం చేత ఓడిపోతాయో అచ్చట నున్న సభ్యులకు ఆ పాపం చుట్టుకుంటుంది.

పదునెనిమిది విధాలైన వివాదాలను వేరువేరుగా ఒక్కొక్కటి విచారించాలి.

ఆ పదునెనిమిది విధాలైన వివాదాలు ఏవంటే— అప్పు తీసుకోవడం, ధనం దాచి పెట్టడం, యజమాని కానివాడు విక్రయించడం, ఉమ్మడిగా వ్యాపారం మొదలయినవి చేయడం, ఇచ్చినది తీసుకోవడం, కూలి వానికి కూలి ఇవ్వక పోవడం, ఒప్పందం మీరడం, కొనుగోలు అమ్మకాలలో తగవులు, యజమానికి పశువులు కాచే వాడికి వివాదం తిట్టడం, కొట్టడం, మోసంతో ధనాన్ని అపహరించడం, ధనం దోచుకోవడం, స్త్రీ పరపురుషుని పొందడం, స్త్రీ పురుషుల వివాదం, పెద్దల ఆస్తి పంపకం, జూదం, కోళ్ళపందెం అనే ఈ పదునెనిమిది విషయాలు వ్యవహారానికి సంబంధించినవి.

ధర్మాన్ని మనం రక్షిస్తే అది మనల్ని రక్షిస్తుంది. ధర్మాన్ని మనం పాడు చేస్తే అది మనల్ని పాడు చేస్తుంది. కాబట్టి ధర్మాన్ని నశింప జేయకూడదు.

నాలుగు పాదాలు గల అధర్మంలో ఒక్క భాగం అన్యాయం చేసేవాడిని, మరో భాగం సాక్షిని, మరో భాగం సభ్యులందరిని, మరో భాగం రాజును పొందును.

ఏ సభలో నేరస్తులు కనిపెట్టి దండింప బడతారో ఆ సభలో రాజునకు పాపం అంటదు. సభ్యులకు పాపం అంటదు. పాపం చేసిన వాడికే చేరుతుంది.

ధర్మశాస్త్రాలు తెలియక పోయినా కేవలం బ్రాహ్మణుడు అయినందువల్లనే రాజు వ్యవహార పరిశీలకుడై ఉండాలి. అలా కాకపోతే యోగ్యుడైన క్షత్రియుడైనా వైశ్యుడయినా ధర్మ ప్రవక్తగా ఉండవచ్చు. కాని శూద్రుడు మాత్రం అలాంటి ధర్మ ప్రవక్తగా ఉండకూడదు. కాబట్టి రాజు శూద్రుని ధర్మ ప్రవక్తగా నియమించ కూడదు.

ఏ రాజురు శూద్రుడు ధర్మ నివేచనము చేస్తాడో, అట్టి రాజు చూస్తుండగానే అతని రాజ్యం ఊబిలో దిగబడిన ఆవు వలే నశిస్తుంది.

ఎవడి రాజ్యం శూద్రులతో నిండి, దేవుడు లేడని వాదించే నాస్తికులతో కూడి వుంటుందో, బ్రాహ్మణులు లేనిదై వుంటుందో, ఆ రాజు రాజ్యం కరువు కాటకాలతో, రోగాలతో త్వరగా నశిస్తుంది.

ఆకారముల చేత, మనోభిప్రాయాల చేత, కాలి తొట్రుపాటు మొదలయిన వాటి చేత, చేష్టలు, మాటలు, కంటి చూపు, ముఖ వికారము—వీటిచేత మనోభావం నిర్ణయింప బడుతుంది. గాబట్టి వీటన్నిటినీ గమనించాలి.

ఎక్కువ మంది వ్యవహారులున్నప్పుడు బ్రాహ్మణాది వర్ణ క్రమానుసారముగ వ్యవహారాలను విచారించాలి.

దిక్కులేని ఒక బాలుని సొత్తును బంధువులు అన్యాయంగా అపహరించాలనుకున్నప్పుడు ఆ సొత్తును పోనీయక ఆ బాలుడు గురుకులంలో చదువు పూర్తిచేసుకుని వచ్చేంత వరకు లేక బాల్యము నుంచి యవ్వనదశ వచ్చేవరకు వాని సొత్తును కాపాడాలి.

అలాగే గొడ్రాళ్ళు, భర్తలేని స్త్రీలు, వంశహీనలగు స్త్రీలు, పతివ్రతలు, విధవలు, రోగిణులు వీళ్ళ సొత్తును కూడా బాలుర సొత్తువలే కాపాడాలి.

వారు జీవించి వున్నప్పుడు వారి సొత్తును బంధువులు తీసుకుంటే, ధర్మపరుడైన రాజు వారిని దొంగలను దండించినట్టు దండించాలి.

యజమాని లేని సొత్తుల విషయంలో రాజు ఆ సొత్తుకు యజమాని వున్నారా? అని నగరంలో చాటింపు వేయించి, ప్రకటనను మూడు సంవత్సరాలపాటు రాజద్వారమున ప్రకటించి, ఆలోగా వారసుడు వస్తే ఆ సొత్తును అతనికి అప్పగించాలి. రాకపోతే తన సంపదలో కలుపుకోవచ్చు.

ధనము లేదా సంపద నాది ఎవరైనా వస్తే దానికి సంబంధించిన అన్ని వివరాలను అతన్ని అడిగి, అతను చెప్పిన సమాధానాలు సరిపోతే అతనికి ఆ ధనాన్ని అప్పగించాలి.

ఆ ధనం అతనిది కాదని తెలిస్తే ఆ మోసగాడికి తగిన అపరాధం విధించాలి.

ఆ సొత్తు అతనిదే అని తెలిసి దాన్ని అతనికి అప్పగించవలసి వస్తే రాజు దానిని అంతకాలం కాపాడినందుకు దానిలో ఆరవవంతుగాని, పదవవంతుగాని, పన్నెండవవంతుగాని తీసుకుని మిగిలిన దానిని స్వంతదారునికి అప్పగించాలి.

ఎవరిదైనా ధనాన్ని దొంగలెత్తుకుపోతూ రాజపురుషులకు దొరికితే అట్టి ధనాన్ని కోశాగారాధిపతి వశంలోవుంచి కాపాడాలి. ఆ ధనాన్నిఅపహరించిన దొంగలు

దొరికితే వారిని ఏనుగులతో తొక్కించి చంపాలి.

ఎవరికైనా నిధి దొరికితే రాజు ఆ నిధినుంచి ఆరవ భాగమునుగాని, పన్నెండవ భాగమునుగాని తీసుకుని మిగిలిన దానిని నిధి యజమానికి ఇవ్వాలి.

ఎవడు తనది కాని దానిని తనదని చెబుతాడో అట్టివాని సొంత ధనం నుంచి ఎనిమిదవ వంతు జరిమానాగా తీసుకోవాలి.

విద్వాంసుడైన బ్రాహ్మణుడు తనది కాని నిధిని కనుగొన్నా రాజుకు ఏమీ భాగం ఇవ్వనవసరం లేదు. నిధినంతా తానే తీసుకోవచ్చును.

వారసులు లేని నిధిని రాజే స్వయంగా కనుక్కుంటే, ఆ నిధిలో సగభాగం బ్రాహ్మణులకిచ్చి తక్కిన సగభాగాన్ని తన కోశాగారానికి చేర్పించాలి.

దొంగలు దొంగిలించిన సొత్తును రాజు కనిపెట్టి దానిని వారివద్ద నుంచి తీసుకుని ఆ సొత్తుగలవారికి ఇవ్వాలి. అలా ఇవ్వకుండా రాజు తీసుకుంటే ఆ దొంగ యొక్క పాపాన్ని పొందుతాడు.

* * *

అప్పు ఇచ్చినవాడు అప్పు తీసుకున్న వాడిపై రాజు ఎదుట ఫిర్యాదు చేస్తే సాక్ష్యాలనుబట్టి అప్పు తీసుకున్న వాడి నుంచి ధనాన్ని రాబట్టి అప్పు ఇచ్చిన వాడికి ఇప్పించాలి.

అప్పు తీసుకున్నవాడి బంధువులతో అతనికి చెప్పించి అప్పు తీర్పించాలి లేదా మంచి మాటలు చెప్పి అప్పు తీర్చేలా చెయ్యాలి. లేదా అప్పు తీసుకున్నవాడి పశువులను, భార్యాబిడ్డలను అడ్డగించి లేదా నిర్బంధించి అప్పు తీరిస్తేగాని విడిచిపెట్టమని చెప్పాలి. లేదా అప్పుతీసుకున్నవాడిని బలవంతంగా పట్టితెచ్చికొట్టి ఋణదాతకు ధనం ఇప్పించాలి.

అప్పు ఇచ్చినవాడు తీసుకున్నవాడిని ఏ విధంగా నిర్బంధించి పీడించినా రాజు తనతో చెప్పకుండా ఎందుకు నిర్బంధించావని ఋణదాతను విచారించకూడదు.

అప్పు తీసుకుని తీసుకోలేదని వాదిస్తే సాక్ష్యాధారాలను బట్టి నిర్ధారించి ఋణదాతకు డబ్బు ఇప్పించడమే గాకుండా, అబద్ధం చెప్పినందుకు తగిన విధంగా దండించాలి.

సాక్షులుగా అందరూ వుండతగరు. భార్యాబిడ్డలు గలవాళ్ళు, ఆ రాజ్య క్షత్రియులు, వైశ్యులు, ఉత్తమ వర్ణాలవారు పిలిస్తే వచ్చే శూద్రులు సాక్ష్యం చెప్పదగినవారు, ఆపదలందు తప్ప తక్కిన వేళల్లో మరెవరూ సాక్షులుగా వుండతగరు.

అన్ని వర్ణాలలో ఎవరు నిజంగా తనకు తెలిసినవారో, లాభము లేనివారో అట్టివారే సాక్షులుగా ఉండదగినవారు. తక్కినవాళ్ళను సాక్షులుగా తీసుకోకూడదు.

అర్థసంబంధము గలవారు, మిత్రులు, సహాయులు, విరోధులు, తప్పుడు

సాక్ష్యం చెప్పేవాళ్ళు, రోగపీడితులు, మహాపాతకాలు చేసినవాళ్ళు సాక్షులుగా ఉండ తగరు.

రాజును సాక్షిగా తీసుకోరాదు. వేదాధ్యయనపరుని, బ్రహ్మచారిని, సన్యాసిని సాక్షులుగా తీసుకోకూడదు. వీరు తమ పనుల్లో ఆసక్తులై వుంటారు కాబట్టి వీళ్ళను సాక్షులుగా తీసుకోకూడదు.

మద్యపాన మత్తులో వుండేవాడిని, పిచ్చివాడిని, కామార్తుని, దొంగను, ముసలివాణ్ని, బాలుని, ఒంటరివాణ్ని, చండాలుణ్ని, మతిచాంచల్యం గలవాడిని సాక్షులుగా తీసుకోకూడదు.

స్త్రీలకు ఋణ దానాది విషయాలలో స్త్రీలు సాక్షులుగా వుండవచ్చు. బ్రాహ్మణులకు సాటి బ్రాహ్మణులు సాక్షులుగా వుండవచ్చు. శూద్రులకు శూద్రులు సాక్షులుగా వుండవచ్చు.

ఏదైనా దొంగతనం జరిగినప్పుడు, ప్రమాదం జరిగినప్పుడు చూసినవాడే సాక్షి. ఎవరైనా సాక్ష్యం చెప్పవచ్చు.

గృహదహనం, దొంగతనం, పరస్త్రీలను చెరపట్టడం, తిట్టుకోవడం, కొట్టుకోవడం మొదలయిన సందర్భాలలో సాక్షులు ఎవరనేది పట్టించుకోనక్కరలేదు.

సాక్షులు వేరువేరుగా చెప్పినప్పుడు ఎక్కువమంది చెప్పినదానిని తీసుకోవాలి. సాక్షులు సమంగా వున్నప్పుడు గుణవంతులు చెప్పిన దానిని తీసుకోవాలి. గుణవంతులు భిన్నాభిప్రాయాలు చెప్పినప్పుడు బ్రాహ్మణోత్తములు చెప్పిన దానిని స్వీకరించాలి.

సాక్షి అబద్ధం చెబితే నరకం చేరుతాడు. లోభాది గుణాలులేని సాక్షి ఒకడైనా చాలు. స్త్రీలు చపలబుద్ధిగలవారు గనుక ఎక్కువమంది సాక్షులుగా వున్నా చాలరు.

భూమి, నింగి, నీరు, జీవాత్మ, సూర్యచంద్రులు,అగ్ని, యముడు, వాయువు, రాత్రి, పగలు, ప్రాతః సాయంసంధ్యలు, ధర్మము–ఇవి సకల ప్రాణుల శుభాశుభ కర్మలకు సాక్షులు. ధర్మపరీక్ష చేసే వ్యక్తి తాను పరిశుద్ధుడై దేవబ్రాహ్మణుల సమక్షంలో సాక్షులను తూర్పుముఖంగా గాని, ఉత్తరముఖంగా గాని నిలబెట్టి ప్రొద్దుటి పూటనే సాక్ష్యాన్ని విచారించాలి.

అలా నిలబెట్టిన సాక్షులలో బ్రాహ్మణుని "చెప్పుము" అని, క్షత్రియుని "సత్యము పలుకు"మని, వైశ్యుని "అబద్ధాలు చెబితే ఆవులు, బంగారం వీటిని దొంగిలించిన పాపం చుట్టుకుంటుందని", శూద్రుని అబద్ధాలాడితే సకల పాతకాలు సంభవిస్తాయని" చెప్పి సాక్ష్యం చెప్పించాలి.

బ్రహ్మహత్య చేసిన వాడికి, స్త్రీ, బాల హత్య చేసిన వాడికి, మిత్రద్రోహికి, కృతఘ్నుడికి ఏ పాపాలు చుట్టుకుంటాయో ఆ పాపాలు తప్పుడు సాక్ష్యం చెప్పే వాడికి చుట్టుకుంటాయి.

సాక్ష్యం చెప్పిన వాడికి ఏడురోజుల లోపల రోగంవస్తే, ఇళ్ళు మొదలయినవి

తగలబడితే, బంధువులెవరైనా చనిపోతే తప్పుడు సాక్ష్యం చెప్పడం వల్లనే అతనికి అలా జరిగిందని భావించి అతనికి కొంత జరిమానా విధించాలి. ఇతను వాదివైపు సాక్ష్యం చెబితే ప్రతివాదికి అనుకూలంగా మళ్ళీ తీర్పు చెప్పాలి.

మండుతున్న అగ్ని ఎవరిని దహింపదో, నీరు ఎవనిని ముంపదో, ఎక్కువ నొప్పిని ఎవడు పొందడో, అతడు చేసిన ప్రమాణం పరిశుద్ధమైనదని గ్రహించాలి.

శూద్రాదులకు రెండు చేతులలో ఏడు రావి ఆకులను వుంచి వాటిపై ఎర్రగా కాలిన ఇనపగుండును వుంచి ఈ పని నేను చేయలేదని ప్రమాణం చేయించాలి. లేక పోతే జలగలు లేని నీటిలో అతన్ని ముంచాలి.ఇతని భార్యాపుత్రుల తలల మీద చేయి పెట్టించి ప్రమాణం చేయమని చెప్పాలి.

లోభం వల్లనో మోహం వల్లనో, భీతి వల్లనో, మైత్రి వల్లనో, కోరికవల్లనో, ఆగ్రహము వల్లనో, అజ్ఞానము వల్లనో, పరాకు వల్లనో జనం తప్పుడు సాక్ష్యం చెబుతారు.

క్షత్రియ, వైశ్య,శూద్రులు తప్పుడు సాక్ష్యం చెబితే ఏ గుణంవల్ల తప్పుడు సాక్ష్యం చెప్పాడో ఆ గుణానికి తగిన దండన విధించాలి. బ్రాహ్మణుడు తప్పుడు సాక్ష్యం చెబితే బ్రాహ్మణునికి మాత్రం దేహానికి ఎలాంటి గాయం కలిగించకుండా అతన్ని దేశంనుంచి వెళ్ళగొట్టాలి.

వడ్డీతో జీవనం చేయువాడు బ్రాహ్మణుని వద్దనుంచి నూటికి నెలకు రెండు, క్షత్రియుని వద్దనుంచి నూటికి మూడు, వైశ్యుని వద్దనుంచి నూటికి నాలుగు, శూద్రుని వద్ధనుంచి నూటికి ఐదు వడ్డీ తీసుకోవాలి.

భూమి, గోవులు అడుమాన ముంచినప్పుడు వడ్డీ తీసుకోకూడదు. కుదువ పెట్టిన సొమ్ములను అనుభవించకూడదు. అలా అనుభవించేవాడు వడ్డీ తీసుకో కూడదు. తను వాడుకునేటప్పుడు ఆ వస్తువు చెడిపోతే ఆ వస్తువు విలువ సొంత దారునికి ఇవ్వాలి. అలా ఇవ్వకపోతే కుదువ దొంగ అవుతాడు.

ఏదైనా ఒక వస్తువు ఇతరులు అనుభవిస్తూ వుంటే సొంతదారుడు చూస్తూ కూడా అడగక పోతే అలా పది సంవత్సరాలు గడిస్తే ఆ వస్తువుపై స్వంతదారునికి స్వాతంత్ర్యం తొలిగిపోతుంది. అది అనుభవించే వాడిదే అవుతుంది.

కుదువ పెట్టిన సొమ్ము, బాలుర సొత్తు, ఇంత అని లెక్కపెట్టి పెట్టిన ధనం, పనికత్తెలు మొదలయిన స్త్రీలు, రాజద్రవ్యము, బ్రాహ్మణద్రవ్యము అను భవం గలవానికి సొంతము కావు. ఎన్నిరోజులకయినా అవి మొదటి వానివే.

పందెం కాసిన ధనము, జూదం, మద్యం వీటి నిమిత్తం ఇవ్వాల్సిన ధనం, సుంకము,ఓలి వీటి నిమిత్తం ఇవ్వవలసిన ధనం తండ్రి చనిపోయిన తర్వాత కుమా రుడు ఇవ్వనవసరంలేదు.

వ్యవహార సంబంధమైన ధర్మం కంటే, వాడుక కంటే విరుద్ధముగా ఏదైనా పత్రం వ్రాసుకున్నా అది చెల్లదు. దానిలో వ్రాసుకున్న దానిని నెరవేర్చ నక్కర లేదు.

ఉమ్మడి కుటుంబ యజమాని ఋణం తీసుకుని, చెల్లించక ముందే చనిపోతే అతని దాయాదులు ఆ ఋణం చెల్లించాలి.

యజమాని స్వదేశంలో వున్నా, పరదేశంలో వున్నా అతని కుటుంబ పోషణ నిమిత్తం అతని సేవకుడు చేసే ఋణాన్ని యజమానే తీర్చాలి.

బలవంతంగా ఇచ్చిన ఋణం, బలవంతంగా వ్రాయించుకున్న పత్రం చెల్లని విగా భావించాలి.

రాజు ధనము లేనివాడయినా గ్రహింప తగని సంపదను గ్రహించకూడదు. రాజు ధనికుడైనా గ్రహింప దగిన సంపద స్వల్పమైనా వదలకూడదు.

రాజు తీసుకొనవలసింది వదలడం, తీసుకోకూడనిది తీసుకోవడం వల్ల ప్రజలు రాజుని అసమర్థునిగా భావిస్తారు. రాజు ధర్మం తప్పడం వల్ల ఇహంలో అపకీర్తిని, మరణించాక నరకాన్ని పొందుతాడు.

రాజు యముని వలే కోపాన్ని అణచుకుని ఇంద్రియాలను గెలిచి, తన ఇష్టా ఇష్టాలను లెక్కచేయక సమబుద్ధి కలిగి వుండాలి .

రాజు అధర్మంగా వ్యవహరిస్తే అతని ప్రజలు విరక్తులై వుంటారు. అలాంటి రాజును అతని శత్రువులు సులభంగా వశపరుచుకుంటారు.

అప్పు తీసుకున్నవాడు అప్పు తీర్చ లేకపోతే, అప్పు ఇచ్చిన వాడికన్నా తను తక్కువ జాతివాడో, సమాన జాతివాడో అయితే తనకు చేతనయిన పని చేసి ఇచ్చి కూలి తీసుకోకుండా అప్పు చెల్లించాలి· అప్పు తీసుకున్నవాడు ఎక్కువ జాతి వాడ యితే అప్పును కొంచం కొంచంగా నలునా చెల్లించాలి.

నిక్షేపాన్ని (డబ్బు, బంగారం మొదలైనవి) దొంగలు ఎత్తుకుపోయినా, నిక్షేపం వెల్లువలో కొట్టుకు పోయినా, అగ్నికి ఆహుతి అయినా అందులోంచి ఆ నిక్షేపాన్ని భద్రపరచిన వాడు ఏమీ తీసుకోకపోతే, దానిని దాచిన వాడికి ఏమీ చెల్లించాల్సిన అవసరంలేదు.

ఎవడు నిక్షేపము దాచకుండా ఇవ్వమని అడుగుతాడో, ఎవడు నిక్షేపం వుంచుకుని లేదంటాడో వాడిని దొంగలను శిక్షించినట్టు శిక్షించాలి. అతను వుంచిన నిక్షేపం చాలా స్వల్ప విలువ గలది అయితే దానికి సమానంగా దండన విధిం చాలి.

'రాజుగారు నీ మీద కోపంగా వున్నాడు. నిన్ను కాపాడతాను. నాకు కొంత ధనం ఇవ్వు'- అంటూ ఇలా అబద్ధాలు చెప్పి ఎవ్వడు సంపదను అపహరిస్తాడో

వాడిని, వాడి పరివారంతో సహా వాళ్ళకు కాళ్ళు, చేతులు, ముక్కు, చెవులు, తల మొదలైనవి ఖండించేంత పెద్ద శిక్షలను విధించాలి.

బంగారం మొదలైన నిక్షేపాలను సాక్షుల సమక్షంలో అప్పగిస్తూ అది ఎంత బరువుందని చెబుతాడో, అంతే బరువుతో తిరిగి అప్పగించాలి. తూనిక విషయంలో వివాదం వస్తే సాక్షులు చెప్పిన తూనిక ప్రకారం తిరిగి అప్పగించాలి. నిక్షేపాన్ని దాచినవాడు వాదన చేస్తే, సాక్షులు చెప్పిన ప్రకారం అతనికి దండన విధించాలి.

ఎవడైనా నిక్షేపాన్ని రహస్యంగా దాస్తే, దాచినవాడు తిరిగి రహస్యంగానే అప్పగించాలి. అప్పుడు సాక్షులు వుండనవసరం లేదు.

ఈ నిక్షేపాల విషయంలో వివాదాలు రేగినప్పుడు రాజు నిధిని దాచిన వానికి ఆ నిక్షేపాన్ని తిరిగి ఇప్పించేలా తీర్మానించాలి.

ఒకడు వస్తువు స్వంతదారి కానప్పుడు సొంతదారి అనుమతి లేకుండా వస్తువును విక్రయిస్తే అలా అనధికారంగా వస్తువును అమ్మిన వాడిని ఎక్కడా సాక్షిగా తీసుకోకూడదు.

ఇతరుల ఆస్తిని విక్రయించేవాడు ఆ ఆస్తి యజమానికి సోదరుడు లేదా బంధువు అయితే వాడికి దండన విధించాలి. అతను బంధువు కాకపోతే దొంగను దండించినట్లు దండించాలి.

సొంతగాడు కానివాడు చేసిన దానం గాని, విక్రయం గాని చేసినట్లుకాదు.

వస్తువుకు యజమాని కానివాడు ఆ వస్తువును అంగడి వీధి మొదలైన బహిరంగ ప్రదేశాలలో అమ్మితే, ఆ తరువాత వస్తువు యజమాని తన వస్తువును గుర్తించినా కొన్నవాడిని రాజు శిక్షించకూడదు.బహిరంగ స్థలంలో కొన్నది కాబట్టి కొన్నవాడు దోషి కాదు. అయితే ఆ వస్తువు అసలు యజమాని కొన్నవాడికి సగం డబ్బు చెల్లించి ఆ వస్తువును స్వాధీనం చేసుకోవచ్చు.

ఒక వస్తువును మరో వస్తువుతో కల్తీ చేసి అమ్మకూడదు. పనికి మాలిన వస్తువులను మేలయిన వస్తువులని అమ్మకూడదు. తూనికలో మోసం చేయకూడదు. పనికిరాని వస్తువులను అమ్మకూడదు. పాత వస్తువులను కొత్త వస్తువులుగా భ్రమింపజేసి అమ్మకూడదు. సొంతదారు కానివాడు ఆయా వస్తువులను అమ్మినప్పుడు విధించే శిక్షనే వీళ్ళకూ విధించాలి.

ఓలిని తీసుకుని కన్యను ఇచ్చేవాడు మొదట మంచి లక్షణాలు గల కన్యను చూపి ఓలి తీసుకుని ఆ తరువాత అవలక్షణాలు గల మరో కన్యను వరుడికి ఇస్తే ఆ వరుడు ఇచ్చిన ఓలికే ఆ ఇద్దరు కన్యలను తీసుకునే హక్కు వుంది. ఓలిని తీసుకుని కన్యను ఇవ్వడం డబ్బు తీసుకుని వస్తువు ఇవ్వడం వంటిదే. కాబట్టి వస్తువులకు వర్తించిన ధర్మమే ఇక్కడా వర్తిస్తుంది.

వరుడు ఒక కన్యను పెళ్ళి చేసుకోవలిని ఓలి ఇచ్చాక మరణిస్తే ఆ కన్యను అతని తమ్ముడికి ఇవ్వాలి.

బ్రాహ్మణునికి నాలుగు వర్ణాలలో భార్యలుండి వారికి పుత్రులు పుడితే పున్న ఆస్తిని పది భాగాలు చేసి నాలుగు భాగాలు బ్రాహ్మణస్త్రీ పుత్రుడికి, మూడు భాగాలు క్షత్రియస్త్రీ పుత్రుడికి, రెండు భాగాలు వైశ్యస్త్రీ పుత్రుడికి, ఒక్కభాగం శూద్రస్త్రీ పుత్రుడికి ఇవ్వాలి.

శూద్రస్త్రీ కి సంతానము లేకపోతే ఆ సంపదను మిగిలిన వాళ్ళు తీసుకో వచ్చు. మిగిలిన వాళ్ళకు సంతానం లేకపోతే అ సంపదలో శూద్రస్త్రీ పుత్రుడికి వాటా రాదు.

శూద్రస్త్రీ పుత్రుడు గుణవంతుడయితేనే ఆ పదవ పాలు కూడా ఇవ్వవచ్చు. లేకపోతే ఇవ్వకూడదు.

శూద్రుడికి శూద్రస్త్రీ ఒక్కటే భార్యగా వుండవచ్చు. అంతకన్నా హెచ్చు జాతిదిగాని, తక్కువజాతిది గాని భార్యగా వుండతగదు. ఆమెకు ఎంత మంది పుత్రులు పుడతారో వాళ్ళందరికీ ఆస్తిని సమంగా పంచాలి.

భర్తకు అన్నం పెట్టడం, శుశ్రూష చేయడం, భిక్షం పెట్టడం, అతిథిపూజ, అగ్నిహోత్ర కార్యములు సిద్ధం చేయడం మొదలయిన పనులు ఎవడు సజాతిస్త్రీ సమీపంలో ఉండగా విజాతి స్త్రీతో చేయించుకుంటాడో అతడు బ్రాహ్మణ స్త్రీకి శూద్రుని వల్ల పుట్టిన వాడితో సమానమని ఋషులు పేర్కొన్నారు.

మంచి వరుడు లభించినప్పుడు వయసురాని కన్యకయినా వివాహం చేయ వచ్చు.

కూతురుకి వివాహం చెయ్యకుండా జీవితాంతం తండ్రి ఇంట్లో ఉంచుకున్నా ఫరవాలేదు. కానీ విద్యాగుణాలు లేని వరుడికి కన్యను ఇవ్వకూడదు.

కన్యకు పెళ్ళీడు వచ్చి మూడు సంవత్సరాలు గడిచినా ఆమెకు పెళ్ళిచెయ్య లేకపోతే అ కన్య తనకు నచ్చిన వరుణ్ని పెళ్ళి చేసుకోవచ్చు. వధూవరులిద్దరికీ పాపము సోకదు. ఇలాంటి కన్య పెళ్ళికి ముందు తండ్రి, సోదరులు ఇచ్చిన ఆభర ణాలన్నిటినీ పెళ్ళికి ముందే వాళ్ళకు తిరిగి ఇచ్చి వేయాలి. వరుడు ఓలి ఇవ్వనవ సరంలేదు.

ముప్పై ఏళ్ళవాడు పన్నెండేళ్ళ కన్యను వివాహమాడాలి. ఇరవై నాలుగేళ్ళ వాడు ఎనిమిదేళ్ళ కన్యను వివాహమాడాలి. అంతకంటే ముందే వివాహం చేసుకోవా లనుకునేవాడు నాశనం అవుతాడు.

వరునికి ఇవ్వబోయే కన్యకు ఉన్మాదం వున్నా, కుష్ఠు రోగం వున్నా, వివా హానికి పూర్వమే పరపురుషులతో సంబంధం వున్నా ఆ విషయాన్ని ఓలి తీసుకునే

వాడు ముందుగానే వరుడికి తెలపాలి. అలా తెలపక మోసంతో కన్యను ఇస్తే వాడు దండనార్హుడు.

* * *

సేవకుడు ఒక పని చేయడానికి ఒప్పుకుని ఏ అనారోగ్యమూ లేకున్నా అహంకారంతో చెప్పిన పని చక్కగా చెయ్యకపోతే రాజు వాడిని శిక్షించాలి. వాడికి ఒప్పుకున్న కూలి ఇవ్వనక్కరలేదు.

ఒకవేళ ఆ సేవకుడికి వ్యాధివస్తే, తగ్గిన తరువాత ఆ పనిని చెప్పిన విధముగా నెరవేర్చాలి. ఎంత కాలానికయినా అతనికి ఇవ్వవలసిన కూలీ ఇవ్వాలి.

ఎవడు ఒక పనిచేస్తానని ఒప్పుకుని రోగం వచ్చి తను చేయకున్నా ఇతరుల చేతనయినా చేయించడో, రోగం నయమయ్యాక తనైనా చెయ్యడో, చెయ్యవలసిన పని కొంచెం కొరత వున్నా వాడికి కూలీ ఇవ్వకూడదు.

గ్రామవాసులు గాని, దేశవాసులు గాని సంఘంగా ఏర్పడి అందరూ కలిసి ఒక పని చేయాలని నిర్ణయించుకున్న తరువాత ఎవడయినా లోభంతోనో, మరో కారణం చేతనో ఆ పనిచేయకపోతే అట్టివాడికి మహారాజు దేశ బహిష్కరణ శిక్ష విధించాలి.

ఒకడు మరొకని వద్ద నుంచి ఒక వస్తువు కొన్నప్పుడు తాను మంచి వస్తువును కొనలేదని కొన్నవాడు అనుకున్నా, తాను తక్కువ ధరకు పొరపాటున అమ్మానని అమ్మినవాడు అనుకున్నా ఆ వస్తువును పదిరోజుల లోపల తిరిగి ఇవ్వవచ్చు, తిరిగి తీసుకోవచ్చు.

పది రోజులు దాటిన తరువాత కొన్నవాడు తిరిగి తీసుకోమనిగాని, అమ్మినవాడు తిరిగి ఇవ్వమని కాని నిర్బంధించకూడదు. అలా నిర్బంధిస్తే వారిని రాజు శిక్షించాలి.

ఎవడు ద్వేషంతో ఈమె కన్యకాదు. సంభోగంలో పాల్గొన్నది అని ఒక కన్య గురించి చెబుతాడో ఆమె నిజంగా అలాంటిదా? కాదా? అని విచారించకుండానే వాడికి రాజు శిక్ష విధించాలి.

మనుషుల్లో వివాహ మంత్రాలన్నీ కన్యల గురించే వుంటాయి. కన్యలు కాని వారి విషయంలో ఈ మంత్రాలు వర్తించవు.

వరునికి తాను పెళ్ళాడబోయే కన్య విషయంలో ఏదయినా సందేహం వుంటే ఆమెతో ఏడడుగులు నడవక ముందే ఆమెను వదలవచ్చు. సప్తపది తర్వాత వదిలి పెట్టకూడదు.

* * *

పగటి పూట పశువులు మేపే బాధ్యత గొల్లలు తీసుకుంటారు కాబట్టి పగటి

పూట పశువులకు ఏదయినా హాని జరిగితే గొల్లలు బాధ్యత వహించాలి. రాత్రులు యజమానుల ఇళ్ళకు తీసుకువచ్చి తోలుతారు. కాబట్టి రాత్రులు వాటి యోగక్షేమాలు యజమానుల బాధ్యత. అలా కాకుండా రాత్రులు కూడా పశువుల్ని పొలాల్లోనే వాళ్ళ ఆధీనంలోనే గొల్లలు వుంచుకుంటే ఆ సమయంలో పశువులకు ఏం జరిగినా గొల్లలే బాధ్యత వహించాలి.

ఆవుల యజమాని పనివాడికి జీతం ఇవ్వకపోతే అతను యజమానికి పది ఆవుల పాలు పిండి ఇచ్చి, తను ఒక ఆవు పాలు పిండుకోవచ్చు. జీతం లేనప్పుడు అదే అతని కూలి. అంటే యజమాని పనివాడికి ఒక ఆవుపాలు వదిలేసి పది ఆవుల పాలు పిండించుకోవచ్చు. మందలో ఉన్నప్పుడు పశువు కనబడకుండా పోయినా, పురుగు కాటు వేసినా, వేటకుక్కలు తిన్నా, ఏదయినా గుంటల్లో పడి పశువు చని పోయినా గొల్లవాడు దానిని యజమానికి తెచ్చి ఇవ్వాలి.

దొంగలు దొమ్మీ చేసి ఆవులను అపహరించుకుపోతే ఆ సంగతి గొల్లవాడు (పశువులు కాసేవాడు) వెంటనే యజమానికి తెలిపితే అప్పుడు పోయిన పశువులకు గొల్లవాని బాధ్యత ఏమీ ఉండదు.

ఒక గ్రామం చుట్టూ నాలుగు వందల మూరలు స్థలాన్ని బీడుగా వది లేయాలి. ఇది పశువుల మేతకు, మంచి గాలి పీయడానికి పనికి వస్తుంది. అదే పట్ట ణము అయితే పట్టణం చుట్టూతా పన్నెండు వందల మూరల స్థలాన్ని బీడుగా వది లేయాలి.

ఈని పది రోజులు కూడా కాని ఆవులను, దేవుళ్ళ కోసం వదిలి వేసిన ఎద్దులను పొలాలలో పడి తింటున్నా దండించకూడదు.

పొలం యజమాని పశువులే ఆ పైరులు మేసినా, రైతు సమయం మించి పోయిన తరువాత పొలంలో విత్తనాలు చల్లినా ఆ పొలం నుంచి రాజుకు రావలసిన దానికి పదింతలుగా అపరాధం విధించాలి. రైతుకు తెలియక సేవకుల వల్ల ఆ అప రాధం జరిగితే రైతుకు అందులో సగం అంటే ఐదు రెట్లు దండన విధించాలి.

*　　*　　*

ఇరు గ్రామాల మధ్య ఎల్లలకు సంబంధించిన గొడవలు ఏమయినా వస్తే రాజు జ్యేష్ఠ మాసంలో ఎల్లల గుర్తులను బట్టి ఎల్లలను నిర్ధారణ చేయాలి. ఆ సమ యంలో అయితే గడ్డి మొదలయినవి ఎండిపోయి ఎల్లలు స్పష్టంగా కనిపిస్తాయి.

అలా ఎల్లలు తెలియడానికి ఎల్లలుండే చోట మర్రి, రావి, మోదుగు, మద్ది, బూరుగ, తాటి మొదలయిన వృక్షాలను నాటాలి.

గ్రామాల మధ్య చెరువులు, బావులు, దేవాలయాలు మొదలయినవి నిర్మిం

చాలి. అవి ప్రజలకు ఉపయోగపడడమే కాకుండా జన సంచారం వుంటుంది. జన సంచారం వుండడంవల్ల చాలా సంఘటనలను వీళ్ళు సాక్షులుగా ఉపయోగపడ తారు.

నీతిమంతులయిన సాక్షులు శాస్త్ర ప్రకారం సరిహద్దు నిర్ణయం కావిస్తే వాళ్ళు పాప రహితులవుతారు. తప్పుగా నిర్ణయించే వాళ్ళను శిక్షించాలి.

రాజు సమక్షంలో గ్రామ పెద్దలు సరిహద్దు నిర్ణయం చేయలేనప్పుడు గ్రామం ఏర్పడినప్పటి నుంచి వున్న మూల పురుషులు, వంశపారంపర్యగా హద్దులు తెలిసిన ఆ గ్రామవాసులు లేనప్పుడు వేటగాళ్ళను,పక్షులను చంపి జీవించే వాళ్ళను, పశువు లుకాసేవాళ్ళను, బెస్తవాళ్లను, చెట్ల వేళ్ళు పెరికి జీవించే వాళ్ళను, పాముల వాళ్ళను, బిచ్చగాళ్ళను, పువ్వులు, పళ్ళు, కట్టెల కోసం అడవుల్లో తిరిగే వాళ్ళను అడగాలి. వీళ్లు తమ పనుల కోసం గ్రామం మీదుగా ఎప్పుడూ అడవులకు పోతుంటారు కాబట్టి వీళ్ళకు గ్రామ ఎల్లలు బాగా తెలిసి వుంటాయి. వీళ్ళు చెప్పిన ప్రకారం గ్రామాలు రెండింటికీ ఎల్లలను ఏర్పరచాలి.

ఒకే గ్రామంలోని పొలాలు, బావులు, గృహాలు వీటి ఎల్లలకు సంబంధించిన వివాదం ఏర్పడితే చుట్టు ప్రక్కల వున్న సాక్షులు చెప్పిన ప్రకారం ఎల్లలను నిర్ణ యించాలి.

ఎల్లల కోసం గ్రామవాసులు గొడవ పడుతుంటే సాక్షులుగా వచ్చిన వాళ్లు అబద్ధాలు చెప్పారంటే రాజు వాళ్ళను శిక్షించాలి.

అదిరించి, బెదిరించి ఇతరుల ఇళ్ళు, చెరువులు, గుంటలు, తోటలు, పొలాలు ఆక్రమిస్తే ఐదు వందల రూకలు దండన విధించాలి. ఒకవేళ తెలియక తనవే అనుకుని ఇతరుల ఆస్తిని ఆక్రమిస్తే కొద్ది శిక్ష విధించాలి.

రెండు గ్రామాల మధ్య ఎల్లల వివాదంలో గుర్తులు గాని, సాక్షులుగాని లేనప్పుడు, ఎల్లలు ఏర్పరచడానికి వీలుగానప్పుడు రాజు తానే ధర్మం ప్రకారం, పక్షపాతం లేకుండా రెండు గ్రామాల మధ్య వున్న వివాదాస్పద భూమి ఎవరికి ఉప యోగమో, అది లేకపోతే ఎవరికి నష్టమో గుర్తించి దానిని బట్టి ఆ భూమిని వాళ్లకు ఇచ్చి ఎల్లలను ఏర్పరచాలి.

0 0 0

క్షత్రియుడు బ్రాహ్మణుని దొంగ అని తిడితే నూరు రూకలు జరిమానా విధిం చాలి. బ్రాహ్మణుడు క్షత్రియుని దొంగ అని తిడితే అతనికి యాభై రూకలు జరి మానా విధించాలి. వైశ్యుడు బ్రాహ్మణుని దొంగ అని తిడితే నూట యాభైరూకలు గాని, రెండు వందల రూకలు గాని జరిమానా విధించాలి. బ్రాహ్మణుడు వైశ్యుని దొంగ అని తిడితే ఇరవై ఐదు రూకలు జరిమానా విధించాలి.

బ్రాహ్మణుని శూద్రుడు దొంగ అని తిడితే ఆ శూద్రుణ్ణి శారీరకంగా శిక్షించాలి. బ్రాహ్మణుడు శూద్రుణ్ణి దొంగ అని తిడితే పన్నెండు రూకలు జరిమానా విధించాలి.

బ్రాహ్మణులు వాళ్ళ వర్ణస్థులను వాళ్ళే తిట్టుకుంటే పన్నెండు రూకలు శిక్ష విధించాలి. బూతులు తిట్టుకుంటే ఈ దండన రెండింతలుగా వుండాలి.

శూద్రుడు బ్రాహ్మణులను దూషిస్తే అంటే 'పాపిష్టివాడా' మొదలయిన తిట్లు తిడితే అతని నాలుక కోయాలి. శూద్రుడు హీనమైన పాదం నుంచి జన్మించాడు కాబట్టి అతనికి ఆ శిక్ష విధించాలి.

ఒక బ్రాహ్మణుని శూద్రుడు 'నీవు చెడ్డ బ్రాహ్మణుడవు' మొదలయిన మాటలు అంటే ఆ శూద్రుడి నాలుక మీద బగ బగ మండుతున్న కర్రుతో కాల్చాలి.

ఒక శూద్రుడు ధర్మాల గురించి తెలుసుకుని బ్రాహ్మణుడితో 'ఇది నీవు పాటించవలసిన ధర్మము' అని చెబితే, రాజు ఆ శూద్రుని చెవిలో, నోటిలో కాగ బెట్టిన నూనెను పోయించాలి.

వికలాంగులను ఎవరయినా అవమానిస్తే వాళ్ళను శిక్షించాలి.

తల్లిని, తండ్రిని, పెళ్ళాన్ని, తోడబుట్టిన వాళ్ళని, కొడుకుని, గురువుని నిందించేవాడికి నూరు రూకలు జరిమానా విధించాలి.

శూద్రుడు ఒక బ్రాహ్మణుని కొట్టడానికి చేతినిగాని, కర్రనుగాని పైకి ఎత్తితే ఆ చేతిని కోసివేయాలి. కోపంతో కాలితో తన్నితే ఆ కాలిని కోసివేయాలి.

బ్రాహ్మణుడితో సమానంగా ఆసనం మీద శూద్రుడు కూర్చుంటే ఆ శూద్రుడి నడుం మీద కాల్చిన కర్రుతో వాతవేసి తరమాలి. అతడు చావకుండా అతని పృష్ఠమును కోసెయ్యాలి.

బ్రాహ్మణుడు ముఖాన ఉమ్మివేసిన శూద్రుడు రెండు పెదవులనూ రాజు కోయించి వేయాలి. మూత్ర విసర్జన చేసి అవమానిస్తే అతని మర్మాంగాన్ని కోయించి వేయాలి. బ్రాహ్మణుడిపై అపాన వాయువు విడిచిన శూద్రుడి గుదమును కోసి వేయాలి.

బ్రాహ్మణుడి జుట్టు పట్టుకున్న శూద్రుడి చేతులను నరికి వేయాలి.

బ్రాహ్మణుని మరో బ్రాహ్మణుడు కొట్టినా, రక్తం కారేలా హింసించినా నూరు రూకలు జరిమానా విధించాలి. ఎముకలు విరిగేలా కొడితే దేశ బహిష్కరణ గావించాలి.

పూలు, పళ్ళతో వున్న చెట్లను నరికిన వాడికి కూడా శిక్ష విధించాలి.

ఒకడివల్ల మరొకడికి దెబ్బలు తగిలినా, రక్తం కారినా ఆ దెబ్బలు మానే

దాకా అతనికి అయ్యే ఖర్చులను కొట్టినవాడు భరించాలి. అలా ఇవ్వని వాడిని రాజు శిక్షించాలి.

భార్య, కొడుకు, నౌకరు, శిష్యుడు, తమ్ముడు మొదలయిన వాళ్ళు నేరం చేస్తే వాళ్ళను తాడుతోగాని, బెత్తంతోగాని కొట్టాలి. అలా కొట్టవలసి వస్తే వీపు మొదలయిన వెనక వైపు శరీర భాగాలపైన కొట్టాలి. తలపై మాత్రం ఎప్పుడూ కొట్టకూడదు. అలా కాకుండా తనకు ఇష్టం వచ్చిన చోట కొడితే కొట్టిన వాడిని దొంగను శిక్షించిన విధంగా శిక్షించాలి.

రాజు దొంగలను పట్టుకోవడానికి బాగా ప్రయత్నించాలి. రాజు దొంగలను బాగా పట్టి శిక్షిస్తే కీర్తి, రాజ్యం వృద్ధి చెందుతాయి.

ప్రజలకు అభయం ఇచ్చే రాజును ఎప్పుడూ పూజించాలి. ప్రజా సంరక్షణ చేసే రాజుకు ఆ రాజ్యంలోని ప్రజలు చేసే పుణ్యంలో ఆరవ వంతు చేరుతుంది. అలా చేయని రాజుకు వాళ్ళు జేసే పాపంలో ఆరవ వంతు చేరుతుంది.

ఏ రాజు ప్రజా సంరక్షణ సరిగ్గా చేయక పన్నులు మాత్రం వసూలు చేసుకుంటాడో ఆ రాజు మరణించాక నరకాన్ని చేరతాడు.

దొంగలను దండించడం కంటే వాళ్ళను చెరసాలలో వుంచడం, సంకెళ్ళు వేయడం, చేతులు, కాళ్ళు నరకడం మొదలయిన శిక్షలను విధించాలి.

తన మేలు కోరుకునే రాజు తన వద్దకు పరిష్కారానికయి వచ్చి ఓడిపోయిన వారు, పిల్లలు, వృద్ధులు, రోగులు, కషంతో ఒకవేళ తనను తిట్టినా ఓర్చుకోవాలి. అలా ఓర్చుకున్న రాజు స్వర్గం చేరతాడు. ఓర్చుకోని వాడు నరకం చేరతాడు.

బ్రాహ్మణుని బంగారం దొంగిలించిన దొంగ ముసలమనే ఆయుధాన్ని గాని, చంద్రకొయ్యనుగాని భుజంమీద పెట్టుకుని 'నేను బ్రాహ్మణుని బంగారాన్ని అపహరించాను' అంటూ తల విరబోసుకుని, పరిగెత్తుతూ రాజు దగ్గరకు వెళ్ళాలి. రాజుని కలిసి 'మహారాజా నేను బ్రాహ్మణుని బంగారాన్ని దొంగిలించాను. నన్ను చంపండి! అని రాజుని కోరాలి. అప్పుడు రాజు ఆ ముసలంతో గాని, చంద్ర కొయ్యతోగాని దొంగను చంపినా, చచ్చేలా కొట్టి వదిలి పెట్టినా ఆ దొంగ బ్రాహ్మణుని సొమ్ము అపహరించిన పాపం నుంచి విముక్తుడు అవుతాడు.

అలా కాకుండా ఆ దొంగను దయతో రాజు విడిచిపెడితే ఆ దొంగకు చెందవలసిన పాపం రాజును చేరుతుంది.

రెండు వందల తూముల కంటే ఎక్కువ ధాన్యాన్ని అపహరించిన వాడిని వధించాలి. అలా దొంగిలించిన వాడు బంధువు అయితే తక్కువ శిక్ష విధించాలి, మిగిలిన సంపదల విషయంలోనూ ఇదే వర్తిస్తుంది.

హీనుడు ఉత్తముని ధనం అపహరిస్తే మరణ దండన విధించాలి. ఉత్తమ

వర్ణస్థుడు హీనుడి ధనాన్ని అపహరిస్తే దెబ్బలు కొడితే చాలు.

స్త్రీలు వజ్ర, వైఢూర్య, రత్నాలను అపహరించినప్పుడు దొంగిలించిన స్త్రీని చంపాలి.

ఏనుగులు, గుర్రాలు, ఆవులు, గేదెలు మొదలయిన పశువులను, ఆయుధాలను దొంగలు దొంగిలించినప్పుడు వాళ్ళు వాటిని ఏ ప్రయోజనం కోసం ఉపయోగించారో గమనించి, కొట్టడమో, అంగచ్ఛేదమో, చంపి వేయడమో చేయాలి.

బ్రాహ్మణుల గోవులను అపహరించినా, యాగం కోసం ఉద్దేశించిన పశువులను అపహరించినా వెంటనే ఆ అపహరించిన వాడి కాలిని సగం కోసి వేయాలి.

పాలు, పెరుగు, మజ్జిగ, మట్టిపాత్రలు, చేపలు, పక్షులు, నూనె, నెయ్యి, మాంసం, తేనె మొదలయిన వాటిని అపహరిస్తే వీటి వెలకు రెండు రెట్లు జరిమానా విధించాలి.

ఒక నేరాన్ని సామాన్య జనులు చేస్తే ఎంత జరిమానా విధిస్తారో, అదే తప్పు రాజు చేస్తే వేయి రెట్లు జరిమానా స్వయంగా విధించుకుని ఆ జరిమానాను నీటిలో సయినా వెయ్యాలి లేదా బ్రాహ్మణునికయినా ఇవ్వాలి.

కంచె వేయని తోటలలోని ఫలాలను, దుంపలను, హోమాగ్నికి సమిధలను, ఆవుకు గడ్డి మొదలైనవి యజమానిని అడగకుండా తీసుకున్నా అది దొంగతనం కాదు. వాటిని అపహరించిన వాడికి శిక్షలేదు.

బాటసారి అయిన బ్రాహ్మణుడు బత్తెమునకు లేక రెండు చెరకు గడలుగాని, రెండు దుంపలుగాని ఇతరుల పొలంనుంచి తీసుకున్నా అది నేరం కాదు.

ఎప్పుడు సకల వర్ణాలవారికి, సకల ఆశ్రమాల వారికి కొందరివల్ల స్వధర్మం పాటించను వీలుకాదో ఆ సమయంలో, రాజ్యంలో అరాచకం వున్నప్పుడు, శత్రు రాజులు దండెత్తి వచ్చినప్పుడు స్త్రీలను రక్షించడానికి, బ్రాహ్మణులను సంరక్షించడానికి, ఆత్మ సంరక్షణకు, న్యాయయుద్ధం చేసినప్పుడు చేసిన హింసవల్ల పాపం కలుగదు.

గురువు, బాలుడు, వృద్ధుడు, బ్రాహ్మణుడు మొదలైన వాళ్ళను ఎవరైనా చంపడానికి వస్తే వాళ్ళు ఆత్మరక్షణ చేసుకోలేని పరిస్థితుల్లో చంప వచ్చిన వాళ్ళను మరో ఆలోచన లేకుండా సంహరించాలి.

0 0 0

స్త్రీ పర పురుషుణ్ణి కోరడం వల్ల వర్ణ సంకరం ఏర్పడుతుంది. వర్ణసంకరం వల్ల, నిర్మలమైన భార్యలుగల గృహస్థులు లేకపోవడంవల్ల యజ్ఞాది క్రియలు సరిగ్గా జరగవు. యజ్ఞాలు సరిగ్గా జరగకపోతే, అధర్మం పెరిగిపోయి ప్రపంచం నాశనం అవుతుంది.

ఏ పురుషుడు పరస్త్రీతో ఏటిరేవులందుగాని, అడవిలోగాని, ఊరి వెలుపల పొదలు గల నిర్జన ప్రదేశంలోగాని, వనాల్లోగాని మాట్లాడటానికి తగిన కారణం వున్నప్పటికీ పరస్త్రీతో మాట్లాడతాడో అతన్ని పర స్త్రీ వ్యామోహపరుడని ఎంచి వేయి రూకలు జరిమానా విధించాలి.

ఎవడు ఒక స్త్రీని తాకరాని ప్రదేశాలైన పిరుదులను, స్తనాలను తాకుతాడో, అతను అలా తాకినప్పుడు ఆ స్త్రీ మౌనంగా వుంటుందో వాళ్ళిద్దరూ సంభోగాభిలాష గలవారని భావించాలి. వాళ్ళను దోషులుగా గుర్తించాలి.

బ్రాహ్మణేతరుడు తనని ప్రేమించని బ్రాహ్మణ స్త్రీని కోరితే వాడు మరణ శిక్షకు అర్హుడు. నాలుగు వర్ణాలవారూ ధనం, ఆస్తి, సంపదల కంటే భార్యను జాగ్రత్తగా కాపాడుకోవాలి.

బిచ్చగాళ్ళు, యజ్ఞ దీక్ష వహించిన వాళ్లు, వంటవాళ్లు, మొదలైనవాళ్లు పర స్త్రీలతో ఆటంకం లేకుండా మాట్లాడతారు. వాళ్ళను అనుమానించకూడదు.

యజమాని వద్దనున్న సేవకుడు స్త్రీలతో మాట్లాడకూడదు.వద్దన్నా మాట్లాడితే అలాంటి వాడిని రాజు శిక్షించాలి.

జానిస స్త్రీలతో, ఒక పురుషుని కోసం ఏర్పాటై వున్న వేశ్యలతో, బ్రహ్మ చారిణులైన బౌద్ధ సన్యాసినులతో సంభాషణ చేసేవాడు అపరాధం చెల్లించాలి.

బ్రాహ్మణేతరుడైన తుచ్ఛజాతివాడు తనను కోరని కన్యను సంభోగిస్తే అతడు లింగచ్ఛేద శిక్షకు అర్హుడు. తనను వలచిన స్త్రీని పొందేవాడికి ఏ శిక్షాలేదు.

సంభోగాపేక్షతో తన కంటే ఉన్నతజాతి పురుషుణ్ణి కోరే కన్యకు ఏమాత్రం శిక్ష విధించకూడదు. అలాగాకుండా తనకంటె నీచజాతి పురుషుణ్ణి కోరే స్త్రీని వాడి మీదనుంచి మనసు మళ్ళేటట్టు ఇంటిలోనే బంధించి వుంచాలి.

ఏ హీనజాతి పురుషుడూ ఉన్నత జాతి స్త్రీని తనను వలచిన దానినైనా పొందకూడదు. అలా పొందితే అతనికి లింగచ్ఛేదమో, మరణశిక్షనో విధించాలి. సమాన జాతి స్త్రీ తనను వలచిన దానిని పొందితే, ఆమె తండ్రి సమ్మతించే పక్షంలో అతడడిగిన ఓలిని ఇవ్వాలి. అప్పుడు ఆ వరుడు దండనార్హుడు కాదు. ఆ కన్యను అతడే వివాహం చేసుకోవాలి.

ఏ స్త్రీ తన తండ్రి ధనికుడని గర్వపడుతూ, అందమైన దానినని విర్ర వీగుతూ, పరపురుషుల ధ్యాసలోపడి భర్తను వదిలేస్తే, ఆ స్త్రీని రాజు ప్రజలందరి ముందు వేటకుక్కలచేత తినిపించాలి.

చండాల స్త్రీతో కూడిన వాడికి వెయ్యి రూకలు జరిమానా విధించాలి. వాడు మళ్ళీ చండాల స్త్రీతో కలిస్తే రెండువేల రూకలు జరిమానా విధించాలి.

మొగుడిని వీడివున్న స్త్రీని శూద్రుడు పొందితే ఆ శూద్రుడికి లింగచ్ఛేదము

చేసి వాని ధనం అంతా లాక్కోవాలి. మొగుడుతోవున్న స్త్రీని శూద్రుడు పొందితే అతన్ని నరికివేసి అతని ధనాన్నంతా తీసుకోవాలి.

భర్త అధీనంలో వున్న బ్రాహ్మణ స్త్రీని వైశ్యుడు సంభోగిస్తే అతన్ని ఒక సంవత్సరం కారాగారంలో వుంచి వాని సకల సంపదలను తీసుకోవాలి. అలాంటి స్త్రీని క్షత్రియుడు పొందితే వేయి రూకలు జరిమానా విధించాలి. గాడిద ఉచ్చతో తల గొరిగించాలి.

భర్త సంరక్షణలో లేని బ్రాహ్మణ స్త్రీని వైశ్య, శూద్రులు పొందితే అప్పుడు వైశ్యునికి నూరు రూకల దండము, క్షత్రియునికి వేయి రూకలు దండము విధించాలి.

భర్త సంరక్షణలో వున్న బ్రాహ్మణస్త్రీని బలాత్కారంగా పొందిన బ్రాహ్మణునికి వెయ్యి రూకలు జరిమానా విధించాలి. కోరి వచ్చిన దానితో ఒకసారి కూడిన వాడికి వంద రూకలు జరిమానా విధించాలి.

బ్రాహ్మణునికి మరణశిక్ష అంటే అతని తల గొరగడమే మరణశిక్ష. తక్కిన వర్ణాల వారికి ప్రాణం తీయడమే మరణశిక్ష.

బ్రాహ్మణుడు ఎన్ని పాపాలు చేసినా అతన్ని చంపకూడదు. ఒక్కదెబ్బ కూడా కొట్టకూడదు. అతని సంపదనంతా అతనికిచ్చి తమ దేశంనుంచి పంపించాలి.

బ్రాహ్మణుని చంపడంకన్నా మించిన అధర్మం ఈ లోకంలో మరొకటిలేదు. కాబట్టి రాజు బ్రాహ్మణునికి మరణశిక్ష విధించాలనే ఆలోచనను కూడా మనసులోకి రానివ్వకూడదు.

భర్త ఆధీనంలో వున్న క్షత్రియ స్త్రీని వైశ్యుడు పొందినా, వైశ్య స్త్రీని క్షత్రియుడు పొందినా భర్త ఆధీనంలో లేని బ్రాహ్మణ స్త్రీని పొందిన వారికి ఏ శిక్ష విధిస్తారో ఆ శిక్ష విధించాలి.

భర్త అధీనంలో వున్న క్షత్రియ, వైశ్య స్త్రీలను బ్రాహ్మణుడు పొందితే అతనికి వెయ్యి రూకలు జరిమానా విధించాలి.

భర్త ఆధీనంలో వున్న శూద్ర స్త్రీని క్షత్రియ,వైశ్యులు పొందితే వారికి వెయ్యి రూకలు జరిమానా విధించాలి.

0 0 0

తల్లి, తండ్రి, భార్య, పుత్రుడు వీళ్ళను పోషించక, సేవలు చేయవలసిన వారికి సేవలు చెయ్యకుండా వదిలిపెట్టకూడదు. తప్పు చేయని వారిని అలా విడిచి పెడితే విడిచిపెట్టినవాడికి వంద రూకలు జరిమానా విధించాలి.

బ్రాహ్మణులు తమ ఆశ్రమ ఆచారాల విషయంలో వివాదపడుతుంటే, రాజు ఇది శాస్త్రార్థం కాదని తీర్మానించకూడదు.

గ్రుడ్డి, చెవిటి, కుంటి, డెబ్బయి ఏళ్ళు నిండినవాడు, బ్రాహ్మణులకు ధన ధాన్యాలివ్వడం మొదలైనవి చేసినవాడు- వీళ్ళ వద్దనుంచి రాజు కప్పం తీసుకో కూడదు.

చాకలి ఒకరి బట్టలను మరొకరికి ఇవ్వకూడదు. అలా ఇస్తే అతను శిక్షార్హుడు.

సాలెవాడు పది పలముల నూలు తీసుకొని పదకొండు పలముల నూలు బట్ట నివ్వాలి. అంతకంటే తక్కువ ఇస్తే అతనికి పన్నెండు రూకల జరిమానా విధించాలి.

సుంకం ఎగ్గొట్టడానికి ఎవడు తన సరుకులను సంతలో అమ్మకుండా ఇతర స్థలాల్లో అమ్మాలనుకుంటాడో, ఎవడు రాత్రివేళల్లో అమ్మకాలు, కొనుగోళ్ళు చేస్తాడో, సుంకం ఎగవేయడానికి వాటి ధరలను మార్చి చెబుతాడో వాటి వస్తువుల విలువకు ఎనిమిది రెట్లు జరిమానా విధించాలి.

మనదేశం నుంచి ఇతర దేశాలకు ఎంత సరుకు పోతుంది ? ఇతర దేశాల నుంచి మన దేశానికి ఎంత సరుకు వస్తుంది? సరుకు తెచ్చాక ఎంతకాలం వుంచితే ఎంత ధరకు అమ్మాలి. వడ్డీ ఎంత అవుతుంది? పనివాళ్ళకు ఎంత ఖర్చవుతుంది? మొదలయిన విషయాలను చక్కగా విచారించి వర్తకుడికి, కొనేవాడికి నష్టంలేకుండా వుండేలా రాజు కొనుగోళ్ళు, అమ్మకాలు జరిపించాలి.

తూనికలు, కొలతలను ఉపయోగించే అన్ని పరికరాలు సరిగ్గా వున్నాయా లేదా అని పరీక్షించేందుకు సభ్యులను నియమించాలి. ఆ సభ్యులు ఆరునెలల కొకసారి వాటిని పరిశీలించి, ముద్రలు వేయించాలి.

బరువులేని బళ్ళు మొదలయిన వాటిని రేవు దాటించాల్సి వస్తే ఒకరూక, బరువు మోసేవాడికి అర రూక, పశువుకు పాతిక రూక, బరువులేని మనిషికి రూకలో ఎనిమిదవ వంతు పడవ వాడికి ఇప్పించాలి.

గాలి వాలును బట్టి నదిలో నీళ్ళు ఉండడం, లేకపోవడాన్ని బట్టి రేవు దాటించే రేట్లు నిర్ణయించాలి.

రెండు నెలలు నిండిన గర్భిణీ స్త్రీని, సన్యాసిని, వానప్రస్థుడిని, బ్రహ్మ చారిని, బ్రాహ్మణులను డబ్బు తీసుకోకుండా రేవు దాటించాలి.

నావ నీటిలో పోయేటప్పుడు ఏదయినా ఒక వస్తువు నావికుల అజాగ్రత్తవల్ల నీటిలో పడిపోతే నావికులు అంతా కలసి ఆ వస్తువు సొంతదారుకి నష్టంకట్టిఇవ్వాలి. దైవ వశాన కలిగిన తుపాను మొదలయిన వాటివల్ల వస్తువులకు నష్టం జరిగితే ఆ

నష్టాన్ని నావికులు చెల్లించనక్కరలేదు.

రాజు వైశ్యునిచేత వర్తకము, సేద్యము, పశు సంరక్షణ చేయించాలి. శూద్రుని చేత బ్రాహ్మణ శుశ్రూష చేయించాలి. అలా చేయని వైశ్య శూద్రులను రాజు దండించాలి.

బ్రాహ్మణుడికి సేవ చేయడం కోసమే శూద్రుణ్ణి బ్రహ్మ సృష్టించాడు. కాబట్టి శూద్రుడికి పోషణ ఖర్చులు ఇచ్చిగాని, ఇవ్వకుండాగాని సేవలు చేయించుకోవాలి. బ్రాహ్మణ శుశ్రూష నుంచి శూద్రుణ్ణి ఎవరూ తప్పించలేరు.

శూద్రుడికి ఇహలోక ఫలం లేకున్నా పరలోక ఫలం కోసమైనా శూద్రుడితో బ్రాహ్మణ శుశ్రూష చేయించుకోవాలి.

యుద్ధంలో ఓడిపోయి దాస్యం పొందినవాడు, కూలి మీద ఆశతో దాస్యం చేయడానికి వచ్చినవాడు, లంజెకొడుకు, సంతలో కొనబడిన వాడు, ఇతరులచేత ఇవ్వబడినవాడు, తండ్రి తాతల నుంచి వచ్చినవాడు, జరిమానా చెల్లించడం కోసం కూలి చేయడానికి ఒప్పుకున్నవాడు—వీళ్ళచేత దాస్యం చేయించుకోవచ్చు. పై ఏడు విషయాలు దాస్యానికి కారణాలు.

పుత్రుడు, భార్య, దాసుడు—వీళ్ళ ముగ్గురూ ధనహీనులు. ఏ కారణం వల్ల నయినా వాళ్ళు ధనం సంపాదిస్తే వాళ్ళు ఎవరికి సంబంధించిన వాళ్ళో వాళ్ళదే అవుతుంది ఆ ధనం కూడా.

బ్రాహ్మణుడు తన వద్ద దాసుడుగా వున్న శూద్రుడి దగ్గర నుంచి ధనం తీసుకోవచ్చు. ఎందుకంటే దాసుడికి సొంత ధనమేదీ లేదు. పైగా అతని ధనాన్ని తీసుకునే హక్కు యజమానికి వుంది కాబట్టి బలవంతగానయినా దాసుడి దగ్గర నుంచి బ్రాహ్మణుడు ధనం తీసుకున్నా అలాంటి బ్రాహ్మణుని రాజు దండించ కూడదు.

రాజు వైశ్యుడి చేత సేద్యము, వర్తకము మొదలయిన వాటిని, శూద్రుడి చేత బ్రాహ్మణ శుశ్రూష బలవంతంగానయినా చేయించాలి. ఎందుకంటే వాళ్ళు స్వకర్మల నుంచి తొలిగి ధనం సంపాదించారంటే ఆ ధనం వల్ల మదం హెచ్చి లోకాన్ని తారు మారు చేస్తారు.

*　　*　　*

భర్త మొదలయిన పురుషులు స్త్రీలను తమ ఆధీనంలో వుంచుకోవాలి. బాల్యములో తండ్రి స్త్రీలను రక్షిస్తాడు. యవ్వనంలో మొగుడు రక్షిస్తాడు. ముసలితనములో కొడుకులు రక్షిస్తారు. భర్త, కుమారులు లేకపోతే బంధువులు రక్షిస్తారు. కాబట్టి స్త్రీ ఎప్పుడూ స్వతంత్రురాలుగా వుండకూడదు.

కూతురుకు పెళ్ళి చేయవలసిన కాలంలో పెళ్ళిచేయని తండ్రిని లోకులు నిందిస్తారు. యవ్వనంలో ఏలుకోని భర్త నిందితుడు, భర్త చనిపోయిన తర్వాత తల్లిని కాపాడని కొడుకు నిందితుడు.

కొద్దిపాటి అయినా దుష్టస్నేహాల నుంచి స్త్రీలను చాలా జాగ్రత్తగా కాపాడాలి. వాళ్ళను అలా జాగ్రత్తగా కాపాడకపోతే వాళ్ళు ఉభయ వంశాలకు దుఃఖం కలిగిస్తారు.

బ్రాహ్మణులకు, తక్కిన వర్ణాల వారికి తమ తమ భార్యల శీల సంరక్షణ మిగిలిన అన్ని ధర్మాల కంటే ముఖ్యమని తెలుసుకోవాలి. మగడు వికలాంగుడైనా తన భార్యను జాగ్రత్తగా కాపాడుకోవాలి.

అలా భార్యను కాపాడుకోవడం వల్ల ఆమె పతివ్రత అయి మంచి సంతతిని పొందవచ్చు. శిష్టాచారము, తమ పెద్దల వంశమును కాపాడుకోవచ్చు. పరిశుద్ధమైన సంతతి గలవాడికి పరలోక క్రియల వల్ల ఫలితం వుంటుంది. పతివ్రత అయిన భార్య వుండడం వల్ల యాగాలు చేయవచ్చు కాబట్టి స్వధర్మ సంరక్షణ చేసుకున్నవాడవుతాడు.

భర్త రేతస్సు రూపంలో భార్యలో ప్రవేశించి, గర్భమై ఆ భార్యకు పుత్రుడుగా జన్మిస్తున్నాడు.

స్త్రీ గుణవంతుని పొందితే గుణవంతమైన సంతతిని, గుణహీనుని పొందితే గుణహీనమైన సంతతిని పొందుతుంది. కాబట్టి పరిశుద్ధమైన సంతతిని పొందడానికి భార్యను జాగ్రత్తగా కాపాడుకోవాలి,

స్త్రీలను బలవంతంగా కాపాడటం ఎవ్వరికీ తరం కాదు. కాబట్టి వారిని కొన్ని ఉపాయాలతో సంరక్షించుకోవాలి.

డబ్బును జాగ్రత్త చేయడం, ఖర్చు పెట్టడం, వస్తువులను జాగ్రత్తగా పెట్టుకోవడం, శరీరాన్ని అందంగా వుంచుకోవడం, భర్తకు సేవ చేయడం మొదలయిన పనులతోనూ, వంట వార్పులతోనూ, గృహోపకరణాలను సంరక్షించుకోవడం మొదలయిన పనులకు వాళ్ళను వినియోగించాలి.

కాపలాలు పెట్టి ఏ స్త్రీని కాపాడలేరు. ఏ స్త్రీలు తమను తాము కాపాడుకుంటారో వాళ్ళే ఉన్నతంగా వుంటారు.

మద్యపానము, దుష్టుల సహవాసము, భర్తకు దూరంగా వుండడం, ఇష్టం వచ్చినట్లు తిరగడం, అతి నిద్ర, పొరుగిళ్ళల్లో వుండటం అనే ఈ ఆరు లక్షణాలు స్త్రీలు చెడిపోయే మార్గాలు.

వీళ్ళకు ప్రాయంతో పనిలేదు. రూపసి, కురూపి అని చూడరు. అనుభవించడానికి పురుషుడు అయితే చాలు అనుకుంటారు.

ఒక స్త్రీ పురుషుని చూడగానే అతనిని వాంఛించడం వల్ల, మనసును అదుపులో పెట్టుకోలేక పోవడంవల్ల, వ్యభిచార దోషంవల్ల ఆ స్త్రీని భర్త ఎంతగా సంరక్షించినా ఆమెకు భర్తమీద ప్రేమ లేకుండా పోతుంది.

సృష్టి ప్రారంభమైనప్పటి నుంచి స్త్రీల స్వభావం ఇదని తెలుసుకుని పురుషుడు స్త్రీలను అదుపులో వుంచుకోవడానికి ప్రయత్నించాలి.

శయ్య, పీఠము, ఆభరణాలు, కామక్రోధాలు, కపటము, పరద్రోహము, పరహింస, కుత్సితపు నడవడి కలిగి వుండడం ఇవన్నీ స్త్రీలకు మొదటి నుంచి వున్నాయి. కాబట్టి స్త్రీలను జాగ్రత్తగా రక్షించుకోవాలి.

స్త్రీలకు వ్యభిచార మనస్తత్వం సహజం. వేదాలు కూడా స్త్రీల వ్యభిచార మనస్తత్వాన్ని తెలియజేస్తున్నాయి.

మనోవాక్కాయ కర్మలచే ఏ స్త్రీ భర్తను తప్ప వేరొకరిని కోరదో ఆమె పతివ్రత. అట్టిది కానిది అపతివ్రత.

స్త్రీ ఎలాంటి గుణగణాలు గలవాడిని పెళ్ళి చేసుకుంటుందో ఆమె కూడా అలాంటి గుణగణాలు గలదిగా అవుతుంది. నది నీళ్ళు ఉప్పునీటి సముద్రంతో కలిసి ఉప్పగా అయిపోయినట్లు భార్య భర్త గుణగణాలు గలదిగా తయారవుతుంది.

స్త్రీల సంరక్షణ విషయంలో పెక్కు దోషాలు గురించి చెప్పినప్పటికీ సంతానము కలగడానికి స్త్రీలు కారణం కాబట్టి వాళ్ళు మహోపకారులవుతారు. కాబట్టి వీళ్ళకు ఆభరణాలు, వస్త్రాలు మొదలయినవి ఇచ్చి సన్మానించాలి. స్త్రీలు, సంపద ఇంటికి కాంతిని ఒసగుతాయి. సంపద లేని ఇల్లు ఎలా ప్రకాశించదో, స్త్రీ లేని ఇల్లు కూడా అలా ప్రకాశించదు. స్త్రీ ఎక్కడ పూజింపబడుతుందో అక్కడే దేవతలు వుంటారు.

బిడ్డల్ని కనడం, పోషించడం, అతిథులకు, మిత్రులకు భోజనం పెట్టడం మొదలయిన పనులు భార్య చేస్తుంది. సంతానం, స్వధర్మానుష్ఠానం, శుశ్రూష, అనురాగం, తనకు, పితరులకు స్వర్గం—ఇవన్నీ భార్య అధీనంలో వుంటాయి.

ఏ స్త్రీ భర్తను తప్ప వేరే పురుషుణ్ణి కోరదో అట్టి స్త్రీ భర్తతో కలిసి సంపాదించిన పుణ్యలోకాలను పొందుతుంది. సజ్జనులచేత సాధ్వి, పతివ్రత అని కొనియాడబడుతుంది.

పర పురుషుడితో కలవడంవల్ల ఆ స్త్రీ లోకంచేత నిందింపబడుతుంది. మరు జన్మలో నక్కగా పుడుతుంది. పాప రోగాలు వస్తాయి.

స్త్రీ క్షేత్రం వంటిది. పురుషుడు బీజం వంటివాడు. క్షేత్ర బీజముల రెండింటి కలయిక వల్ల ప్రాణులు పుడతాయి.

సృష్టిలోని సకల జీవరాశులు బీజం యొక్క వర్ణ రూపాది చిహ్నాలను కలిగి వుంటాయి. కాబట్టి బీజ, యోనులలో బీజమే ప్రధానం.

విత్తు ఒకటి వేస్తే చెట్టు వేరొకటి మొలవదు. ఏ విత్తు వేస్తే ఆ చెట్టే మొలుస్తుంది. కాబట్టి క్షేత్రం కన్నా బీజమే ప్రధానమైంది.

తానొక్కడు మాత్రమే పురుషుడు కాడు. తాను, భార్య, బిడ్డ ముగ్గురూ కలిసి పురుషుడగును. కనుక ఎవడు భర్తయో వాడే భార్య అగునని వేదవేత్తలగు బ్రాహ్మణులు చెప్పారు. కాబట్టి ఆ భార్యకు పుట్టిన పుత్రుడు భర్తకే చెందినవాడవుతాడు.

భార్యను అమ్మివేసినా, దానంగా ఇచ్చినా భర్తనుంచి భార్యకు విడుదలలేదు. కాబట్టి ఎవడయినా పరభార్యను కొని ఆమె యందు సంతతి పొందినా ఆ సంతతి క్షేత్రస్వామికే చెందుతుంది గానీ బీజస్వామికి చెందదు.

తండ్రి అన్నదమ్ములకు ఆస్తి ఒకేసారి పంచి పెడతాడు. మళ్ళీ మళ్ళీ మార్చి మార్చి దాన్ని పంపకం చెయ్యడు. తండ్రి కన్యను ఒకసారే కన్యాదానం చేస్తాడు. ఆమెను మరోసారి మరొకరికి ఇవ్వడు. ఒకవేళ తండ్రి ఆమెను మరొకరికి ఇచ్చినా ఆమెకు పుట్టిన బిడ్డ క్షేత్రస్వామిదేగాని, బీజస్వామిది కాదు.

ఆవులు, గుర్రాలు, ఒంటెలు, మేకలు, గొర్రెలు మొదలైన వాటికి ఇతరులు ఎవడయినా సంతతి పుట్టించినా ఆ సంతతి వాడికి చెందకుండా యజమానికి ఎలా చెందుతుందో అలాగే పరస్త్రీతో సంతతి పొందినవాడు ఆ సంతతికి సొంతదారుకాదు.

ఒకతనికి ఇద్దరు ముగ్గురు భార్యలుంటే వారిలో ఒకామె సంతానవతి అయితే ఆ పుత్రుని వల్ల ఆ తల్లులంతా సంతానవతులుగా గుర్తింపబడతారు.

తండ్రి చనిపోయినప్పుడు, కొడుకు ఆ ఆస్థికి వారసుడు. కొడుకు లేనప్పుడు కూతురు, ఆమె కొడుకు వారసులు. వారు లేనప్పుడు భార్యే సకల ధనానికి అర్హురాలు. భార్య లేనప్పుడు పుత్రులు లేక కూతురు వారసురాలు. కూతురు లేనప్పుడు చనిపోయిన వ్యక్తి తల్లీ, దండ్రి వారసులు. వారు లేనప్పుడు చనిపోయిన వ్యక్తి సోదరులు వారసులు. వాళ్ళు లేకపోతే వాళ్ళ కుమారులు వారసులు, వాళ్ళు లేకపోతే సన్నిహిత దాయాదులు వారసులు. వాళ్ళెవ్వరూ లేకపోతే సమానోధకుడు వారసుడు. అతనూ లేకపోతే ఆచార్యుడూ, శిష్యుడు ఆ ధనానికి అర్హులు.

వాళ్ళెవ్వరూ లేకపోతే వేదాలు మూడింటిని సమగ్రంగా చదివిన బ్రాహ్మణులు ఆ సంపద పొందుటకు అర్హులు. వాళ్ళే పిండము నొసగుతారు. అలా జరిగితే మృతునికి శ్రాద్ధాది ధర్మ క్రియలకు హాని జరగదు.

వారసులు లేకపోతే క్షత్రియాదుల సంపదను రాజు తన కోశాగారానికి చేర్చుకోవాలి. దాయాదులు లేకపోయినప్పటికీ, బ్రాహ్మణుల సంపదను మాత్రం రాజు తీసుకోగూడదు. ఆ సంపదను బ్రాహ్మణులకు పంచిపెట్టాలి.

సంతతి లేకుండానే ఒకతను చనిపోతే అతని భార్య పెద్దల అనుమతి పొంది

సమాన గోత్రుని వల్ల పుత్రుని కనవచ్చును. అలా పుట్టినవానికి చనిపోయిన వ్యక్తి నుంచి వచ్చిన ధనం అంతా ఇవ్వాలి.

ఒక స్త్రీ మొదట ఒకతన్ని పెళ్ళాడి అతని ద్వారా కొడుకును పొందిన తరువాత అతను చనిపోతే అతని సంపదను తీసుకుని మళ్ళీ ఇంకొకతనిని పెళ్ళి చేసుకుందనుకోండి. అతనివల్ల మరో కుమారుణ్ణి కన్న తరువాత అతను కూడా చనిపోయి అతని ఆస్తి కూడా ఆమెకు లభించిందనుకోండి. ఆ స్తి విషయంలో ఆ కొడుకు లిద్దరికీ వివాదం వస్తే మొదటి వ్యక్తికి పుట్టినవాడు మొదటి భర్త ఆస్తిని, రెండవ వ్యక్తికి పుట్టినవాడు రెండవ వ్యక్తి ఆస్తిని తీసుకోవాలి. ఒకనికి పుట్టినవాడు మరొకని సంపదను తీసుకోకూడదు.

తల్లి చనిపోయిన తరువాత ఆమె కొడుకులు, పెళ్ళికాని కూతుళ్లు తల్లి ధనాన్ని సమానంగా పంచుకోవాలి. పెళ్ళిఅయిన కూతుళ్ళకు తండ్రి ధనాన్ని ఇచ్చినట్టే తల్లి ధనంలోనూ నాలుగవ వంతు పంచి ఇవ్వాలి.

భర్త జీవించి ఉండగా భార్య చనిపోతే ఆమె ఆస్థి సంతతికి చెందుతుంది.

బ్రాహ్మ లేదా దైవ లేదా ఆర్ష లేదా గాంధర్వ లేదా ప్రాజాపత్య పద్ధతిలో వివాహం చేసుకున్న స్త్రీకి సంతతి లేకుండా చనిపోతే ఆమె ఆస్తి భర్తకు చెందుతుంది.

ఆసుర లేదా రాక్షస లేదా పైశాచ వివాహం చేసుకున్న స్త్రీకి సంతతి లేకుండా చనిపోతే ఆమె ధనం ఆమె తల్లిదండ్రులకు చెందుతుంది.

బ్రాహ్మణుడు నాలుగు వర్ణాలకు చెందిన స్త్రీలను పెళ్ళాడితే క్షత్రియ, వైశ్య, శూద్ర స్త్రీలలో ఎవరయినా సంతతి లేక చనిపోతే వారి ధనం బ్రాహ్మణ సవతికిగాని ఆమె కొడుకుకుగాని చెందుతుంది.

భర్త బ్రతికి ఉండగా అతని భార్య ఏ ఆభరణాలను ధరిస్తుందో ఆ ఆభరణాలను భర్త చనిపోయిన తరువాత ఆమె కొడుకులు పంచుకోకూడదు. అలా పంచుకుంటే వాళ్లు పాపాత్ములవుతారు.

వికలాంగులు వారసత్వ సంపదకు అర్హులు కారు. వారికి అన్నపానాలు, కట్టుబట్టలూ ఇచ్చి కాపాడాలి.వారి సంపదను తీసుకున్నవారు వాళ్ళను జీవితాంతం శక్తినిబట్టి పోషించాలి. అలా పోషించని వాడిని పాపం చుట్టుకుంటుంది.

జూదము, వేశ్యాసంగమం మొదలయిన వ్యసనాలను మరిగిన కొడుకులు డబ్బు పాడు చేస్తూ వుంటే వారు తండ్రి ఆస్థిలో తమ భాగానికి అర్హులు కారు.

0 0 0

ప్రాణం లేని పాచికలు మొదలయిన వాటితో ఆడేదాన్ని జూదం అంటారు. కోళ్ళు, మేకలు, పొట్టేళ్ళు మొదలయిన వాటితో పందెం పెట్టి ఆడేదాన్ని సహ్వ

హ్వాయమంటారు.

జూద, సమాహ్వాయములు రెండూ రాజ్య నాశనకారులు, కాబట్టి రాజు ఈ రెండు దోషాలను తనరాజ్యంలో లేకుండా చేయాలి.జూద,సమాహ్వాయములు రెండూ తెలిపే దొంగతనాల వంటివి. కాబట్టి వాటిని నివారించే ప్రయత్నం చేయాలి.

ఎవడు జూదం, సమాహ్వాయం తాను ఆడుతాడో, ఇతరుల చేత ఆడిస్తాడో వాడి నేరానికి తగినట్లు చేతులు నరకడం మొదలయిన శిక్షలు విధించాలి. ఇలాంటి వారిని రాజు తన దేశం నుంచి వెళ్ళగొట్టాలి.

రాజు చేత నియమింపబడి తప్పుడు ఉత్తర్వులు జారీచేసే వారిని, మంత్రులలో విభేదించే వారిని, స్త్రీ. బాల, బ్రాహ్మణ ఘాతుకులను, శత్రు సేవకులను రాజు చంపాలి.

రాజు నియమించిన మంత్రులు, న్యాయమూర్తులు ప్రజల తగువులను చక్కగా పరిష్కరించకపోతే వాటిని రాజు స్వయంగా మళ్ళీ విచారించాలి, ఆ ఉద్యోగులకు వెయ్యి రూకలు దండం విధించాలి.

బ్రాహ్మణ హత్యచేసినవాడు, మద్యపానం చేసే బ్రాహ్మణుడు, బ్రాహ్మణుని బంగారం అపహరించే దొంగ, గురుతల్పగామి—వీళ్ళు మహా పాతకులు.

వీళ్ళు ప్రాయశ్చిత్తం చేసుకోకపోతే వీళ్ళకు జరిమానా విధించడంతోపాటు గురుతల్పగామికి నొసట యావజ్జీవం గుర్తు వుండేలా భగ చిహ్నాన్ని కాల్చిన ఇనుప శలాకతో వాతవేయాలి. మద్యపానం చేసిన వాడి నొసట సురాధ్వజ చిహ్నాన్ని, బ్రాహ్మణుని బంగారాన్ని అపహరించిన వాడి నుదుట కుక్కపాదం వంటి వాత వేయాలి, బ్రహ్మహత్యచేసిన వాడి నుదుట తలలేని పురుషుని మొండెం బొమ్మను వాతవేయాలి.

వీళ్ళకు భోజనం పెట్టకూడదు. వీళ్ళ చేత యాగాలు చేయించకూడదు. వీళ్ళకు వేదాలు చెప్పకూడదు.వీళ్ళకు కన్యాదానం చేయకూడదు. వీళ్ళు దిక్కులేక బిచ్చమెత్తుకుంటూ అడవులు వెంటపడిపోతారు.

ఇలా నొసట గుర్తులు వేయబడ్డ వాళ్ళను ఎవ్వరూ చూడకూడదు. బంధువులు కూడా వదిలివేయాలి. వీళ్ళకు ఎవ్వరూ నమస్కరించకూడదు.

శాస్త్ర ప్రకారం ప్రాయశ్చిత్తం చేసుకున్న బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులకు నొసట గుర్తులు వేయించకూడదు, జరిమానా విధించాలి. ఈ అపరాధమే గుణవంతుడయిన బ్రాహ్మణుడు చేస్తే ఆతనికి తక్కువ జరిమానా విధించాలి.

ఈ తప్పును బ్రాహ్మణేతరులు బుద్ధి పూర్వకంగా చేస్తే వాళ్ళ సర్వస్వాన్ని దోచుకోవాలి. వాళ్ళు ఇష్టపూర్వకంగా చేస్తే కొన్నిసార్లు మరణదండన కూడా

విధించవచ్చు.

ఇలాంటి పాతకులకు విధించిన జరిమానాను, స్వాధీనం చేసుకున్న ఆస్తిని రాజు తీసుకోకూడదు. దురాశతో ఆ సొమ్మును రాజు తీసుకుంటే మహాపాతక దోషం అంటుతుంది.

ఆ సంపదను నదులలోనయినా పారవేయాలి. లేదా శాస్త్ర సంపన్నుడయిన బ్రాహ్మణునికయినా ఇవ్వాలి.

ఏ దేశంలో మహాపాతక ధనాన్ని రాజు స్వీకరించడో ఆ దేశంలో జనాలు దీర్ఘాయువులై ఉంటారు. బాలురు చనిపోరు, వికృత ప్రాణి పుట్టదు. పంటలు బాగా పండుతాయి.

శూద్రుడు బ్రాహ్మణుని కొట్టినా, డబ్బు దోచుకున్నా, బాధించినా ఆ శూద్రుని రాజు కఠినంగా హింసించాలి. కాళ్ళు చేతులు నరకడం, చంపడం మొదలయిన శిక్షలు విధించాలి.

చంపకూడని వానిని చంపడం వల్ల ఎంత పాపం వస్తుందో, చంపవలసిన వానిని చంపక పోవడంవల్ల అంత పాపం వస్తుంది. కాబట్టి కఠిన శిక్షలను విధించాలి. శాస్త్ర ప్రకారం శిక్షలు విధించే వాళ్ళకు పుణ్యం కలుగుతుంది.

సదాచారులను రక్షిస్తూ, దుష్టులను శిక్షించే రాజుల పాలన చక్కగా ఉంటుంది. ఆ రాజులు స్వర్గం పొందుతారు.

దొంగలను అణచకుండా కప్పం మాత్రం కట్టించుకునే రాజును ప్రజలు ద్వేషిస్తారు. రాజు అప్పటివరకు పొందిన పుణ్యం ఈ పాపం వల్ల నశిస్తుంది.

గూఢచారుల వల్ల దొంగల ఉనికి తెలుస్తుంది. కాబట్టి రాజు చారుల ద్వారా దొంగలను కనిపెట్టాలి.

తప్పుడు తూనికలు తూచి బంగారం మొదలయినవి అమ్మేవాళ్ళు పగటి దొంగలు, రాత్రులు ఇళ్ళకు కన్నం వేసి అడవుల్లో కాచుకుని వుండి, రహదారుల్లో బాటసారులను కొట్టి వారి ధనాన్ని దోచుకునేవాళ్లు రాత్రి దొంగలు, లంచగొండులు, భయపెట్టి ఇతరుల సొమ్ము దోచుకునే వాళ్ళు, జూదరులు, సంపద కలుగుతుంది, బిడ్డలు పుడతారు అని చెప్పి డబ్బు తీసుకునేవాళ్ళు సరిగ్గా తెలియకుండా జ్యోతిష్యం చెప్పేవాళ్ళు, సరయిన చికిత్స తెలియని వైద్యులు, నెరజాణలయిన వేశ్యలు— వీళ్ళను గురించి రాజు చారుల ద్వారా తెలుసుకోవాలి. వాళ్ళను కనిపెట్టి బంధించి శిక్షించాలి.

ప్రజలు చేరే రచ్చబండల దగ్గర, చలి పందిళ్ళు, మిఠాయి అంగళ్ళ దగ్గర, భోగపు జాణల గృహాల్లో, పానశాలలు, పూటకూళ్ళ భోజనం దొరికేచోట, నాలుగు దారులు కలిసే చోట, జనం గుంపులుగా చేరే చోట, చెట్లతోపుల్లో మొదలయిన

చోట్ల సైనికులు అప్పుడప్పుడు తిరుగుతూ ఉండాలి.కొంత సైన్యాన్ని అక్కడక్కడ కాపలా ఉంచాలి. అలా చేయడం వల్ల దొంగలు చేరరు.

బయట ప్రదేశాల నుంచి వచ్చి అక్కడ దొంగతనం చేసేవాళ్ళు ఆ ప్రాంత దొంగల సహకారం తప్పక తీసుకుంటారు. కాబట్టి వేగుల ద్వారా వీళ్ళను కనిపెట్టి ఉండాలి.

దొంగతనం చేసినట్టు ఆధారం లేకుండా చంపకూడదు. నిర్ధారణ అయితే దొంగను శిక్షించకుండా వదలకూడదు. దొంగకు సహకరించిన వాళ్ళను కూడా రాజు శిక్షించాలి.

దొంగలు గ్రామాన్ని కొల్లగొడుతున్నప్పుడు, ఎవరయినా చెరువు కట్టలు తెగగొడుతున్నప్పుడు దారిలో దొంగలు కనిపించినప్పుడు దగ్గరలో ఉన్నవాళ్ళు ఎవరు తమ శక్తి కొద్దీ సాయపడరో వారిని దేశం నుంచి తరిమి కొట్టాలి.

రాజు కోశాగారం నుంచి డబ్బు దొంగిలించే వాడిని, రాజాజ్ఞ మీరేవాడిని, శత్రు రాజులతో తన రాజుకు విభేదాలు కలిగించే వాళ్ళను వాళ్ళ నేరానికి తగినట్టు చేతులు, కాళ్ళు నరకడం, నాలుక తెగ్గోయడం మొదలయిన శిక్షలు విధించాలి.

కాయ చికిత్స, శల్య చికిత్స మొదలయినవి చేసే వైద్యుడు సరయిన మందు ఇవ్వక హాని కలిగిస్తే ఆ వైద్యుణ్ని రాజు దండించాలి.

ఒకే ధర తీసుకుని ఒకడికి మంచి వస్తువు, ఒకడికి చెడ్డ వస్తువు ఇచ్చిన వాడిని, ఒకే వస్తువు, ఒకడి దగ్గర ఒక వెల, మరొకడి దగ్గర మరో వెల తీసుకునే వాడిని శిక్షించాలి.

చెరసాలలను రాజ మార్గాలలో ఎక్కువ జనసంచారం వుండే చోట కట్టించాలి. సంకెళ్ళతో బంధింపబడి, చిక్కి, శల్యమైన నేరస్తులను ప్రజలు చూడటంవల్ల ప్రజల్లో నేర స్వభావం తగ్గుతుంది.

ఎవడు నాశిరకం విత్తనాలు, కల్తీ విత్తనాలు అమ్మి వ్యవసాయాన్ని దెబ్బ తీస్తాడో వాడి ముక్కు, కాళ్ళు, చేతులు నరికివేయాలి.

తప్పుడు తూనిక, వన్నె తక్కువ బంగారం, కల్తీ చేయడం మొదలయిన పనులు చేసిన కంసాలిని నేరానికి తగినట్టు దేహాన్ని ముక్కలు ముక్కలుగా నరకాలి.

రాజు, మంత్రి, పురం, రాజ్యం, బొక్కసం, చతురంగ బలం, చెలికాడు— ఈ ఏడింటిని రాజ్యానికి సప్తాంగమంటారు. వీటిలో తరువాతి వాటి కంటే ముందువి ముఖ్యమైనవి. చెలికాడు కంటే బలం, బలం కంటే బొక్కసం, బొక్కసం కంటే రాజ్యం, రాజ్యం కంటే పురం, పురం కంటే మంత్రి, మంత్రి కంటే రాజు ముఖ్యం. కాబట్టి రాజు తనను తాను కాపాడుకోవాలి,

రాజు స్వరాజ్యాభివృద్ధికి, పర రాజ్య నాశనానికి దోహదం చేసే కార్యాలను నిరంతరం చేస్తూ వుండాలి. వీటివల్ల తనకు కష్టాలు కలిగినా విసుగు చెందక మళ్ళీ మళ్ళీ ప్రయత్నిస్తూనే వుండాలి.

ప్రాణవాయువు సకల జీవులలో ప్రవేశించి చరించే విధంగా రాజు వేగుల ద్వారా తన రాజ్యం, పర రాజ్యంలోని విశేషాలన్నీ తెలుసుకోవాలి.

యముడికి మిత్రులు, శత్రువులు లేకపోయినా నిందించే వాడినయినా, పూజించే వాడినయినా ఎలా సమానంగా చూస్తాడో అలాగే రాజు నేరాలు చేసినవాళ్ళ పట్ల రాగద్వేషాల కతీతంగా వ్యవహరించాలి.

కోశాగారం తరుగుదల మొదలయిన ఆపదలు సంభవించినా రాజు బ్రాహ్మణులకు ఆగ్రహం కలిగించకూడదు. బ్రాహ్మణులకు ఆగ్రహం కలిగిస్తే వారు రాజును శపించి సపరివారంగా రూపుమాపుతారు.

ఏ బ్రాహ్మణులు అగ్నిని సర్వ భక్షకుడివి గమ్మని శపించారో, సముద్ర జలాన్ని తాగడానికి అనర్హము కావించారో, చంద్రుని క్షయ రోగిని చేశారో అలాంటి బ్రాహ్మణులను ఆగ్రహపరిచి ఎవరు సుఖంగా ఉంటారు?

ఏ బ్రాహ్మణులు స్వర్గాది లోకాలను, ఇంద్రాది దిక్పాలురను సృష్టించగలరో, దేవతలను సైతం శపించి మానవ జన్ములుగా చేయగలరో, ఏ బ్రాహ్మణులను భూమ్యాది లోకాలను, దేవతలు ఆశ్రయించి వుంటారో అట్టి బ్రాహ్మణులకు జీవితం మీద ఆశ గలవాడెవ్వడూ హాని చేయడు.

సంస్కరింపబడినదయినా, సంస్కరింపబడనిదయినా అగ్ని ఎలా దైవతమో అలాగే మూర్ఖుడయినా, విద్వాంసుడయినా బ్రాహ్మణుడు దైవమే.

అగ్ని ఎలా శ్మశానంలో శవాన్ని దహించినా అపరిశుద్ధం కాకుండా యజ్ఞాలలో ప్రకాశిస్తుందో అలాగే బ్రాహ్మణుడు పెక్కు నీచ కార్యాలు చేసినప్పటికీ సర్వ విధాలా పూజనీయుడే. బ్రాహ్మణుడు దైవంతో సమానం.

బ్రాహ్మణునికి బాధ కలిగించే క్షత్రియుణ్ని బ్రాహ్మణులు శాపాలొసగి శిక్షిస్తారు. ఎందువల్లనంటే క్షత్రియుడు బ్రాహ్మణుని వల్ల పుట్టినవాడు. బ్రాహ్మణుని బాహువు వల్ల జన్మించిన వాడు.

నీటినుంచి అగ్ని, బ్రాహ్మణుని నుంచి క్షత్రియుడు, రాతి నుంచి లోహం పుట్టాయి. ఇవి తమ దహన, పరాక్రమ, ఛేదన శక్తులను చూపగలిగినా తమ ఉత్పత్తి కారణాలయిన జల, బ్రాహ్మణ, పాషాణములందు తమ శక్తిని చూపలేవు.

రాజుకు ముసలితనం వచ్చినప్పుడు, తీరని వ్యాధి సంభవించినప్పుడు పాపిధనం కాకుండా మిగిలిన ధనం అంతా బ్రాహ్మణుల కిచ్చి, కుమారుడికి రాజ్యం అప్పగించి, ఉత్తమగతి కోరి యుద్ధంలోనయినా ప్రాణాలు విడవాలి. లేదా యుద్ధం లేనప్పుడు ప్రాయోపవేశమైనా చేయాలి.

తొలుత బ్రహ్మ ప్రజలను సృష్టించి వారి సంరక్షణ బాధ్యతను బ్రాహ్మణుడికి క్షత్రియుడికి అప్పగించాడు. గోవులను సృష్టించి వాటి సంరక్షణ బాధ్యతను వైశ్యు లకు అప్పగించాడు.

వైశ్యుడు ఉపనయన సంస్కారం చేసుకుని, వివాహం చేసుకుని, జీవించడం కోసం సేద్యం, పశు సంరక్షణ మొదలయిన పనులను చేపట్టాలి.

వైశ్యుడు పశు సంరక్షణ చేయనని ఎప్పుడూ చెప్పకూడదు. వైశ్యుడు తప్ప వేరొకడు గోసంరక్షణ వృత్తిని చేపట్టకూడదు.

వైశ్యుడు పొలాల గుణదోషాల గురించి, పంటల గురించి చక్కగా తెలుసు కోవాలి. గో పోషణలో మెళకువలను నేర్చుకోవాలి.

వివిధ భాషలను నేర్చుకోవాలి. ఏ వస్తువుకు ఏ దేశంలో ఎంత విలువవుందో తెలుసుకోవాలి. ఏ వస్తువును ఎక్కడ ఎంత ధరకు అమ్మవచ్చునో తెలుసుకోవాలి. శూద్రుడు బ్రాహ్మణులకు శుశ్రూష చేసి ఉత్తమ లోకాలను పొందాలి. శూద్రుడు బ్రాహ్మణులను వారు లేకపోతే క్షత్రియులను, వారు లేకపోతే వైశ్యులను ఆశ్రయించి వారికి సేవలు చేస్తే మరు జన్మలో తన జాతికన్నా ఉత్తమమైన జన్మ పొందుతాడు.

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులు వేదాలను అధ్యయనం చేయాలి.బ్రాహ్మణుడు మాత్రమే వేదాలను బోధించాలి. క్షత్రియ, వైశ్యులు వేదాలను బోధించకూడదు.

వేదాలను బోధించడం, యజ్ఞాలు చేయించడం, సద్విజుల నుంచి ప్రతి గ్రహం తీసుకోవడం అనేవి మూడే బ్రాహ్మణుని జీవనానికి ఆధారాలు.

క్షత్రియునికి శస్త్రాలను, అస్త్రాలను ప్రజా సంరక్షణ కోసం, జీవిక కోసం ఏర్పరచారు. వర్తకం, సేద్యం, గో సంరక్షణ వైశ్యుని జీవిక కోసం ఏర్పరిచారు.

ఈ జీవన ధర్మాలలోనూ బ్రాహ్మణుడికి వేదాధ్యయనం, క్షత్రియునికి ప్రజా సంరక్షణ, వైశ్యునికి వర్తకం ముఖ్యమైనవి.

బ్రాహ్మణుడు తన ధర్మమైన వేదాధ్యయనం, వేదాధ్యాపనాలచే జీవితం గడ వడం కష్టంగా ఉంటే తనకు తరువాతది క్షత్రియ వృత్తి గనుక క్షత్రియ వృత్తి అయిన నగర, గ్రామ సంరక్షణలతోనయినా జీవితాన్ని గడపవచ్చు.

బ్రాహ్మణుడు తన వృత్తిలో గాని, క్షత్రియ వృత్తిలో గాని జీవనం గడపడం కష్టమైతే అప్పుడు వైశ్య వృత్తి అయిన సేద్యం, పశుపాలన, వర్తకం మొదలయినవి చేసి జీవించవచ్చు.

క్షత్రియుడు కూడా తన వృత్తి సాగనప్పుడే వైశ్య వృత్తిని అవలంబించాలి.

వ్యవసాయం కొందరు శ్రేష్ఠమైన వృత్తి అని భావిస్తారు. కాని ఇది సజ్జన నింద్యము. ఎందుకంటే భూమిని దున్నేటప్పుడు నాగలి మొదలైనవి చాలా జంతువు లను చంపుతాయి కాబట్టి ఇది అనర్థమైనది.

బ్రాహ్మణునకు, క్షత్రియునకు తన వృత్తి దొరకనప్పుడు వర్తకం చేయ

వచ్చును గానీ పండ్లు, దుంపలు, ఔషధాలు, నీరు, శస్త్రము, విషము, మాంసము, సుగంధ ద్రవ్యాల్లు, పాలు, తేనె, పెరుగు, నెయ్యి, నూనె, బెల్లము, దర్భలు వీటిని విక్రయించకూడదు. పక్షులను, చేపలను, మద్యము, లక్క మొదలయిన వాటిని అమ్మకూడదు. మాంస లవణములను, లక్కను అమ్మడంవల్ల వెంటనే భ్రష్టుడవు తున్నాడు. పాలు అమ్మడం వల్ల మూడు రోజులలో శూద్రుడవుతాడు.

పైన చెప్పిన వస్తువులు విక్రయించడం వల్ల బ్రాహ్మణుడు ఏడు రాత్రులలో వైశ్యుడవుతున్నాడు.

క్షత్రియుడు వైశ్య వృత్తితో జీవించవచ్చు గాని, బ్రాహ్మణ వృత్తితో జీవించ కూడదు. క్షత్రియుడొక్కడే కాదు, బ్రాహ్మణేతరులెవరూ బ్రాహ్మణ వృత్తితో జీవించ కూడదు. హీనజాతిలో పుట్టినవాడు ఉన్నత జాతి ధర్మాలతో జీవిస్తే అలాటి వాడిని రాజు కనిపెట్టి వాడి సంపదనంతా తీసుకుని వాడిని దేశం నుంచి వెళ్ళగొట్టాలి.

గుణవంతమైనది కాకున్నా స్వధర్మమే మేలు, పర ధర్మంతో జీవించేవాడు జాతి నుంచి భ్రష్టుడవుతాడు.

వైశ్యుడు స్వ వృత్తులతో జీవించలేకపోతే శూద్ర వృత్తి అయిన ద్విజ శుశ్రూషలతో జీవించవచ్చు. కాస్త కోలుకున్నాక శూద్రవృత్తి అయిన శుశ్రూషను వదలాలి. బ్రాహ్మణులకు నిందితాలైన ప్రతిగ్రహముల వల్ల ఎలాంటి దోషం కలగదు. వాళ్ల జలంతోను, అగ్నిహోత్రునితోను సమానులు గదా! స్వభావముతో పరిశుద్ధులు కాబట్టి వారికి ఏ దోషాలు అంటవు.

బ్రాహ్మణుడు ప్రాణాంతక స్థితిలో తక్కువ జాతి ఇంట భోజనం చేసినా ఆకాశానికి బురద అంటనట్టు ఆ బ్రాహ్మణునికి పాపం అంటదు.

శిల్పము, వైద్యము, రాజుల వద్ద కొలువుండి జీతం తీసుకోవడం, ఇతరుల సేవ, పశువులు కాయడం, వర్తకం, తాను చేసే సేద్యం, బిచ్చమెత్తడం, వడ్డీ జీవనము—ఆపదలో ఉన్నవాళ్ళందరూ వీటివల్ల జీవించవచ్చు.

బ్రాహ్మణుడు, క్షత్రియుడు ఆపదలో కూడా ధనాన్ని వడ్డీ కిచ్చి దానితో బ్రతకకూడదు. స్వర్గలోక ప్రాప్తి కోసం శూద్రుడు బ్రాహ్మణ శుశ్రూషే చెయ్యాలి. బ్రాహ్మణ శుశ్రూషకుడు అనే పేరు రావడమే శూద్రునికి జన్మ సాఫల్యం.

శూద్రుడికి ఇతర వృత్తుల కంటే బ్రాహ్మణ శుశ్రూషయే ఉత్తమ కార్యమని శాస్త్రాలలో పేర్కొన్నారు. బ్రాహ్మణ శుశ్రూషగాక ఇతర కార్యాలు ఎన్ని చేసినా అవి నిష్ఫలం అవుతాయి.

బ్రాహ్మణ కుటుంబం భోజనానంతరం మిగిలిన అన్నాన్ని శూద్రునికి ఇవ్వాలి. పాతబడ్డ బట్టల్ని, తరకల ధాన్యాన్ని ఇవ్వాలి.

శూద్రుడు ధన సంపాదన చేయగలిగిన సామర్థ్యం గలిగిన వాడయినా కుటుంబ అవసరాలకు మించిన ధనాన్ని సంపాదించకూడదు. శూద్రుడు ఎక్కువ ధనం సంపాదిస్తే ధర్మశాస్త్ర పరిజ్ఞానం లేనివాడయి బ్రాహ్మణులనే హింసిస్తాడు.

బ్రాహ్మణులకు విరివిగా దానం చెయ్యాలి. అలాంటి దానాల వల్ల దాతకు స్వర్గాది పుణ్యలోకాలు లభిస్తాయి.

వృద్ధులయిన తల్లిదండ్రులను, పతివ్రత అయిన భార్యను, శిశువగు పుత్రుని నూరు పనులు చేసి అయినా పోషించాలని మనువు చెప్పాడు.

యజ్ఞానికి కావలసినవి ఏవైనా తమ దగ్గర లేకపోతే అవి శూద్రుని ఇంట్లో ఉంటే వాటిని బలాత్కారంగా గాని, దొంగిలించికాని తీసుకురావచ్చు. అంతేగాని శూద్రుని వద్దనుంచి యజ్ఞ సంబంధ వస్తువులను యాచించి తీసుకోకూడదు.

బ్రాహ్మణుడు ఎలాంటి పరిస్థితులలోనూ యజ్ఞం కోసం ధనాన్ని, శూద్రుని వద్ద నుంచి యాచించరాదు. అలా యాచించి శూద్రుని వద్దనుంచి పొందిన ధనముతో యాగం చేసినవాడు చనిపోయాక చండాలుడుగా పుడతాడు. కాబట్టి యజ్ఞానికి శూద్రుని యాచించి తెచ్చిన డబ్బు పనికిరాదు. కాని అయాచితంగా లభించిన ధనం యజ్ఞాలకు పనికి వస్తుంది.

ఎవడు యజ్ఞం కోసమని డబ్బు సంపాదించి ఆ డబ్బునంతా ఆ పనికి ఉపయోగించడో అతడు మరుజన్మలో గ్రద్దగానో, కాకిగానో పుడతాడు.

ఎవడు దేవాలయాల్లో పూజ కోసం ఏర్పాటు చేసిన ధనాన్నో, బ్రాహ్మణ ద్రవ్యాన్నో ఆశతో అపహరిస్తాడో అలాంటి పాపాత్ముడు మరు జన్మలో గద్దలు తినగా మిగిలిన అన్నం తింటాడు.

బ్రాహ్మణుల బంగారం దొంగిలించినవాడు పుప్పిగోళ్ళ వాడవుతాడు. మద్యపానం చేసేవాడు నల్లని దంతములు గలవాడవుతాడు. బ్రాహ్మణ హత్య చేసినవాడు క్షయరోగి అవుతాడు. గురువు భార్యతో కలిసినవాడు వృషణహీనుడవుతాడు. చాడీలు చెప్పేవాడు దుర్గంధపు ముక్కు గలవాడవుతాడు. లేని నేరాలు మోపేవాడు దుర్గంధపు నోరు గలవాడవుతాడు. ధాన్యచోరుడు అంగహీనుడవుతాడు. మంచి వస్తువుతో చెడ్డది కలిపి అమ్మేవాడు ఎక్కువ అంగములు గలవాడుగా, అన్నచోరుడు అజీర్ణ రోగిగా, గురువు ఆజ్ఞ లేకుండా అధ్యయనం చేసేవాడు మూగవాడుగా, వస్త్రచోరుడు తెల్ల కుష్ఠురోగం గలవాడుగా, గుర్రాన్ని దొంగిలించినవాడు కుంటివాడుగా పుడతారు. పాపాలకు ప్రాయశ్చిత్తం చేసుకుని పాపాలను పోగొట్టుకోనివారు పరలోకంలో అనుభవించగా మిగిలిన పాపశేషంతో తరువాతి జన్మలో వికృత రూపంతో జన్మిస్తారు. కాబట్టి పై జన్మలకయినా ఇలాంటి వికృత జన్మలు రాకూడదనుకుంటే ఈ జన్మలోనయినా ప్రాయశ్చిత్తం చేసుకోవాలి.

బ్రాహ్మణుడు కానివాడు నేను బ్రాహ్మణుడనని చెప్పడం, రాజు ఎదుట దొంగలు మొదలయిన వారికి మరణశిక్ష విధించేలాగా అబద్ధాలు చెప్పడం, గురువుపై నింద మోపడం ఇవి అన్నీ బ్రాహ్మణ హత్యతో సమానం.

తెలియక బ్రహ్మ హత్య చేసిన బ్రాహ్మణుడు పన్నెండేళ్ళ వనంలో గుడిసె వేసుకుని వుండాలి. తెలిసి బ్రహ్మ హత్య చేస్తే ఇరవై నాలుగేళ్ళ వనంలో గుడిసె

వేసుకుని వుండాలి. అలా వుంటూ శిరోముండనము చేసుకుని 'బ్రాహ్మణ హత్య చేశాను. నాకు భిక్ష పెట్టండి' అంటూ ఏడు ఇళ్ళల్లో అడుక్కుని ఆ భిక్షాన్నాన్ని తినాలి. ఏమీ దొరకక్కపోతే నీళ్ళు తాగి పడుకోవాలి. బ్రాహ్మణుడికి ఈ ప్రాయశ్చిత్తము అయితే, క్షత్రియునికి దీనికి రెండింతలు గాను, వైశ్యునికి మూడింతలు గాను, శూద్రునికి దీనికి నాలుగింతలు గాను ప్రాయశ్చిత్తం ఉంటుంది.

వేదాలలో దేనినయినా ఒక దానిని జపిస్తూ, మితాహారియై, ఇంద్రియాలను జయించి, బ్రహ్మ హత్యా పాప పరిహారానికయి నూరు ఆమడల దూరం నడవాలి.

తెలియక క్షత్రియుని బ్రాహ్మణ, వైశ్యులు చంపితే వేయి ఆవులను, ఒక ఆంబోతును బ్రాహ్మణులకు దానం చేయాలి. బ్రహ్మ హత్యా వ్రతాన్ని మూడు సంవత్సరాలు ఆచరించాలి. వైశ్యుని చంపితే ఒక్క సంవత్సరం ఈ బ్రహ్మ హత్యా వ్రతాన్ని ఆచరించాలి. నూటొక్క ఆవులను బ్రాహ్మణులకు దానం చేయాలి.

పిల్లిని చంపితే మూడు రోజులు పాలను మాత్రమే ఆహారంగా తీసుకోవాలి. పాముని చంపితే వాడి మొనగల ఇనప దండమును బ్రాహ్మణునికి దానం చేయాలి. పందిని చంపితే నేతితో నిండిన పాత్రను బ్రాహ్మణుని కివ్వాలి. చిలుకను చంపితే రెండేళ్ళ దూడను దానం చేయాలి. హంస, కొంగ, నెమలి కోతి, డేగ, గ్రద్ద మొదలయిన వాటిని చంపితే బ్రాహ్మణునికి గోదానం చెయ్యాలి. గుర్రాన్ని చంపితే వస్త్ర దానం చేయాలి. ఒంటెను చంపితే ఒక గురిగింజ ఎత్తు బంగారాన్ని దానం చేయాలి. వ్యభిచారిణి ఆయిన బ్రాహ్మణ స్త్రీని చంపితే గుర్రపు జీనును, అలాంటి క్షత్రియ స్త్రీని చంపితే విల్లును, వ్యభిచారిణి అయిన వైశ్య స్త్రీని చంపితే. ఒక మేకను, అలాంటి శూద్ర స్త్రీని చంపితే పొట్టేలును బ్రాహ్మణునికి దానం చేయాలి.

గుణవంతులయిన బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య స్త్రీలను పొరపాటున చంపితే శూద్రుని హత్యకు విధించిన ప్రాయశ్చిత్తం చేసుకోవాలి.

మేనత్త కూతురు, పినతల్లి కూతురు, పెదతల్లి కూతురు, మేనకోడలు, మేనమామ కూతురు తోడబుట్టిన సోదరి వలే పొందతగనివారు. బుద్ధిమంతుడు వీరిని పెళ్ళి చేసుకోకూడదు.

బాలుడ్ని చంపినవాడిని, చేసిన మేలు మరచి అపకారం చేసినవాడిని, శరణాగతుని చంపినవాడిని, స్త్రీ హత్య చేసినవాడిని—వాళ్ళు ప్రాయశ్చిత్తము చేసుకున్నా వాళ్ళతో నివశించకూడదు, వాళ్ళను వదిలివేయాలి.

బ్రాహ్మణుని చంపగోరి కొయ్య పైకెత్తితే నూరేళ్ళు నరకం పొందుతాడు. ఆ కొయ్యతో కొడితే వెయ్యి సంవత్సరాలు నరకం పొందుతాడు.

పాపం చేసిన మనిషి పశ్చాత్తాపము చెందడం వల్ల, తపస్సు చేయడం వల్ల, వేదాధ్యయనం వల్ల ఆ పాపం నుంచి విముక్తి చెందుతాడు. తపస్సు చేసే శక్తిలేనివాడు గోదానాదుల చేత పరిశుద్ధుడవుతాడు.

చేసిన పాపం గురించి సజ్జనుల ముందు ఎంతగా వెల్లడి చేసుకుంటాడో అంతగా పాము కుబుసం విడిచినట్లు పాప విముక్తుడవుతాడు.

ప్రాయశ్చిత్తం చేసుకున్నా ఆ మనిషి మనసుకు తృప్తి కలగకపోతే, ఆ ప్రాయశ్చిత్తాన్ని తన మనసుకు తృప్తి కలిగే వరకు ఆచరిస్తూనే వుండాలి.

దేవతలు, మానవులు అనుభవించే సుఖం అంతటికీ కారణం తపస్సు. తపస్సులోనే ఆ సుఖం నిలిచి వుంది.

బ్రాహ్మణునికి బ్రహ్మచర్యా రూపమైన వేదాంతాన్ని తెలుసుకోవడమే తపస్సు. రాజుకు ప్రజా సంరక్షణమే తపస్సు. వైశ్యునికి వ్యవసాయం, వాణిజ్యం, పశుపాలనలే తపస్సు. శూద్రునికి బ్రాహ్మణుని పరిచర్యయే తపస్సు.

బ్రాహ్మణ హత్య మొదలయిన మహాపాపాలు చేసినవాళ్ళు, మహా పాతకాలు చేసినవాళ్ళు చక్కగా తపస్సును ఆచరించడం వల్ల ఆ పాపాన్ని అధిగమించగలరు.

తేళ్ళు మొదలయిన పురుగులు, మిడుతలు, పశువులు, పక్షులు, వృక్షాలు, జంతువులు తపో మహిమ వల్లనే స్వర్గం చేరుతున్నాయి.

సకల జంతువులకు ఏది దుసాధ్యమో అట్టి జన్మాన్ని తపస్సు చేత పొంద వచ్చని దేవతలు తెలుసుకుని, అన్నిటికీ తపస్సే మూలమయినదని తపోమహిమను కొనియాడారు.

అగ్ని ఎలా దగ్గరలో నున్న కట్టెలను క్షణంలో దహిస్తుందో, అలాగే జ్ఞాన మనే అగ్నిచేత వేదవేత్త అయిన బ్రాహ్మణుడు సకల పాపాలను దహిస్తాడు.

గొప్ప నీటి మడుగులో పడిన మట్టిపెళ్ళ ఎలా కరిగిపోతుందో అలాగే ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదాలను మూడుసార్లు పారాయణం చేయడం వల్ల సకల పాపాలు నశిస్తాయి.

శాస్త్ర సమ్మతమైన కర్మలను చేయడం వల్ల సుఖాన్ని, శాస్త్ర విరుద్ధమైన కర్మలను చేయడం వల్ల దుఃఖాన్ని పొందుతారు. ఈ కర్మాచరణ వల్లనే మానవు లకు ఉత్తమ, మధ్యమ, అధమ జన్మలు కలుగుతున్నాయి. ఉత్తమ కర్మచే దైవ త్వాన్ని, మధ్యమ కర్మచేత మనుష్య జన్మను, అధమ కర్మచేత పశుపక్ష్యాది జన్మము పొందుతారు.

ఇతరుల ధనం అన్యాయంగా గ్రహించాలని తలచడం, బ్రాహ్మణ హత్య మొదలయిన పాపకార్యాలను మనసులో తలచడం, పరలోకం లేదని, దేహమే జీవాత్మ అని పట్టుదల కలిగి వుండటం—ఇవి మూడు మానసిక పాపాలు.

చెడు మాటలు మాట్లాడటం, అబద్ధాలు చెప్పడం, పరోక్షంలో యితరులను దూషించడం నిజమైనప్పటికీ తనకు సంబంధం లేని రాజు, దేశం, పురజనులను గురించి మాట్లాడడం—ఇవి నాలుగు వాక్కునకు సంబంధించిన అశుభ కర్మలు.

ఇతరుల సొమ్ము అన్యాయంగా తీసుకోవడం, శాస్త్రీయం కాని హింస, పరుని భార్యతో కలవడం—ఇవి మూడు శరీర పాపకర్మలు.

ఈ పది విధాలయిన అధర్మ మార్గాలను వదిలివేయాలి.

మానవుడు శరీర సంబంధమైన కర్మదోషాలతో చెట్టు, కొండ మొదలయిన స్థావర రూపాలను వాగ్దోషాలతో పక్షిత్వాన్ని గాని, మృగజన్మను గాని పొందు తాడు. మానసిక పాపాలతో చండాల జన్మను పొందుతాడు.

నిషిద్ధమైన పలుకులు పలకక పోవడాన్ని వాగ్దండం అంటారు. చెడు తల పులు లేక పోవడాన్ని మనోదండ మంటారు. చెడ్డ పనులు చేయకపోవడాన్ని కాయ దండం అంటారు. ఈ మూడు సుగుణాలు ఎవరి మనసునందు గలవో అతన్ని త్రిదండి అంటారు.

ఇతరుల సొమ్ము అపహరించే గుణం లేకుండటం, చెడు తలపు లేకుండటం, దైవంమీద నమ్మకం ఈ గుణాలు శుభ మానసకర్మలు.

మంచి మాటలు మాట్లాడటం, సత్యమే పలకడం, పరోక్షంలో ఇతరులను పొగడటం, పురాణాలలోని రాజుల చరిత్రలను చదవడం—ఇవి వాక్కునకు సంబం ధించిన శుభ కర్మలు.

అహింస, ఇతరుల సొమ్మును అన్యాయంగా తీసుకోకపోవడం, పరస్త్రీని సోదరిలా చూడటం....ఇవి శరీర శుభకర్మలు.

జ్ఞానం సత్త్వగుణ లక్షణం. అజ్ఞానం తమోగుణ లక్షణం. రాగ ద్వేషాలు రజోగుణ లక్షణాలు. ఇవి మూడు గుణాలు సర్వ ప్రాణులందు ఉండే లక్షణాలు.

వేదాభ్యాసం, శాస్త్రార్థ జ్ఞానం, ఇంద్రియ నిగ్రహం, దానాది సత్కార్యాలు చేయడం, బ్రహ్మధ్యానంలో ఆసక్తి—ఇవి సత్వగుణ కార్యాలు.

ఫలితం కోరి కార్యాలు చేయడం, చిన్న పని చేయడానికి కూడా అధైర్య పడటం, కాని పని చేయబూనడం—ఇలాంటివి రజోగుణవంతుని కార్యాలు.

అత్యాశ, తాగుబోతుతనం, అధైర్యం, చాడీలు చెప్పడం, ఆచారాలను పాటిం చక పోవడం, యాచించే స్వభావము, సంపద, వసతి వున్నా ధర్మమునందు ఆసక్తి లేకపోవడం — ఇవి తామస గుణం గలవాని కార్యాలు.

కామం ప్రధానంగా కలిగివుండడం తామస గుణ లక్షణం. ధనం మీద అత్యాశ రజోగుణ లక్షణం. ధర్మసత్వమే సత్వగుణ లక్షణం. కామానికి అర్థము కారణం కాబట్టి కామము కంటే అర్థము మేలు. ధర్మమే అర్థ, కామాలకు హేతువు కాబట్టి, అర్థ కామముల కంటే ధర్మము మేలు.

ఎవరు సత్వగుణమునందు నిలకడ కలిగి వుంటారో వాళ్లు దైవత్వం పొందు తారు. ఎవరు రజోగుణమునందు నిలకడగా వుంటారో వాళ్లు మానవజన్మ పొందు తారు. ఎవరు తమోగుణనిష్ఠులో వాళ్ళకు త్రివిధ జన్మలు ప్రాప్తిస్తాయి.

బ్రాహ్మణ హత్య చేసినవాడు కుక్క, చండాలుడు మొదలగు జన్మలెత్తుతాడు. మద్యపానం చేసిన విప్రుడు కీటకంగా, మలభక్షక జంతువుగా జన్మిస్తాడు. గురువు భార్యతో కలిసినవాడు క్రూర జంతువుగా జన్మిస్తాడు. రత్నాలు, ముత్యాలు, పగడాలు అపహరించినవాడు బంగారు పనిచేసే కంసాలివాడుగా పుడతాడు.

ధాన్యం దొంగిలించినవాడు ఎలుకగా పుడతాడు. తేనెను దొంగిలించినవాడు ఈగగా పుడతాడు. పాలను దొంగిలించినవాడు కాకిగా పుడతాడు. మాంసాన్ని దొంగిలించినవాడు గ్రద్దగా పుడతాడు. గుర్రాన్ని దొంగిలించినవాడు పులిగాను, పండ్లు దొంగిలించినవాడు కోతిగాను, స్త్రీని దొంగిలించినవాడు ఎలుగుబంటిగాను, బండ్లు మొదలయినవి దొంగిలించి ఒంటెగానూ, పశువులను దొంగిలించిన పొట్టేలుగానూ జన్మిస్తాడు.

స్త్రీలు ఈ విధంగానే పరుల సొమ్మును దొంగిలిస్తే పాపం పొందుతారు. పైన చెప్పిన ఆయా పాపాలతో, ఆయా జంతువులకు భార్యలై జీవిస్తారు.

ఏవి వేద బాహ్యములయిన స్మృతులో, ఏవి చెడు అర్థమును బోధించునో, ఏవి కుతర్కముల మీద ఆధారపడతాయో ఏవి దేవుడు లేడని బోధిస్తాయో, ఏవి వేద విరుద్ధాలయిన చార్వాకాదుల సిద్ధాంతాలో వాటిని అనుసరించిన వాడికి పరలోకములో నరకం ప్రాప్తిస్తుంది.

వేదమూలములు కాని శాస్త్రాలన్నీ నశిస్తాయి. వాటివల్ల ప్రయోజనం లేదు. అవన్నీ అబద్ధాలు. నాలుగు వర్ణాలు, నాలుగు ఆశ్రమాలు—ఇన్నెందుకు జరిగినవి, జరుగుతున్నవి, జరగబోయేవి—అన్నీ వేదాలవల్లనే శాశ్వతమై వున్నాయి అనేది మనువు భావన.

వేదరూపమయిన శాస్త్రము నెరిగినవాడు సేనాధిపత్యమును, రాజ్యాధికారాన్ని, దండనాయకత్వమును, సార్వభూమ్యాధిపత్యమును వహించడానికి అర్హుడై వున్నాడు.

కొద్దిగా వేదాధ్యయనం చేసిన వారి కంటే పూర్తి గ్రంథమును అభ్యసించిన వారు శ్రేష్ఠులు. అభ్యసించిన వారి కంటే వేదార్థాలను వల్లించిన వారు శ్రేష్ఠులు. వల్లించిన వారికంటే తదర్థ జ్ఞానము గలవారు శ్రేష్ఠులు. వారికన్నా అనుష్ఠించువారు మిక్కిలి శ్రేష్ఠులు.

—ఇందులో చెప్పని ధర్మశాస్త్ర విషయాలలో ఏదయినా సందేహం కలిగితే ముగ్గురికన్నా ఎక్కువ మంది పండితులు చేరిన గోష్ఠి ఏది ధర్మమని నిర్ణయిస్తే అదే ధర్మము మనువుచేత రచించబడిన ఈ ధర్మశాస్త్రాన్ని పఠించేద్విజుడు నిత్యము సదాచార సంపన్నుడై ఇష్టలోకాన్ని పొందుతాడు.

—o—